# ప్రసన్న రాఘవము.

జయదేవ కవికృతికి దెనుఁగు

గ్రంథకర్త:

## కవిరత్న కాకర్ల కొండలరావు

శతావధాని.



మొదటికూర్పు 1000

ప్రకాశకులు:

యర్రమిల్లి నారాయణమూర్తిగారు బి. ఏ., బి.ఎల్.,

1929.

శ్రీ (పవర్) ప్రెస్, ఏలూరు.

[వెల 1—0—0

# పీఠిక



శ్రీ జయదేవ కవీంద్రుఁడు రచించిన ప్రసన్నరాఘవమును చిరకాలము క్రింద మ. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు దెనిఁగించుటయు దానిని వేదము వెంకటరాయశాస్త్రిగారు విమర్శించుటయు నాంధ్రలోకమునకు విదితమే. నేను మద్రనగరమున నాంగ్లవిద్యాభ్యాసము సేయు తఱి కొందఱు మిత్రులు దీనిం దెలిఁగింపు మని కోరుటచే యచ్చటనే ప్రారంభించి తీరిక గలిగి నప్పు డెల్లఁ గ్రంథమును వ్రాయుచు మూఁడు సంవత్సరములకుఁ బూర్వమే దీనినిఁ బూర్తిచేసి యుంటిని. అన్నిటికన్న సాధ్యమైన పాఠము నిర్ణయించు కొనుటయే నాకీవిషయమున గలిగిన శ్రమ. ఎన్నిప్రతులు చూచినను కొన్ని తావులఁ గేవల మసందర్భపాఠములే యున్నవి. నరసాపురనివాసులును మహోదారశీలురు నగు మ. యఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారికీకృతి సంకితముఁ జేసితిని. వారియౌదార్యము నన్నే గాక యనేకులను హర్షాంభోనిధి ముంచినది. ఇదిగాక తణుకుగ్రామ నివాసులు గాది కామరాజుపంతులుగారీ గ్రంథము విని సంతసించి నాకుఁ గొంత ధనము పారితోషిక మొసంగిరి. దీనిపై విరివి యగు నుపోద్ఘాతమును కొద్దికాలముననే ప్రకటింప నున్నాఁడను. గుణదోషములు చదువరులే గ్రహింత్రు గాక. అచ్చుతప్పులు చాలతావులఁ గనుపట్టు చున్నవి. రెండవ ముద్రణమున నవి సవరింపఁ బడును. ఈగ్రంథ మిట్లు వెలువడుటకు మూలకారణము నామిత్రులు శిష్టా వెంకటసుబ్బకవిగారు. వీరందఱకు నేను కృతజ్ఞుఁడను.

ఇట్లు,

కవిరత్న కాకర్ల కోండలరావు,

శతావధాని.

అంత నచ్చట స్వచ్ఛంద వినోద కథావిధానమ్ముల కతిపయ దినమ్ములేగినం బదంపడి యొక్క సాయంసమయమ్మున మేము వాహ్యాళికిం బోవు తరుణమ్మున యదృచ్ఛావశంబున,

చ. ఎదురుగ వచ్చె నచ్చటికి కహీనకళానికరమ్ము మోముపై
మెదలెడువాఁడు సాత్త్వికుఁ డమేయవిధేయత నొప్పువాఁడు ము
ప్పది పయి కొన్నివర్షముల ప్రాయమువాఁడు నయప్రవర్తనం
గదిరెడువాఁడు సజ్జనుఁ డొకానొక పూరుషుఁ డప్పథంబునన్. 5

అంత మన్మిత్రుం డప్పురుషవర్యుని తోడ నించుక తడవు ప్రసంగించి మదీయవృత్తాంతంబుఁ గొంత యాతని కెఱింగించి పదంపడి,

ఉ. న్యాయవిదగ్రియుండు సుగుణాఢ్యుఁడు ధీరుఁడు మాన్యశీలుఁ డ
త్యాయత కీర్తిశాలి సుజనావన తత్పరమానసుండు ల
క్ష్మీయుతమందిరుండు బుధశేఖరుఁ డుత్తముఁ డెల్లమిల్లి నా
రాయణమూర్తి యీసుజనుఁ డంచును నా కెఱిఁగించెఁ బేరిమిన్.

అంత మే మెల్లరముం గూడి పురమందిరంబుం జేరి తత్ప్రాంగణప్రదేశంబున సుఖాసీనుల మై యున్న తరుణంబున,

సీ. లలితమేధా సముల్లాసి మల్లవధాని
సద్గుణాఢ్యుఁడు ప్రాణసఖుఁడు నాకు
ఆంధ్ర సంస్కృతవాఙ్మయ క్షేత్రముల లోని
వ్యవసాయకృతియె జీవనము నాకు
కవితావధూమణీ కరసరోజాతమే
యుసు రుండు దాఁకఁ జేయూఁత నాకు
సరసాగ్రణుల తోడి సల్లాపభంగియే
రాత్రిందివంబుఁ గుర్వనము నాకు

గీ. అమలినాష్టావధాన శతావధాన
సంజ్ఞకమ్ములు మోహనాస్త్రములు నాకు

భారతీదేవి నటియించు పట్టు లెల్లఁ
జారు లీలావిహార దేశములు నాకు. 7

అని సంక్షేపంబుగా మదీయ వృత్తాంతంబు నెఱింగించి మత్కృత ప్రసన్నరాఘవంబు నందంద వినిపింపఁగా నాలించి పరితుష్టమానసుండై కతిపయ దివసంబులలోన

ఉ. సంచితపుణ్యుఁ డాఘనుఁడు సత్వర మిద్ధకుతూహలంబున
న్నిర్మించి శతావధానసభ నెట్టన నప్పురి నేరుపాటు గా
వించి జయాఢ్యు నన్ను నటుపిమ్మట సింహలలాట కంకణ
ప్రాంచితహస్తుఁ జేసె బుధవర్గము లున్నసభాంతరంబునన్. 8

ఏతాదృశ కావ్యపిధానంబున నమ్మహనీయు వదాన్యతా సద్గుణంబులఁ బ్రత్యక్షంబుగా నెఱింగినవాఁడ నగుటం జేసి యితండ మఱియు కృతి కన్యారత్నంబునకుఁ దగినవరుం డని నిశ్చయించి యున్నంత నా శుభచరిత్రుండు నందుకుఁ దన కౌతూహలంబుం గూడ వెల్లడించి నన్నుం బ్రోత్సహించె. ఇట్టి రసికతా సాహసాది మహోన్నత గుణపరంపరల కాధారభూతుండు గావున,

---

—♦ కృతిపతివంశవర్ణనము. ♦—

ఉ. శ్రీయుతమూర్తి సర్వనిజ సేవకజాల శుభప్రదాత, ల
క్ష్మీయుపతీ మనోహరుఁ డశేష జగజ్జనపోషకుండు దీ
ర్ఘాయువుతోడి భాగ్యనివహమ్ములఁ గూర్చుచు నెఱ్ఱమిల్లి నా
రాయణమూర్తి నెల్లపుడు నారయుఁ గాతఁ గృపాసమేతుఁడై. 9

మ. సహజం బైనవిబోధముం దొఱఁగి యశ్రాంతంబు శ్రీయున్ సరో
రుహ గర్భాంగనయున్ గృహస్థలిని నారూఢోన్నతి న్నిల్చి ప్ర
త్యహముం జూతురు గాక భూరితరవాత్సల్యంబునన్ శ్లాఘ్య స
న్నహనుం డౌ నెఱమిల్లి వంశతిలకున్ నారాయణామాత్యునిన్. 10

ఇట్లు లాశీర్వాద విధానంబు నెఱపిన యనంతరంబ,

చ. ఘనులు రసజ్ఞు లౌనన( బొగడ్తను గన్న ప్రసన్నరాఘ
బనుత్కృతి నే గుణాంబునిధి కంకిత మిచ్చితి నట్టి ధీరు పా
వనకుల వర్ణనంబు నిటుఁ బాయక నే నొనరించు టొప్పుఁగా
వున సరసుల్ వినుండు శ్రుతిభూషలు గాఁగ మదీయవాక్యముల్ .11

సీ. దశముఖాంబుల తోడఁ దనరారు బ్రహ్మాండ
భాండమే సామ్రాజ్య భరము గాఁగ
నిగ్రహానుగ్రహ నిష్ణాతమతు లైన
వాగాయుధులె పరివారములుగ
అక్షయత్వంబె నైజాంకమ్ముగాఁ బొల్చు
వేదమ్ములే కోశవేశ్మములుగ
వాత్సల్యలేశమ్ము వలచి యెల్లఱు ప్రముఖ
వాణియే వలపులరాణి గాఁగ

గీ. నరకదమనుని గంభీర నాభి యగుచు
నలరుపంకేరుహంబె సింహాసనముగ
ముజ్జగంబుల శాసించు మొదటి వేల్పు
పరగు జగదాది యై హంసవాహనుండు. 12

క. ఆహంస వాహనునకును
నీహామాత్రమునఁ బుట్టి రిద్ధచరిత్రుల్
మోహవిదూరులు బ్రహ్మలు
సాహసికులు మూఁడు నాలు సంఖ్యలవారల్. 13

క. వారికి జనియించిరి సము
దారచరిత్రకులు గుణనిధానులు జ్ఞానా
ధారులు నానామునిబృం
దారకు లవ్వారి కెల్లఁ దలకట్టగుచున్. 14

సీ. భవరాక్షసీ కంఠ పరిబంధ నోద్దామ
పాశీభవ జ్జటాభాసురుండు
ఘనమోహతిమిర ప్రకాండ ఖండన చండ
భానూభవ ద్బ్రహ్మ వర్చసుండు
కామాదిషడ్వర్గ కాననాంతర దవ
జ్వాలీభవ న్నేత్ర సంయుతుండు
శమదమాహింసాది సకల సద్గుణరత్న
పేటీభవ చ్చిత్తవాటికుండు

గీ. భూరి పుణ్యతప స్యాభిభూషితుండు
నైజమాహాత్మ్య జిత వచోనాయకుండు
ప్రకటభూమీసురాన్వయ బాంధవుండు
పొలుచుఁ దుల లేక శ్రీవత్స మునివిభుండు. 15

గీ. ఇట్టిసుగుణమ్ములకు నెల్ల నిక్క యగుచు
బుధులనుతి కెక్కినట్టి యాపుణ్యధనుఁడు
ఘనుఁడు శ్రీవత్సమౌనియే కర్త గాఁగ
నలరు భూమీసురాన్వవాయమ్ము లందు 16

సీ. కవితా పతింవరా కరదత్తమాలికా
లాలితగ్రీవు లార్వేలవారు
నిఖిలలోకస్తుత్య నిగ్రహానుగ్రహ
స్ఫీతచారిత్రు లార్వేలవారు
క్రీడానిమిత్త మూర్తీభూత పరిపూత
వీరశాంతంబు లార్వేలవారు
నాగేశ వాగీశ నాళీక భవముఖ్య
వినుత వైదుష్య లార్వేలవారు

గీ. శిష్టజనహృద్య విద్యావిశేష లబ్ధ
విపుల నృపచిహ్నకలితు లార్వేలవారు

సూరిజనలోక సంతత స్తూయమాన
పృథుల వితరణ వీరు లార్వేలవారు. 17

గీ. అట్టి యార్వేలవారిలో నతులగతిని
వాసి వన్నెయుఁ గాంచి విస్ఫారకీర్తిఁ
దనరి సిరు లెప్పు తామరతంప రట్టు
లెసఁగఁ బెంపైరి యెఱమిల్లియింటివారు. 18

ఉ. ఆ యెఱమిల్లివంశమున యందుఁ జనించెను భూరితేజుఁ డ
త్యాయతకీర్తిమండితుఁ డహస్పతిదూరుఁ డగస్తిరాజు నా
రాయణభక్తశేఖరుఁ డుదారచరిత్రుఁడు బంధుహర్షసం
ధాయకుఁ డై మనోజ్ఞగుణధాముఁడు నై నిజవంశకర్తయె. 19

శా. ధీరోత్తంసుఁ డగస్తిరాజు విలసద్విఖ్యాలశుండాల రా
జీ రాజన్నవపాండుపంకజపతంస్రీభూత చంచద్యశః
పూరప్రీణిత సర్వసజ్జనతతీపూజ్య ప్రభావాఢ్యుఁ డై
భూరిశ్రీ విలసిల్లె మేటి యగుచున్ గోల్కొండ ధాత్రీస్థలిన్. 20

గీ. నర్తనముచేత గుణకదంబమ్ముచేత
ప్రథితవిద్యావిశేష వైభవము చేత
మిగుల ప్రఖ్యాతిఁ గనె నెఱమిల్లివంశ
కలశపాథోధిరా జయ్యగస్తిరాజు. 21

ఉ. ఆ పరమప్రభావనిధి యైనయగస్తికిఁ బుట్టె నంత సీ
తాపతి నామకుండు గుణధన్యుఁడు వంశకరుండు సంతత
శ్రీపతి పాదపంకరుహ సేవనలోలహృదంతరుండు వి
ద్యాపరతంత్ర మానసుఁ డహర్పతి బింబసమానతేజుఁ డై. 22

ఉ. నేర్చె విద్య లన్నియును నేరుపు మైఁ జననాఁడె మోదముం
గూరిచె సూరికోటులకుఁ గూకటి గూడక మున్నె యంకెకుం
దారిచెఁ గీర్తికాంత నుచితం బగుప్రాయము రాక మున్నె తా
మీఱి యగస్తిరాట్సుతుఁడు మేటి గుణంబుల వేయు నేటికిన్. 23

క. ఆతత విద్యా కుశలుఁడు
పూతచరిత్రుండు బంధు పూజ్యుఁడు విలస
న్నీతి సమేతుఁడు నగునా
సీతాపతి వాసభూమిఁ జెప్పెద వినుఁడీ. 24

సీ. సంపసిస్థా సమాహ్వాయ పూత గౌతమీ
శాఖామతల్లికా సంయుతంబు
భాసురాంతర్వేది పరమ పుణ్యక్షేత్ర
నికటభూభాగస్థలీ నిష్ఠితంబు
బహుపురాతన కాల పాశ్చాత్య వాణిజ్య
సుప్రసిద్ధ చరిత్ర శోభితంబు
ఆంగ్లభాషావిబోధ్యతి చిరంతనశైల
రున్నత పాఠశా లోన్నతంబు
గీ. చూతజంబీర మాకంద నారికేళ
తుంగ నారంగ పనస సంగతంబు
నిపుణ నైయాయికాది పండిత వరేణ్య
కృతనివాసంబు నరసాపురీవరంబు. 25

గీ. ఆపురంబె తనకు మేలి కాపురముగ
నీపు జోడును దన కెందు నెనయకుండ
నేఁపు మిగిలి రహించెఁ దా నెంత యేని
ధరణి సీతాపతి ప్రఖ్యఁ దనరు మేటి. 26

శా. ఆసీతాపతికిన్ జనించి రనఘుస్వాంతుండు గోపాలమున్
ధీసంపన్నుఁ డగ స్తిరాజును బుధానీక ప్రశంసార్హుఁ డై
వాసిన్ వేంకటరత్ననాముఁడును విభ్రాజ ద్గుణాన్వితు లై
వీసంబున్ లఘువృత్తి లేనిసుజనుల్ విద్యాన్వితుల్ పుత్రకుల్. 27

ఉ. వారల లోన నెంతయును వన్నెయు వాసియుఁ గాంచి మించె వి
స్తారమనీష నెందుఁ దనసాటి జగంబున గాన కాంగ్ల వి

ద్యారమణీయ నైజరసనాంచల చంచ దుదీర్యమాణ మా
ర్వీరుచిరోక్తి భాసురుఁడు వేంకటరత్నము న్యాయవాది యై. 28

సీ. ధరను దుర్లభ మైన ధనరాసు లవలీల
విరివిగా వేలకువే ల్గడించె
తాలూకబోర్డెల్లఁ దాన యై కోర్టుల్లో
వ్యవహారముల సర్దుబా టొనర్చె
నక్షత్రములలోన నలినారి గతి న్యాయ
వాదులం దెల్ల మేల్బంతి యయ్యె
సద్గుణమ్ముల రామచంద్రుతో సరివచ్చు
ప్రియపుత్రకునిఁ గాంచి పేరుఁ గాంచె

గీ. తాను వ్రాసిన వ్రాత వేదంబు నాఁగఁ
దిరుగు లేకుండఁ గోర్టులఁ దేజరిల్లఁ
బృథివి నెందును దుల లేక వినుతికెక్కి
ప్రథితుఁ డెఱమిల్లి వేంకటరత్న విభుఁడు. 29

చ. పరిణయ మాడె నాఘనుఁడు భవ్యను రత్నమ నామధేయ నై
పరగునతీశిరోమణిని పావనశీలను సన్నపూర్ణకుం
బురు డగుదీనవత్సలను బూజ్యచరిత్రను దానవీరసూ
త్కరమున నెల్ల మేటి యయి గ్రాలు పవిత్రవధూ మతల్లికన్. 30

ఉ. దండిత వైరి మండలుఁ డుదారుఁడు వేంకటరత్న మెంత ధ
న్యుండొ ప్రశస్తపుత్రుఁ గన నోచెను రత్నమగర్భసీమ ను
ద్దండకలాప్రచండు గుణదండ విఖండిత దోషకాండుఁ బా
షండ కదంబ నిర్మథనశౌండు నఖండయశోభిమండితున్. 31

సీ. రత్నమాంబాగర్భ రత్నాకరస్థలాం
తరలబ్ధ నవ్యరత్నాయితుండు
ప్రథిత వేంకటరత్న బహుజన్మసంచిత
స్ఫాయత్తపస్యా ఫలాయితుండు

ఘనకావ్య నిర్మాణ కర్మఠ కవిరత్న
వంశ సంతత బాంధవాయితుండు
దారిద్ర్యదావాగ్ని తప్తదీనాటవీ
చంచ న్నభోనభస్యాయితుండు

గీ. సహజ సౌభాగ్య సౌజన్య సంయుతుండు
శమసమేతుండు సత్యభాషారతుండు
ధర్మకర్మైకనిరతుండు దక్షిణుండు
పుట్టె నొకపుత్రకుఁ డఖండపుణ్యరాశి. 32

ఉ. ఆయనఘుండె మర్త్యపతికి నర్మిలి వల్లభుఁ డైనవాఁడు రా
ధేయసమాన దానగుణధీరుఁడు భూరివచోవిలాస ధౌ
రేయ గభీరమానసుఁ డరిందమ నీతికళా చణుండు నా
రాయణమూర్తినామకుఁడు రాజితకీర్తి ధరాతలంబునన్. 33

మ. వినయ స్థైర్య గభీరతాది గుణ గర్భీభూత చేతస్కుఁ డై
తనవారున్ బరివారునుం బొగడ విద్యా బుద్ధులం దీజి వ
ర్ణనకుం జిక్కని సత్ప్రవర్తనమునన్ భాసిల్లి విఖ్యాతినిం
గనె నెంతేనియు న్యాయవాది యగుచున్ నారాయణుం డున్నతిన్.

ఇట్టి యనన్యదుర్లభంబు లగు సౌజన్య సౌభాగ్య పరంపరల కాలవాలం బై యుండి,

గీ. దాసుకులుఁ డగు శ్రీరాము తనయుఁ డైన
మహిత గోవిందరాయ నామకుని సుతను
ధన్యగుణపేటికను శకుంతలను బెండ్లి
యాడి ధన్యతఁ గాంచె నారాయణుండు. 35

వ. ఇవ్విధంబునం బెండ్లి యై యథాశ్రుతి సంభృతంబు లగు గృహస్థధర్మంబులు నిర్వర్తించుచు సుఖం బుండు నంతఁ గొంత కాలంబున కాసాధ్వీలలామ యందుఁ గ్రమంబుగా

గీ. రామకృష్ణులు వేంకటరత్న వేంక
టేశ్వరులు నాఁగ నారసు లిద్ధమతులు
సుతులు నల్వురు సుగుణ సంయుతులు గలిగి
రమలమతి యైన నారాయ ణాధిపునకు. 36

మ. ధనధాన్యాది సమృద్ధియు న్విమల సంతానంబు భాస్వద్యశం
బును గాంభీర్య వదాన్యతాది సుగుణవ్యూహంబు స్వచ్ఛంద జీ
వనమున్ ధీవిభవంబుఁ జాతురియు దివ్యద్భంగి నెల్లప్పుడున్
దను సేవించుట ధన్యుఁడయ్యె మివుల న్నారాయణుం డెన్నఁగన్.

శా. ఛాత్ర చ్ఛాత్రవ మండలీ నుత నయ స్సైవ్యుండు సద్వర్ణనా
పాత్రత్సత్వగుణుండు మోహ మద లోభ క్రోధ దుశ్వస్ఛటా
వేత్రత్సావనవర్తనుండు సుజనావి త్తత్వ ఘోరాతప
చ్ఛత్ర ద్భాగ్యభరుండు మత్కృతితనూజాభర్త సామాన్యుఁడే. 38

సీ. స్తుతియింతు రెవ్వానిసుగుణసంపద నెల్ల
శత్రులైనను నసూర్యారణము నదలి
ప్రకటింతు రెవ్వాని భవ్యచారిత్రంబు
సాధూత్తములు గోష్ఠి సభల యందు
వాకొందు రెవ్వాని వరవదాన్యత్వంబు
ధీమద్విభులు దేశ దేశములను
వినుతింతు రెవ్వాని ఘనవత్సలత్వంబు
నఖిల మార్గణకోటు లహరహంబు

గీ. అట్టి శ్రీమెట్టుమిల్లి వంశామృతాంబు
రాశి రాకావిరాజి కైరవ కులాప్తుఁ
డై తనర్చెడు నారాయణాధిపునకుఁ
బెరలు సరివత్తురే యెందుఁ బృథివి యందు. 39

## —♦ షష్ఠ్యంత పద్యములు ♦—

క. ఏతాదృశ గుణగణ వి
స్ఫీతునకు నియోగివంశశేఖరునకు సం
ప్రీతహృదయునకు సమ్యగ
ధీతన్యాయాదిశాస్త్ర ధీసారునకున్. 40

క. రత్నాంబా శ్రీవేంకట
రత్నకుమారునకుఁ గీర్తిరాజితునకు స
ద్యత్నునకుత్తమసాధ్వీ
పత్నీకున కాత్తగౌరవశ్రీకునకున్. 41

క. సర్వకులాధిప శయన స
మర్పిత నిఖిలాచరణున కభిమతధన సం
తర్పిత కవిసంఘునకు స
హర్పతితేజునకు సద్గుణాభరణునకున్. 42

క. సురచిర శమదమ రాజిత
చరితునకుఁ బ్రశస్తదానశౌండీర్యునకున్
స్ఫురిత మనీషాయుతునకు
నెరమిల్లికులాంబురాశి హిమకిరణునకున్. 43

క. రారాజత్కీర్తికి బుధ
వారస్తుతధర్మమార్గవర్తికి దీనా
ధార ద్రవిణస్ఫూర్తికి
నారాయణమూర్తి కంగనారతిపతికిన్. 44

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్చిన ప్రసన్నరాఘవ నాటకంబు సమర్పణంబుఁ గావించితిం గాన నేతత్కృతి పరమేశ్వరు కరుణాకటాక్షంబున నాచంద్రతారార్కంబు విలసిల్లుఁ గాత.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

దాల్భ్యాయనుఁడు-యాజ్ఞవల్క్యుని శిష్యుఁడు.

మంజీరకుఁడు
నూపురకుఁడు } వందులు.

రావణుఁడు—ప్రతినాయకుఁడు.

బాణుఁడు—రాక్షసుఁడు.

ఇద్దఱు తాపసులు—మాయావేషధారులగు రాక్షసులు.

రాముఁడు—కథానాయకుఁడు.

లక్ష్మణుఁడు—కథానాయకుని తమ్ముఁడు.

ఇద్దఱు మరగుజ్జువారు—జనకుని యంతఃపుర పరిచారకులు.

విశ్వామిత్రుఁడు—ఋషి.

జనకుఁడు—మిథిలాధిపతి.

బ్రాహ్మణుఁడు—పరశురాముని రాయబారి.

ద్వారపాలకుఁడు.

కంచుకి.

తాండ్యాయనుఁడు—జనకపురోహితుని శిష్యుఁడు.

హనుమంతుఁడు—సుగ్రీవుని మంత్రి.

సాగరుఁడు.

ఒక రాజహంస.

కరాళకుఁడు—మాల్యవంతుని సేవకుఁడు.

ముని—పులస్త్యుని శిష్యుఁడు.

ప్రహస్తుఁడు—రావణుని మంత్రి.

విద్యాధరుఁడు.

సుగ్రీవుఁడు.

విభీషణుఁడు.

## స్త్రీలు.

సీత—కథానాయిక.

మందోదరి - ప్రతినాయిక.

త్రిజట.

గంగ మొదలగు నదులు.



శ్రీ

# ప్రసన్నరాఘవము

(నాంది)

చ. సిరినవలా కుచమ్ములను జెక్కుల నొక్కటఁ బత్రికా పరం
పర నటు లయ్యజాస్యముల భాగ్యఫలమ్ముల వ్రాయుచక్రిన
గ్గరములు పాటలాబ్జకలికారుచిరంబులు విద్రుమాంకుర
స్ఫురదరుణాంగుళీకములు పూనుచుఁ గావుత మంగళంబులన్. 1

మఱియు,

సీ. మురజిదాననగళ న్మరుదూర్మికల పేర్మి
పటుమృదూదాత్తమై పరగు నెద్ది
శుంభదానురకుంభి కుంభకర్ణకుటీర
పటలి బీటలువాఱఁ బఱచు నెద్ది
దశముఖాశాచక్ర తతరంగభూమిపై
సవిలాస నటనమ్ము సలుపు నెద్ది
అతివేలమేఘనాదైశ్వర్య రమనెల్ల
హేలమై లంఘింపఁ జాలు నెద్ది
గీ. అట్టిశ్రీపాంచజన్య జన్యారవంబు
ప్రథితసౌభాగ్యసంపత్పరంపరలను

నొసఁగి మిమ్ముల రక్షించు చుండుఁ గాక
పరమకరుణ ననేక కల్పముల దాఁక. 2

మఱియు,

ఉ. పొక్కిలిదమ్మి నార్చునజుమొఱ్ఱ చెవిం బడఁ గన్ను విచ్చి పెం
పెక్కుముఖేందుకాంతి పస నీన రుషన్మధుకైటభాఖ్యులన్
మక్కువనుం గృపారతిని మానతినిం బ్రణయమ్మున న్విప
న్యక్కృతి దోఁపఁ బుత్రుఁ గనునబ్జదళాక్షుఁడు మిమ్ముఁ బ్రోచుతన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.]

సూత్ర:—(చుట్టునుం జూచి హర్షముతో) తననెమ్మొగమ్మును శారదారవిందమ్ముపై నుడియు పార్వతీనయనమ్ముల పేరి కాటుకపిట్టల నర్తనమ్మున హృదయంబు పల్లవింప, పాటలజటాపటలరంగమ్మున నటియించుగంగాతరంగనికరంబు లింపు నింప, మందాకినీఫాలభాగమ్ము నందలి చందనతిలకమ్ము నా నొప్పు లేఁజందురుని వికాసమ్మునఁ ద్రిభువనమ్ములకు నాహ్లాదమ్ముఁ గొలుపు మేటి యై మునికులపూజ్యుఁ డై త్రిలోకీపద్మమ్మునకు నాళభూతుఁ డై యొప్పు శంకరభగవానుని పూజామహోత్సవంపు సందడిలో నీసభాసదులు మునిఁగి యున్నారు. వీరిని సమీపించి మత్కలా నైపుణ్యముం దిలకింపు మని పార్థించెదను గాక. (విమర్శించి) పార్థన మాత్ర మేటికి ?

గీ. నేరుపరు లైనవార లాకారముననె
మెఱుఁగ నేరుతు రవలీల నెదిరి మనసు;
పొదలమాటున వాసించు మొగలి విరిని
బరిమళమ్మున మధుపమ్ము లెఱుఁగు నట్లు. 4

(చూచి హర్షమ్ముతో) ఇదిగో! నాసఖుఁడు రంగతరంగుఁ డిటే వచ్చు చున్నాఁడు. నే ననుకొని నట్లే సామాజికుల సందేశముం గొని వచ్చు చున్నాఁడని తలఁచెదను.

(అంతట రంగతరంగుఁడు నటుఁడు ప్రవేశించును.)

నటు:—బావా! సామాజికులు నాచేత నీకొక వార్త నంపి యున్నారు.

సూత్ర:—ఏమని?

నటు:—'ఓయీ నటరాధిరాజా!'

సూత్ర:—(చెవులు మూసికొని) శివ శివా! యెంతమాట! పోనిమ్ము తరువాతి వృత్తాంతముఁ దెలుపుము.

నటు:—బావా! నీవు చెవులు మూసికొనిన దెందులకో ముందు నాకుఁ జెప్పుము. 4

సూత్ర:—వేఱేమున్నది? నాకన్నఁ బెద్దవాఁ డుండఁ దరువాతివాఁడ నగు నన్ను రాజా యని పిలుచుటచే నట్లంటిని. నే నన్నొక సామాన్య నటుఁడను. మాయన్న యగు గుణారాముఁ డన్ననో రాజబిరుదమున కర్హుఁ డైనవాఁడు.

నటు:—అట్లయిన మీగుణారామునియం దున్నగుణము లెవ్వి?

సూత్ర:—ఆ పేరే చెప్పు చుండుట లేదా?

నటు:—(నవ్వి) పేరును బట్టియే గుణము గ్రహించు టెట్లు?

సూత్ర:—తప్పక గ్రహింప వచ్చును.

గీ. గొప్పవారికిఁ బేరులుం గుదిరి యుండుఁ
దద్గుణమ్ములఁ జూపునద్దమ్ము లట్లు;
అమృతకరుఁ డన, శ్రీఖండ మన, సువర్ణ
మనఁగ నిట్టివ కావె యోజన మొనర్ప. 5

అది యటుండుఁ గాక. గుణారామునిగుణములు నైతము నీ వెఱుంగ నను చున్నావు? ఇది యెంతయు వింత! ఏల యనఁ దొల్లి రతిజనకుఁ డనురాజునాస్థానమ్మున నాతఁడు హరచాపారోపణం

బను నాటకమును బ్రదర్శించి, పరితుష్టుఁ డైన యారాజువలన 'రంగవిద్యాధరుఁ, డనువిఖ్యాతినిఁ బ్రేయసిం బోలెఁ బరిగ్రహించెఁ గదా!

నటు:—అట్లయిన నిపు డతఁ డెచ్చట నున్నాఁడు ?

సూత్ర:—ఎవఁడో యొకదక్షిణదేశీయుఁ డగునటాధముఁడు తానే గుణారాముఁడ నని చెప్పికొనుచు రంగవిద్యాధరఖ్యాతి నపహరించెను. అది విని గుణారాముఁ డాతని వెదకికొనుచు నాదిక్కునకే తరలి పోయెను. పిమ్మట సుకంఠుఁ డనుగాయకునితో నేస్తమొనరించి దాక్షిణాత్యభూపతుల యాస్థానమున తనశాత్రవు నెదిర్చి రంగసంగరంబున కుపక్రమించె నని మాకుఁ దెలియ వచ్చినది.

నటు:—ఆహా! ఇది మహాప్రయత్నమే!

సూత్ర:—అవు నది యుచితమే గదా! ఏల యన,

గీ. చంద్రవదనయు, బిసకాండ చారుభుజయు
గౌరజలజాక్షియును జంద్రికాస్మితయును
నపహృతయు నైన ప్రియ నేని ఖ్యాతి నేని
వెండి గడియింప యత్నింప కుండు నెవఁడు? 6

కావునఁ బ్రకృతకార్య మెఱింగింపుము.

నటు:—వే ఱేమున్నది.

చ. ప్రవిమలమై రసోత్కరము భాసిల నంకము లన్నిటన్ లస
న్నవ సుమరాశి రమ్యతఁ దనర్చెడు బంధము మీఱఁగా నరా
ఘువిసర హర్త యాచు విధు కైవడి వక్రమ యయ్యు గారవ
మ్మువెలయఁజేయునాటకముఁబూనుపు మాటకుఁగొమ్ము మెప్పునన్.

అని సభాసదులు నిన్నుఁ గోరు చున్నారు.

సూత్ర:—అట్లయిన నట్టినాటక మేదియో నాకుఁ దెలియ వచ్చు టెట్లు?
(విమర్శించి హర్షముతో) ఔరా! యే మిది! చేతిలో బంగార ముంచుకొని వీథి నంతయు వెదుకఁ జొచ్చితిని. ఈ పద్య మందే యాద్యంతములు యందు వరుసగా "ప్రసన్నరాఘవమ్మును" అని స్ఫుటముగాఁ గూర్పఁబడి యున్న దే.

నటు:—(ఆపద్యమునే చదివి) ఆహా! కవికుల కుముదవనమ్మునకు సంపూర్ణచంద్రిక యగు సరస్వతీదేవి యనుగ్రహ మహిమ! తత్ప్రసాదమ్మునసే గదా కవుల కిట్టి విచిత్రమధురమ్ము లగు సూక్తులు దొరకు నేర్పుట!

సూత్ర:—అవును. అందు చేతనే కవి యిట్లు వక్కాణించి యున్నాఁడు

ఉ. భారతి! నీపదాంబుగహపాంసులవంగు బుధేంద్రచిత్తకే
దారము నందు రాలి కవితాంత మై పెను పొందఁ సద్వచో
హారికిసాలయాభిరతి వై గల యూంచి శ్రవస్సునుండి మం
దారసుమంబు జార్చి యట దా వాసగూర్తువు గాదె దానికిన్.

ఒక్క తెరయ మైనను నెవనివదనారవిందంబునం జేరి భారతిపేరి రాజహంసి సలుమొగమ్ములవాని మోముదామరల గుబురులో విహరించు నప్పటి వినోదసౌఖ్యము నను భవించు చున్నదో యట్టికవిబ్రహ్మ యగు వాల్మీకిఋషి యందు నా మానసం బెంతయుం దవు గొంది యున్నది.

నటు:—అవు నందు విచిత్ర మే మున్నది?

చ. ఎవని ముఖేందుబింబ భవకృత్యమృతాబ్ధిచవుల్ గ్రహించి యు
క్కవినవమేఘమాల కలకాలము వృష్టినొసంగు, నెవ్వఁ డా
కవికులచంద్రుకీర్తినటి రంగము నెక్కఁగ మోగుడోలి ప్రా
గ్రన మయి యొప్పు, నట్టిఘనకర్మకు వాల్మికి నెన్న శక్యమే. 9

అయినను నిట్టి వాల్మీకియొక్కయు సారస్వతసాగర మెవ్వాని కీర్తిచంద్రికాస్పర్శనంబున నుప్పొంగి త్రిభువనాభోగంబునం దెల్ల వెల్లివిరిసెనో యట్టి శ్రీరామచంద్రు నందే నాచిత్తచకోరము నిర్భరానంద మనుభవించుచుం బాదుకొని పోయినది.

సూత్ర:—నీ వన్నది యెంతయు సముచితము.

గీ. నీలపంకేజ కళలతో నెయ్య మాడు
చంద్రు నందును శ్రీరామచంద్రు నందుం
జంచలాక్షుల లోచనాంచలము నందుం
బాదుకొన కున్నె యెవనిభావంబు గాని! 10

అదియునుం గాక,

చ. ఉరవడి బ్రహ్మలోకమున నుండి ధరిత్రికి డిగ్గు వేళ డె
ప్పర మగుదూఁపియానమున భారతి కైన మహాప్రయాస మా
తరణికులేంద్ర సద్గుణకథాకలనామృతపూర్ణ దీర్ఘికాం
తరపరితోషగాహమునఁ దక్కు మఱేమిట నైనఁ దీఱునే. 11

నటు:—బావా! ఈకవు లందఱు రామచంద్రునే వర్ణింతు రేమి?

సూత్ర:—అగుఁ గాక. అది వారిదోషము గాదు. ఏల యన,

చ. రవికులచంద్రుఁ గూర్చియె గ్రంథముఁ గూర్తురు గాక పెక్కు లుం
గవులప్రమాదమా యది? గుణమ్ములదే యగుఁ గాని యేలనా
దవిలి వరించి వచ్చి సతత మ్మవి నిల్చెను రామునందె వే
ఱెవరిగుణమ్ము లింకఁ గడపు కింత రుచింపఁగఁ జేసియో యనన్.

ఓయీ! మఱియు నొకమాట వినుము.

చ. చిరసముపార్జితం బయిన శ్రేష్ఠచరిత్రము విత్తు, ప్రజ్ఞ యం
కురము, ప్రకాండ మిద్ధజనగోష్ఠి, ప్రబంధము పల్లవంబు, ది
గ్భరితయశమ్ము పూగముగఁ గ్రాలు కవిత్వకుజమ్ము నక్కజే
శ్వగుణనుతిసేఁగ భూరిఫలసంపదఁ గన్ వెలిసేయఁ బాడియే? 13

నటు:— సరియ కాని యీనాటక మొనర్చినకవి యెవరు ?

మ. ఘనుఁ డార్వేలకులావనీసురుఁడు కాకర్లాన్వయాంభోధిపూ
ర్ణనిశావల్లభుఁ డెల్లవారుఁ గవిరత్నం బంచుఁ దన్నెంతయుం
బ్రణుతుల్ సేయఁ దనర్చుధీధనుఁడు కొండల్రాయఁ డీనాటకం
బును గావించెఁ దెనుంగుబాస రసికవ్యూహంబు శ్లాఘింపఁగన్. 14

తొలుత గీర్వాణ వాణియందు

మ. తరలాక్షీ సుధురాధరాధర మరందసాంద్రప్రసారాతి భూ
మ రసస్యందిపదోవిలాసకలనామాన్యుండు కౌండిన్య వం
శ్య రమాదీపకుఁ డుత్తముండు జయదేవాఖ్యుండు వాగ్వైభవ
స్థిరసమృత్తిన్ రచియించె దీనిని మహాదేవాత్మజుం డొప్పుగన్. 15

మఱియు

క. సౌమిత్రి మానసము బలె
సౌమిత్రియ యైన యీ రసజ్ఞుని మనమునే
రామ పదాబ్జాతంబున
వేమఱు దిరుగాడు నెపుడు భృంగము కరణిన్. 16

నటు:— ఔరా! నా కెంత మఱపు గలిగినది. ఆకవియే తననాటకము నటునిచేతి కిచ్చునాఁడు దొంగలపాలు గానీకు సుమా! అని చెప్పె నఁట. అంత నా నటుఁడును సవినయమ్ముగా

గీ. కర్ణమునఁ బూన్చి, కీలించి కంఠపీఠి
నతశిరస్సునఁ జేర్చి హృద్గత మొనర్చి
తస్కరుల బారిఁ బడనీక దాఁచి యుంతు
తరతరము నీదు సూక్తి ముక్తాగణంబు. 17

అని బదులు వలికె నఁట.

సూత్ర:— ఆకవి కీర్తిశంక యేల గలిగెనో !

క. సురుచిరవచనయు విలస
చ్చరితయు నగు పరునికృతిని సతినైనం దా
హరియించి కడలి గడవఁగ
నరిగియు నెవఁ డేని సౌఖ్య మందం గలఁడే ? 18

నటుః—అవును నిజమే. కాని యీకవి తర్కశాస్త్రప్రవీణుఁ డనియు విందుము. ఎండయు రేయెండయుం బోలె కవితా తార్కికత్వములు రెండు నొక్కచోఁ గూడి నందులకు నా కెంతయు విస్మయము గలుగు చున్నది.

సూత్రః—ఇందు విస్మయమున కవకాశ మే మున్నది ?

ఉ. శర్కరపల్కు లుట్టిపడు చందమునం గృతి సెప్పు వారికిం
గర్కశతర్క వక్రివచనమ్ములు సైతము దొర్ల నేరవే ?
కోర్కులు మీఱ బొంట్లచను గుబ్బల గోళులు నాటువారు వే
మార్కొని కుంభి కుంభముల మార్గణపుంజము నాట నోపరే? 19

నటుః—సరియ కాని తాము స్వయముగా కవితాకోవిదు లగు నీసభా సదు లీతని సూక్తులకు సంతసింతురా ?

సూత్రః—అందు చేతనే కవి యిట్లు సెప్పి యున్నాఁడు.

గీ. మురియు వా రయ్యు నిజవచస్స్ఫురణమునకు
సరసజను లాదరింపరే యొరుల పలుకు ?
కుదుటఁ దన తేనియలు గుబుల్కొనుచు నున్నఁ
గుండపోతకుఁ దా నొప్పు కొనదె మావి ? 20

నటుః—ఔరా! ఈకవీంద్రుని పలుకు లెంత కోమలములు సరళములు నై యున్నవి!

సూత్రః—ఒక్కొక్కచోఁ గఠినములు వక్రములు గూడ నై యుండును.

నటుః—అట్టివియు రమణీయము లై యుండునా ?

సూత్రః—కా కేమి ?

ఉ. వక్రిమ లోకవిశ్వరుల వాక్కుల మందులు నింద సల్పినన్
వక్రిమ లోలమృగాక్షుల యపాంగములన్ జడు లీసడించినన్
వక్రిత నిచ్చగింపదొకొ వైదుషి గల్గిన సజ్జనాత్మ యు
ర్వక్రశశాంకఖండమును వారక తాల్చఁడె మౌళి శంభుఁడున్. 21

అదియునుం గాక,

చ. అమృతపయోధిదుగ్ధముల నంబుధరుం డొగిఁ గ్రోలి, తారకా
భముల ఘనోపలమ్ములను స్ఫాటికధారుణి రాల్చుచోఁ గదా!
నిమిషకఠోరముల్ పడప నిత్యవినిర్గళదామృతప్రవా
హములును నై తనర్చుఁ బ్రతిభాఢ్యుల సూక్తులు సామ్యమొందుటల్.

నటుః—నిక్కముగ నీకవీంద్రుని యత్నకరణ మెంతయుం గౌతుక ప్రమోదమేదురం బై యుండ నోపు. కాకున్న నిట్టిసరస శీతలమ్ము లగుసూక్తు లుట్టిపడునా?

పారిః—

సీ. కుటిలవర్తన నొప్పు కుంతలమ్ములు చోరుఁ
డవతంసకము మయూరాభిదుండు
ఆత్మ నుప్పొంగించుహర్షంబు హర్షుండు
నవహాస మబ్భాస నామకుండు
భావపర్యంకమ్ముపై యథేష్టముఁ దూగు
పంచబాణుం డల్ల బాణసుకవి
విస్మయం బెలయించు విలసనమ్ముల పెంపు
కవికులాచార్యుఁ డక్కాళిదాసు
గీ. నై తనర్పఁగ సరసలోకాభిరమ్య
యగుచుఁ జెలువొందుకవితామృగాయతాక్షి
పలుకు వెంటన పరువెత్తి వచ్చె నేనిఁ
బ్రమద మెవ్వరి కింకఁ జొప్పడదొ సెపుమ? 23

అదియునుం గాక,

గీ. తనయ గతి లోకనుతునకు దత్త యగుచుఁ
గవిత యెంతటి హర్షంబుఁ గవుల కిడునొ
యంతహర్షంబు నిడజాల వాత్మమునకు
బ్రహ్మవిద్య యైనను రాజ్యరమయు నైన 24

( తెర లో )

బాగు బాగు కుశీలవకులోత్తంసా! బాగు.

సూత్ర:—ఓహో! భగవానుఁడగు యాజ్ఞవల్క్యుని ప్రియశిష్యుఁడు దాల్భ్యాయనుఁ డిటే వచ్చు చున్నాఁడు. నాలవజాతివారి మొగముఁ జూడని యీబ్రహ్మచారికట్టెదుర నిలువరాదు. కావున ముందుగా వెడలి పోదము రమ్మ.

(నిష్క్రమింతురు) ప్రస్తావన సమాప్తము.)

[అంతట దాల్భ్యాయనుఁడు ప్రవేశించును.]

దాల్భ్య:—(ఆపద్యమునే సదివి సాభిప్రాయముగా) ఈతఁ డన్నది మిక్కిలియు నొప్పి యున్నది. భూపాలుఁ డగు నీజనకుండును సకలజననేత్రపద్మమ్ములకును మార్తాండుఁడై కనుపట్టునే పురుషప్రకాండున కేనిఁ దనకన్నియ నిచ్చుతలంపునం దవిలి మాగురువుగా రుపదేశించు బ్రహ్మవిద్యయందుఁ గాని కులక్రమాగత మైనరాజ్యలక్ష్మి యందుఁ గాని యాదరము డిగ్గఁద్రావి యున్నాఁడు. (చెవియొగ్గి) ఏ మిది! ఆకసమున నేదో వీణాధ్వని వినవచ్చు చున్నదే! విసురునం బఱచి మాటికిం దాకు తెమ్మెరలపిండుచేఁ దంత్రులు మనోహరముగా మ్రోగు చున్నట్లు దోఁచెడిని. కావున దేవర్షి యగునార దుఁడు మాగురువుగారి దర్శనార్థ మై వచ్చు చుండ నోపు. (పైకిఁ జూచి) ఔరా! ధ్వనిని సరిగాఁ బోల్ప లేక మోసపో యితిని. ఈవినవచ్చుచున్నశబ్ద మంతరిక్షంబునం బొలుచు

రెండుతుమ్మెదలది. (మఱల చెవియొగ్గి హర్ష విస్మయములతో) ఆహా! యోగీశ్వరుం డగు నీభగవానుని మహిమ నేమని కొనియాడుదును! వారి యనుగ్రహంబునం జేసి గదా నా కిట్టి మృగ పక్షి కీటమ్ముల సంభాషణమ్ములు గూడ నెఱుంగుప్రజ్ఞ గలిగినది! కావున నివి యేమి చెప్పు కొనునో విందును గాక. (చెవి యొగ్గి) ఇం దొకటి యేమను చున్నది? 'మిత్రమా కలాలాప! యెక్కడనుండి వచ్చు చున్నావు?, మ ఱొకటి యేమను చున్నది? "వయస్యా మధురప్రియా! నిరంతరవికాసంబునం బొలుచు చంద్రధరుని మౌళిమందాకినీ కుముదకాననమునుండి." ఔరా! యేమి వీని మాట పొందికయు నానుధేయమనోజ్ఞతయుం జెప్ప నలవి గాకున్న దే. (మఱలం జెవి యొగ్గి) మధుర ప్రియుండు మఱల నేమను చున్నాఁడు? వింతవార్త లేమేనిం గలవా యనియా! కలాలాపుఁ డేమను చున్నాఁడు? 'కలవు. ఈనడుమనే యొకనాఁడు బలి పుత్రుఁ డగు బాణాసురుఁడు చంద్రమౌళిని గసుమమాలికలచేఁ బూజించి నిలిచి కరములుఁ మొగిడ్చి సవినయముగా "భగవానుఁడా పార్వతీపతీ!

ఆ. వెండికొండ కంటె విపుల సారము గల్గు
వస్తు వేద్ది యైన వసుధఁ గలదె?
అట్టిదాని నెత్తి యతిధన్య మగుఁ గాక
మామకీనబాహు మండలంబు 25

అని పలికెను. అది విని భగవంతుఁడు నవ్వి యిట్లనియెను.

సీ. కలదు జనకావనీనాథు నిలయ మందు
మహితమై యొప్పు ధనువొండు మామకంబు;
దానఁ బుట్టిన ఘోరబాణానలమున
బూది యై పోయె పురములు మూఁడు నొకట. 26

అది విని యా కార్ముకమును జూచుటకై యాతఁడు విదేహాకుఁ దరలిపోయెను. నేను నిచ్చటికి వచ్చితిని. నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?, మధురప్రియుఁ డేమను చున్నాఁడు! "నేను నందన వనమునుండి వచ్చితిని. లంకేశ్వరుని పరిచారకుఁ డొకఁ డచ్చటికి వచ్చి గర్జిల్లుచు 'ఓరీ నందనవనపాలకా! యిది యేమి! లంకేశ్వరుఁ డింకను జంద్రచూడు నర్చింపక ముందే వనములోని పూవు లన్నియు గోయఁబడి యున్నవి., అని పలికెను. 'క్షమింప వలయు. ఇపుడు భూలోకంబున మిథిలాపురంబునం జరుగు జనకకన్యావీరస్వయంవరోత్సవముం జూచుటకు బయలు వెడలిన బృందారకుల విమానంబు లలంకరించుటకుఁ బుష్పంబు లన్నియుఁ గొంపోఁ బడినవి., అని వన పాలకుఁడు చెప్పెను. అంతట నాతఁ డీవృత్తాంత మంతయు లంకేశ్వరునకుఁ జెప్పెదనులే యని వెడలి పోయెను. నేనును వెఱఁగుపడి యిటు వచ్చితిని." అనియా: ఆహా! యిది గొప్ప యనర్థాంకురము. సీతా స్వయంవర వృత్తాంతము బాణరావణుల చెవికిఁ గూడ నెక్కినది. అయినను భయపడ నక్కఱ లేదు. భ్రమరోక్తులు భ్రమారోపితములే గదా! (విమర్శించి) అయినను వీనిని భ్రమరమ్ము లని భావించుటకును వీలు లేదు. ఏల యన,

గీ. సాంద్రమకరందబిందు నిష్యందములను
జలుకరించిన చందానఁ జెలువు మిగిలి
లలితమృదుభాషణంబులు వెలువడంగ
వఱలు చున్నవి యివి దొడ్డ వందు లట్లు. 27

( తెరలో )

మేలు భగవానుఁడా! మేలు. మేము నిక్కముగ వందులమే. నానాదిగంత సమాగత భూపాలచక్రవర్ణంబునకు జనకరాజుచే నియోగింపఁ బడితిమి. (నిష్క్రమించును.)

విష్కంభము సమాప్తము.



శ్రీ

# ప్రసన్నరాఘవము.

## ప్రథమాంకము.

రంగము:—మిథిలాపురమున స్వయంవరశాల.

(మంజీరకుఁడు నూపురకుఁడు ప్రవేశింతురు.)

నూపు:—వయస్యా మంజీరకా! చూడు మాఁదెస. నిద్దమ్ములగు గజదంతశలాకలచే నిర్మింపఁ బడిన మంచల యందుఁ గుంకుమ పంకంబులం దాల్చి కూర్చున్న యీభూపాలపుంగవులు పటికంపుటా మేడలపైఁ బ్రతిష్ఠింపఁబడిన బంగరుసింగంబుల భంగి మెఱయు చున్నారు. మఱియుఁ శాల సంద్రంబు నందలి తుంగ తరంగాగ్రంబులలోనఁ దరంగితంబు లగు బాలచంద్ర బింబంబుల భాతిఁ దేజరిల్లు చున్నారు.

మంజీ:—సఖా నూపురకా!

మ. ధరణీపుత్త్రిస్వయంవరోత్సవము సందర్శింపఁ గాంక్షించి గ్ర
చ్చఱ నిచ్చోఁ గదియుంగఁ బాఱిన దిశాచక్రంబు నా నొప్పె నీ
నరనాథేంద్రులు వారివారిదెస నందం బొప్పఁ గూర్చున్న కుం
జరదంతాంచిత మంజుమంచకతతీచక్రంబు మిత్త్రోత్తమా! 1

మఱియు,

మ. కర్ణాభ్యర్ణమున నొప్పు సూత్రమును లెంకల్ మాటికిన్ లాగుటం
గరిదంతాంచిత పుంఖపంక్తి నిడ దూగం జొచ్చె వీక్షింపు మి
మ్మరపాలుం డాదటిక, శంభుచాపమును వంపం గోర్కు లుప్పొంగ నా
తురతం గూర్చిన భూమిపాలకుల చేతోవృత్తి చందంబునన్. 2

నూపు:—నెచ్చెలీ మంజీరకా! సీతాకర గ్రహణమ్ము పేరి వసంత లక్ష్మిపొత్తున మాటికిం బొటమరించు పులక పటలమ్ము లనెడు మొగ్గ ముత్తెమ్ములం దనరి క్రొమ్మావి క్రొవ్వ్మలం బోలి యున్న తన భుజాదండమ్ముల నవలోకించుచుం గూర్చున్న యీనరేంద్రుం డెవ్వండు?

మంజీ:—ఈతండా! కుంతల దేశాలంకారుం డగు మల్లికాపీడుండు. ఈతని యశఃపరిమళమ్ములకు మరులుగొని చారణానీకమ్ములు తుమ్మెదల భంగి జుమ్మని మ్రోయుచు నిరంతరము దిక్చక్రవాళంబునం దెల్ల దిరుగాడు చుందురు.

నూపు:—మఱి యీతం డెవ్వండు? బంగరుకడియమ్ముల ముంజేతి పైకి నెట్టుచు ధనుర్గుణకిణమ్ములచే నల్లనైన భుజాదండమ్ము నవలోకించుచుం గూర్చున్నవాండు.

మంజీ:—ఈతం డుత్తరదిశాంగనాలలాటతటభూషణం బగు కాశ్మీర తిలకుండు.

నూపు:—నిజప్రతాపంబు పేరి చండభానున కుదయాద్రిశిఖరంబు నాం బరగు దక్షిణ భుజాదండం బెగనెత్తి యున్న యీ భూపాలుం డెవ్వండు.

మంజీ:—ఈతండా! నిజప్రతాప ప్రభాపటలపింజరిత మలయాచల మధ్య దేశస్థిత కాంచీమండనుండు. వీరమాణిక్యుం డనువాండు.

నూపు:—హర్షోత్కర్షమ్మున నుప్పతిల్లు పులకాంకురమ్ములపెల్లునఁ గపోలమ్ము లొక్కపెట్ట నుబికి సెదరఁగొట్టుటం జేసి తావు దప్పిన కుండలమ్ములను మఱల సవరించుకొనుచు నీ హర శరాసనంబును గూడ నిట్టే కర్ణభూషణమ్ముగా వింతు నని యెల్లరకు వెల్లడించుచున్నవాఁడో యన విరాజిల్లుచున్న యీ భూతలేంద్రుఁ డెవ్వఁడు ?

మంజీ:—ఈతఁడు మహాసంగ్రామ సముద్రంబున యథేష్టవిహారంబుఁ గావించు మత్స్యరాజు.

నూపు:- తెల్లని గంధంపుఁబూత పెంపునఁ ద్రాచుఁబాము చందంబున వెలుఁగు భుజాదండంబున యీ హరశరాసనంబును దిరిసెన పూవునుం బోలె గ్రహింతు నని చాటుచున్నవాఁడో యనం జూపట్టు నీ నరేంద్రుఁ డెవ్వఁడు ?

మంజీ:—ఉత్తుంగతరంగంబుల లీల భుజాదండంబు లంతంతఁ బొంగుచుండ విమలముక్తాహారసరంబులు వక్షస్థలంబున కింపు నింప వెలుంగుచున్నయీగాంభీర్యనిధి సింధురాజు. ఇఁక నీప్రసంగమ్ము నటుండ నిమ్ము. ప్రకృతకార్యంబున కుపక్రమింతము. ఓహో నానాదిగంతసమాగత సకలభూమండలాధీశ్వరులారా ! యిటు వినుండు వినుండు.

మ. శ్రవణప్రాంతము దాక ధూర్జటిధనుర్జ్యావల్లి నేధారుణీ
ధవమాహామణి లాఁగునో యతని చెంతం జేర నే తెంచు ని
య్యవనీనాథతనూజ భూరిజఘనప్రాంచన్మణీమేఖలా
రవగానమ్ములఁ రమ్యగాత్రరుచులున్ రంజిల్ల నొక్కుమ్మడిన్. 3

(మఱలఁ గౌతుకముతో) వయస్యా నూపురకా ! యిటు చూడుము.

గీ. హరధనుస్సును లాఁగుదోహలిక నాదవు
పులకముల పేర్మి మూఁపులు తలకుఁ గడవ

నవనిజం జూచు తమకంపు టగ్గలమున
నెదలు విరియంగ నెల్లెడ నృపులు వీరె.

(మఖిల సంతసముతో ఔరా! ఒండొరులం గడవవలయు నన్న తమకమ్మున నంద ఱొక్కపెట్ట ప్రోగ్గుటం జేసి కపోలమ్ము లొండొంటితో నొరసికొన రణరణాయమానమ్ములై కుండలమ్ములు మ్రోగుచుండ నీ రాజమండలం బప్పుడే బయలువెడలినది.

నూపు:—ఓయీ! యీవినోదముం జూడుము. భుజాంగదమ్ము లొండొంటితోఁ దాకుటం జేసి క్రింద రాలిపడుచున్న బంగారురేణువులు వీరి శౌర్యాగ్నినుండి బయలు వెడలిన విస్ఫులింగంబులో యనఁ జూపట్టు చున్నవి.

మంజీ:—[నవ్వి] అగుఁ గాక. వయస్యా! యిటు చూచితివా?

గీ. కోరి చూడంగ నిర్యోధ కోటి నెందు
భక్తియే గాని శక్తి వెల్వడుట యరిది
అంజలియె కాని పిడిదాలు పనుట కల్ల
బళిరె! తలవంపె కాని విల్వంపు సున్న.

నూపు:—అట్లయిన వీరంద ఱారంభశూరులేనా?

మంజీ:—(విషాదముతో) అట్లే గనుపట్టు చున్నది.

మ. పెలుచం జేరి రిదే నరేంద్రు లఖిలద్వీపంబు లందుండియుం
గలధౌతమ్మతు లీనుకన్యకయునుం బ్రఖ్యాతియుఁ లాభముల్
విలు గర్షింపఁడు మోపిఁ జేయఁడును మోపెట్టండు చేఁ దార్చఁబోఁ
డిలపై నుండి యొకండుఁ గాని యకటా! యీయుర్వి నిర్వీరమా! 6

(తెరలో)

ఛీ! ఎవఁ డీవైతాళికుఁడు? పనికిరాని మాట లాడు చున్నాఁడు! ఏపట్టునకు నోపని యీధనువుం గూర్చి యుర్వి యెల్ల నిర్వీర మనుచున్నాఁడే. ఇది యేటి తెలివి?

నూపు:—వయస్యా! మహీతలంబునం బఱచు రాహుురథచక్రంపు రవంబు వోలె కర్కశం బై వినవచ్చు చున్న దే యెవరి దీకంఠధ్వని?

మంజీ:—నాకునుం దెలియ రా కున్నది. ఆతనినే పిలిచి యడిగెదను. (పరిక్రమించి) ఓయీ! నీ వెవరవు? సకలదేశమ్ములుం జూచిన నాకునుం దెలియ రా కున్నాఁడవు.

—♦ ప్రవేశము ఒక పురుషుఁడు ♦

పురు:—(సాటోపముగాఁ బరిక్రమించి క్రోధముతో) ఛీ! దురాత్మా! వైతాళిక హతకా! కతిపయ గ్రామంబుల గ్రుమ్మరి నంత మాత్రముననే సకల మెఱింగినట్లు గర్వించు చున్నావు. కూపమండూకము సాగరముసే యెఱుంగ నన్నట్లు త్రిభువనైక వీరనామధేయుని దశ—(అర్ధోక్తియం దే) ఇదేమి రహస్యమును వెల్లడింపఁ గడఁగితిని! కాని మ్మిట్లే పిర్వహించెదను గాక దశదిశాంగనకుఁ గర్ణభూషణమ్ములుగా నిజకీర్తిపల్లవంబుఁ వెలయించిన వానిని నన్ను సైత మెఱుంగవా? పోనిమ్ము. కర్ణాంతంబునం జేర్పఁ దగినగుణంబు గల్గునక్కన్యారత్నంబును గార్ముకంబును నెచ్చట నున్నవో వివరింపుము.

మంజీ:—ఇదిగో! యిది కార్ముకము. కన్యారత్న మిఁకఁ బిదప గోచరింపఁ గలదు.

పురు:—(సంరంభముతో) ఛీ! మూర్ఖా! జ్యోతిష్కుల గోష్ఠి యేనియు నెఱుంగవు. వారును దొలుత కన్యనే ప్రకటించి పిదప ధనుస్సును గూర్చి ముచ్చటింతురు.

మంజీ;—[తనలో] ఏమిది? యీతఁడు తానే మిక్కిలి మాటకారి యని గర్వించు చున్నాఁడు. కానిమ్ము. దానిచేతనే వీని పొం గడంచెదను. [ప్రకాశముగా] ఓయీ! యింత గొప్ప

రాజమండలమున నక్షత్రవిద్యా కుశలుండవ్వ, నీవొక్కరుండవ కాఁబోలు.

పురు:—ఆఁ! యే మంటివి? అక్షత్రవిద్యా కుశలుండనా నేను?

మంజీ:—మఱి కానిచో ధనువు మాట నటుంచియే కన్యాదర్శనమున కింతఁ యుల్లొట్లూరెద వేల?

పురు:—[పరిక్రమించి సాటోపముగా] నేను జూపము వంప లే నని సంశయమా నీకు?

మంజీ:—ఏల యుండదు?

పురు:—అట్లయిన వినుము. నేనే యీచాపము వంప లేని యెడల

చ. మెఱయవలెం దడిల్లతిక మేఘము లేకయె మింట జాళువా
మెఱుఁగుల నిగ్గు దేఱి మిసిమి స్సగనాంతర మెల్లఁ దాన యై,
అట్లు గాదేనిఁ
యఱిముఱి దాటు శేడిసల యాటలచే మిఱుమిట్లు గొల్పుచన్
గొఱలవలె న్నభస్తటినిఁ గ్రొందొవతంపర గంగ లేకయే.

[పైకిఁ జూచి విస్మయముతో] ఔరా! నాప్రతిజ్ఞను భంగ పఱచుటకు బ్రహ్మ విపరీతసృష్టిఁ గావించినాఁడు. ఇద ట్లె తోఁచు చున్నది. (విమర్శించి) ఆ బ్రహ్మ మాత్రము నాకు విరోధముగా బ్రవర్తింప నెట్లు సాహసించును?

ఉ. అమృతవార్థి లోన నణఁగారిన యచ్యుతు బొడ్డుదామరన్
మామక కేళి దీర్ఘికను నాటి తలంపున నేను లాఁగఁగా
గీము నశించు నం చతఁడు గీయని నోళుల నాలుగింట మా
ధ్వీమధుసో క్తు లొప్ప నను వేఁడిన చొప్పు స్మరింప కుండునే!
(మఱల బరిశీలించిచూచి) ఔరా! పోలికచేత మోసపోయితిని.

గీ. మెఱపుఁదీవియ గా దిది మేడ తుదను
దిరుగు నొక్కవధూటి మైదీవ గాని

మఱియు నిది యాపె వాల్చూపు మలుపె కాని
మీల నసియాడు క్రొంగల్వ చాలు గాదు. 8

[యోచించి] నిక్కముగ నీపె యాకన్యారత్నము సీతయే గానోపు. [హర్షముతో]

సీ. ఆఱడి నోర్వఁగా నసమాన మగునీదు
ప్రబదు కుర్షైపై నేఁడు పంకరుహమ !
ఎన గావుగా దీని కొనగోటికే నీవు
మోము మాట యిఁకేడఁ బూర్ణ చంద్ర !
తల యెత్త లేవుగా దరిసి యాతరలాక్షి
సమ్ముఖంబున మృగీశాబకంబ !
చాలకుందువు గదా జనలోకముల నింక
రంజనం బొనరింప ఖంజనంబ !

గీ. లలిత హేలా విలాస సంచలిత మైన
యాకురంగాక్షి బొమదోయి నెదురు నేనిఁ
ఇంద్రచాప మై పోవు నీసగు చెఱకువిల్లు
వేడుమా యాపె నభయంబు విషమబాణ ! 9

[మఱలసరభసముగా]

ఆ—గీ. కదళి కదళి మఱియు కరభంబు కరభంబు
కరికరంబు నరయఁ గరికరంబు
కాన ముజ్జగములఁ గనరాదు సామ్యమీ
యుత్పలాయతాక్షి యూరువులకు. 10

మంజీ.—సఖా నూపురకా! యెవ్వతెయో తెచ్చి యీయఁగా నందుకొని యంతఃపురజనము సానందముగఁ జూచు చున్నారే యది యేమిటి ?

నూపు:—చిత్రపటము గాఁబోలు. ఆ వచ్చినది చందనిక యనుదాసి. దానిరాక గురుభవనమునుండి యని తలఁచెదను.

మంజీ:—ఆపటమును నీవు చూచితివా ?

నూపు:—చూచితిని.

మంజీ:—అం దేమి వ్రాయఁబడి యున్నది ?

నూపు:—మన భర్తృదారికయు మఱియు నీలోత్పల శ్యామలుండును కుండలీకృత హరకార్ముకుండును మన్మథ సుందరుండును నగు నొకచక్రవర్తి కుమారుండును లిఖింపఁ బడి యున్నవారు.

మంజీ:—ఆహా ! అబల లెంత బేలలు. భూపాలుఁ డిట్టికఠోరప్రతిజ్ఞఁ బూని యుండు టేమి ! తా మెవ్వనినో యొక చిఱుతవానిని యల్లునిఁగా దలపోసి యుప్పొంగు టేమి ! వయస్యా ! ఆపట మెవ్వరు వ్రాసిరో నీ వెఱుఁగుదువా ?

నూపు:—ఎఱుఁగుదును. మహర్షి యగు యాజ్ఞవల్క్యుని సహధర్మచారిణి మైత్రేయి వ్రాసినది.

మంజీ:—నాకు మనోరథాంకుర మిప్పుడు పొటమరించినది. ఏల యన దేవి యగుమైత్రేయి సిద్ధయోగిని. మఱియుఁ త్రికాలవేదిని. ఆపె వ్రాత యసత్యము గానేరదు.

నూపు:—సరియ కాని యీజరఠాంగుఁ డిటేవచ్చుచున్నాఁడు.

మంజీ:—ఆఁ ! యెవఁడు వీఁడు ! వీనిని దవ్వులకుం దోలెదను. [బిగ్గరగా] ఓయీ యిటు నటుఁ జూచెద వేమి ? ఇదిగో హరశరాసనము. దీనిపై దృష్టిఁ బఱుపుము.

పురు:—ఆఁ ! యే మంటివి ? దృష్టియా ముష్టి సైతము బఱపెదను చూడుము. [పరిక్రమించి సిగపూవు దండ జాఱిపోవుట నభినయించి విషాదముతోఁ జూచుచుఁ దనలో] ఔరా ! యీ యపశకున మేమి ?

మంజీ:—

క. పరిగళిత శేఖరము నిటు
పరికించుచు నున్నఁ గాలభంగము గానం
ద్వరితముగఁ గానుము న క్తం
చర శేఖర కార్ముకమును సముచితభంగిన్.

పురు:—[తనలో] వీఁడు నన్ను గుఱితించెనా యేమి ? [విమర్శించి] ఈశబ్ద మిట్లు సరిపోవుట ఘుణాక్షరన్యాయముగ నున్నది [ప్రకాశముగా సంరంభముతో]

గీ. హేల మెఱయంగఁ గరమున నెత్తిపట్టి
కేళికిం బోలె నారిని గీలుకొలిపి
లీల లాఁగితిఁ జూడు మీశూలి ధనువు
నిఖల రిపువీర వరుల గుండియల తోడ.

(ధనుస్సుపైఁ జేయి వైచి తనలో) ఏమిది కదల నైనఁ గదలదు! కానిమ్ము. ఓయీ ! ధనువు గినువు ననుట వంకర టింకర త్రోవలు. కావున సరళ మగు ఖడ్గధారామార్గముననే సీతను రప్పించెదను జూడుము.

మంజీ:—ఔరా యేమిబడాయి !

మ. తఱ చైతోఁచు మహోగ్రహాస్ఫురణ నేత్రద్వంద్వముల్ నిప్పులం
గురియన్ భూరిభయంకరభ్రుకుటి నిగ్గుల్ గుల్కఁ జంచద్గతిం
గరవాలమ్ముల దూసి చండభుజదండశ్రేణులం బేర్చి దు
ర్ధరులై గన్పడు నిమ్మహోగ్ర నరవీర శ్రేష్ఠులం జూచి తే !

పురు:—[ఖడ్గ మెత్తి నల్దిక్కులం జూచి] తిలకింతురుగాక తిలకింతురు గాక.

మ. రణరంగమ్ములఁ గాళరాత్రి కరణిన్ రంజిల్లుచున్ శత్రు వా
రణకుంభస్థల ముక్తమౌక్తిక ఫలవ్రాతంబులం దారకా

గణ మోనా వెలయించె మింట నిది, బల్కారిన్యలక్ష్మీగృహా.
గణ మోరోరి నరేంద్రులార! యిదె మత్ఖడ్గంబుఁ గన్గొంటిరే!

(ఆకసమునఁ జెవి యొగ్గి) ఏ మను చున్నారు!

ఉ. “ఒక్కఁడఁ జిక్కు చండతరయోధుల నాజి నెదుర్చు టెట్లు లం
చక్కఱలేదు రోరి! మది నార్తి వహింపఁగఁ; జక్కఁ జూచి నీ
యొక్కని గోరుకొమ్ము సుజ మంతఁగ నీమది కెక్కువాని; నా
యొక్కని తోడ నొక్కఁడవె యుద్ధమునన్ సరి నిల్చి పోరుమా!”

అనియా. ఔరా! యేమి యీమనుష్య కీటకముల కాపరము కావున నానిజ స్వరూపముం జూపి వీరి నిప్పుడే బెదరఁ గొట్టెదం గాక. [సాటోపముగా నిష్క్రమించును.]

(తెరలో)

చ. ఘోరదిశాగజేంద్రముల కోఱల దుల్చుచు దేవతాసదం
గోరపుఁబైడిపూలఁ దులదూఁగెడు తామరతూండ్లఁ ద్రుంచుచున్
బీరము నిట్లు బాల్యమున బిట్టును వ్యర్థ మొనర్చి నట్టి మ
దూర్భరి యథార్థ బాహు లివె దోఁచెఁ గనుంగవ విచ్చి చూడుఁడీ!

[దశకంఠుఁడు నిజరూపమునఁ బ్రవేశించును.]

నూపు:—వయస్యా! యిదేమి వింత! ఒక మనుష్యునికే పదితల లున్నవి.

మంజీ:—ఇతఁడు మనుష్యుఁడు గాఁడు. రాక్షసరాజు దశకంఠుఁడు.

నూపు:—అట్లయిన నీవు నన్నుఁ గాపాడవలయు. రాక్షసమాత్రుఁడే యెదుటఁ బడ్డమనుష్యుని నమలివేయును. ఇఁక రాక్షసరాజు సంగతిఁ జెప్పవలయునా?

మంజీ:—భీతిల్లకుము. సకలవీరబృందమ్ములకును వందనీయులు గదా వందిజనులు! కావున సకలభువనైకవీరుం డగునీదశకంఠుఁడు మన యెడల విపరీతముగాఁ బ్రవర్తింపఁడు.

సూత్ర:—అట్లయిన జంకుఁ గొనక నీతనితో నే జేరి సంభాషించెదను. (సమీపించి) ఓయీ! నీ కిన్నితల లేటికి? మోఁతచేటు గాదా? ఒకదాని నుంచుకొని మిగిలినవాని నెచ్చటనైనఁ బాఱవేయుము.

దశ:—ఛీ దురాత్మా! అస్థానమున శిరశ్ఛేదన ప్రసంగమును దెచ్చి యమంగళమును సూచించుచున్నావు. వైతాళికుఁడవు గాఁబట్టి బ్రదికిపోయితివి.

మంజీ:—(నవ్వి) స్థానమందైనచో మాత్రము శిరశ్ఛేదనము మంగళంబులఁ జేకూర్చునా?

దశ:—కాదా మఱి?

* చ. సురసరసీజలోచనలు సొంపగు చేఁజిగురాకు టోఁటలం
బారి పొరి గ్రుమ్మరించు నవపుష్పపరంపర దోఁగు చంద్రశే
ఖరచరణమ్మునం దయినఁ గాని రణమ్మున యందుఁ గాని నా
శిరములు డొల్లిపోయినను శ్రేయమె చేకుఱు నోరి మాగధా!

సూత్ర:—నీ కింతటి బంటవైనచో నిజరూపమును దాఁచి దొంగవలె నిచ్చటఁ బ్రవేశించుట కెట్లొప్పుకొంటివి?

దశ:—ఛీ మూర్ఖా! యెఱుఁగ వటరా?

శా. గౌరీనాయక శైలచాలన కలైకస్ఫార చాతుర్య చిం
తారత్నంబులు నామ దుర్దమభుజాదండంబు లవ్వానితోఁ

---

* క. కరపల్లవాగ్రలీలల । సురకాంతలు గురియువిరుల శోభిలు శశిభృ
చ్చరణమున రణమునను మ । చ్ఛిరములు డొల్లినను మిగుల శ్రేయంబ సుమీ.

చేర వ్వచ్చి యలంతివింటి నొకటిం జేపట్టి కర్షింపఁగాఁ
బ్రారంభింతున యేని యెల్లఱకు హాస్యాస్పదుండఁ గానే సుమీ!

కావున జానకి యెచ్చట నున్నదో చెప్పుము.

మంజీ:—(విషాదముతో)

గీ. కులగురుఁడు నీకు యాజ్ఞవల్క్యుండు స్వయము
జనని భూదేవి జనకుఁ డీజనకరాజు
అట్టి నీవును దైవోపహతిని నేఁడు
చిక్కితే రక్కసుని చేత సీత! సీత!

నూపు:—(అపవారించి) పరితపించిన నేమి లాభము? ఇంత గొప్ప
రాజమండలమున నొక్కఁడైన నీదుండగీని నదల్పువాఁ
డుండక పోవునా?

మంజీ: — అట్లయిన నిం కేమి! దశకంఠుడే నిక్కముగ నాగ్రహిం
చినచో నాతని యెదుట నిలువఁ గలక్షత్రియుఁ డెవ్వఁడు?
అది సహస్రబాహుఁ డగు కార్తవీర్యుని కొక్కనికిఁ జెల్లుఁ గాక.

నూపు:—(చూచిహర్షముతో) అట్లయినఁ బ్రతికితిమి. ఇదిగో సహస్ర
బాహుఁడు కార్తవీర్యుఁడు రానే వచ్చినాఁడు.

మంజీ:—ఛీ మూర్ఖా! పరశురాము కుఠారధారాజల మం దెన్నఁడో
మునిఁగి పోయిన కార్తవీర్యుఁ డిప్పు డెట్లు వచ్చునురా? కావున
నీతఁడు బాణాసురుఁ డై యుండ నోపు. కట్టా! మఱియొక
యనర్థము దాపురించిన దే! (విమర్శించి, కానిమ్ము. ఇదియు
నొక మేలే. విషమును విఱుచుటకు విషమే కావలయుఁ గదా!

(అప్పుడు బాణాసురుఁడు ప్రవేశించును.)

బాణు:—(పరిక్రమించి సాటోపముగా)

శా. కైలాసాగ్రము కన్న మిన్న యగు బింకం బొప్పఁ జంచద్భరో
ద్వేలం బైన పురారి చాపమును వేవేగం బ్రసూనంబునుం
బోలెం జేఁజిగురాకులం గొని భుజా భూజాటవీ వాటికిన్
వాలాయమ్ముగ సంఘటింతు నిట సాఫల్యంబు నిన్నాళ్లకున్.

దశ:—(వినిపించుకొనకయే) సీత నింకను రప్పింప లేదేమి? కాని మ్మాచంద్రహాసమే రప్పింపఁ గలదు.

బాణు:—(చూచి తనలో) ఇక్కడ దశకంఠుఁడుఁ గూడ నున్నాఁడే! (ప్రకాశముగా) దశకంఠా! నీ వంతటి పోటుబంటవే యైనచో విల్లెక్కువెట్టియే సీతను రప్పించి కొనరాదా?

దశ:—ఆఁ, యెవఁ డీదుర్విదగ్ధుఁడు!

ఉ. చండభుజప్రకాండ పటుశౌర్య నిరంకుశ సాహసక్రియన్
వెండిమహీధరమ్ము నొకబెండుఁ బలెం బెకలించి వైచి, బ్ర
హ్మాండతలైకవీరుఁ డని ఖ్యాతివహించిన నాకు నిట్టికో
దండము వంచు టన్న బిసదండము పాటియ గాదె దుర్మతీ!

బాణు:—ఇంత యేటికి? శక్తి లేదనరాదా!

దశ:—ఎట్లురా! దశవదనునికిఁ గూడ శక్తి లేమియా! యెంత మూర్ఖుఁడవు!

బాణు:—బహువదనము లున్న బాగుగా వాగుటకుఁ బనికివచ్చిన రావచ్చును. కాని శక్తి యెక్కడనుండి వచ్చును. కావున శక్తిఁ జూపుటకు బాహుసంపదయే యావశ్యకము.

దశ:—ఆఁ, యెట్లురా! నీకు బోలెడు భుజము లున్న వని గాఁబోలు నీవిట్లువీగు. పొట్టు వలె సారము లేని నీభుజము లెందులకుఁ బనికివచ్చును?

బాణు:—(క్రోధముతో) ఓరీ సమరకలాకుంఠా! దశకంఠా! నాభుజములకు సైతము సారమే లేదా? ఎఱుంగవు గాఁబోలు వినుము.

చ. జనకపదాంబుజంబులకుఁ జాగిలి మ్రొక్కుడు వేడ్క చిత్తమం
దెనయఁగ నాగలోకమున కేఁగి మహీవలయమ్ము నల్లఁ జెం
పునను భుజాసహస్రమునఁ బూన్చి తొలంపఁగ లేదె నే ననం
తుని నిఖిలస్ఫటాఫలక దుర్భరభారము నెన్నిమాఱులో

దశ:—ఓరీ బలితనయా! చలితనయుఁడ వైతి వేమి! నీయసత్యవిక్రమమును వర్ణించికొనుచు సత్యవిక్రముఁడ నగునాయెదుట నెంత సేపు విజృంభింపఁ గలవు?

బాణు:—ఏమీ! నీ వొక్కఁడవేనా సత్యవిక్రముండవు?

దశ:—మ తేమను కొంటివి?

చ. బలిమిఁ బెకల్చి నేను గరపంక్తిని నిల్పిన వెండికొండ మం
గళఘట మై తనర్చి సుభగత్వముఁ గూర్పఁగ వీరలక్ష్మికిన్
విలసిత కేళిసౌధ మయి పెంపు వహించిన యట్టి మద్భుజ
మ్ముల మహిమమ్ము నీకు లవముం దెలియంగఁ దరంబె బాలిశా!

బాణు:—వృథావాక్కలహ మిఁకఁ గట్టిపెట్టుము. ఈ ధనువే మన యిద్దఱ తారతమ్యంబును నిరూపింపఁ గలదు.

మంజీ:—బాణరావణులారా! నరవీరునికి మాత్రమే సమర్పింపఁ దగిన యీ కన్నియం బెండ్లాడఁ గోరి మీ మానసంబుల నూఱక గాసిపెట్టుకొనియెద రేమి?

బాణు:—అగుఁ గాక. అయినను నా మాటము వేఱు.

గీ. పృథుల భుజదండ కాండంబు లిన్ని నాకుఁ
గలిగి నందుకు ఫలముగాఁ గరళకంఠు

సింగిణినిఁ బట్టి లీలఁ గర్షింపఁ దలఁచి
వచ్చితిని గాని సీతఁకు వలచి కాదు.

రావః:—

గీ. ఇందుశేఖరు శైలంబు నెత్తి నపుడె
ప్రకటితం బయ్యె నాదు దోర్బల పరీక్ష
కాన సీతాకరగ్రహ కౌతుకమునఁ
బట్టితిని నేఁడు హరధను ర్భంగ దీక్ష.

(తెరలో)

క. సుర గరు డాసుర చారణ
నర కిన్నర సిద్ధ సాధ్య నాగులలో నీ
హరధనువు నెవఁడు వంచునొ
వరుఁ డగు నాతండు నాదుపట్టికిఁ బేర్మిన్.

దశ:—మేలు మేలు.

ఉ. రెండు కొనుంకు చాప మవలీలను వంపుఁడు నింపుఁ డీజగ
న్మండలి నెల్ల సల్లుకొన మానిత కీర్తిభరంబు నోభుజా
దండములార! దోఁగుఁ డిఁకఁ దత్పరతన్ మిథిలేంద్రపుత్రి చ
న్గొండలపై ఘుమంఘుమలఁ గొల్పు లసద్ఘనసారచర్చలన్.

[ధనువుం జూచి తనలో] ఈధనువు సాధింప రానిది. కావున దీనిజోలియే నాకు వలదు. [ప్రకాశముగా] బాణా! నీవే ముందుగా ధనువు నారోపింపుము. క్రొత్తగా వచ్చిన వాఁడ వటుటం జేసి నాకును మాన్యుండవు గదా!

బాణు:—అట్లే. (అని పరిక్రమించును)

దశ:—[తనలో] హృదయమా! భయపడకుము. దశకంఠు డీ కంఠీ కృతుఁ డైనప్పు డీశితికంఠకార్ముకమును వంచుట కింక బాణుఁ డేపాటివాఁడు? అయినను

శా. వేఱొక్కం డెవఁ డేని దోర్బలకళోపేతుండు చంద్రాంకు వి
ల్లారోపించి విదేహజాతను వివాహంబు గాదు నేనిన్ బలా
త్కారప్రక్రియ లంకఁ జేర్తు మృదువాక్చాతుర్య సౌభాగ్య మే
పారం దేర్తు నవశ్య మెట్లయిన వశ్యం జేతు వైదేహినిన్.

మంజీ:—వయస్యా! చూచితివా?

ఉ. బాణుని బాహుబంధముల పట్టునకుం గడు నగ్గమయ్యె నీ
స్థాణుని సాయకాసనము సంచలియింప దొకింత; పంకరు
డ్బాణుని కోల్తలం బడినవాని వచఃపరిపాటి చేతఁ గ
ల్యాణుల నైజపూతహృదయమ్ము చలింపని యట్లు లద్దిరే.

దశ:—[తనలో విషాదముతో] ఈదురుపశ్రుతి యేమి! నాసీతానయకార్యంబునకు విఘ్నసూచకం బై వినవచ్చినదే! [ప్రకాశముగా] ఓరీ బాణా! నీభుజభారము నిస్సారమైనదని యిప్పుడైన నొప్పుకొందువా?

బాణు:—ఓరీ దశకంఠా! ప్రచండంబు లగు మద్భుజాదండంబులఁ గన్నులారఁ జూచు చుండియు నీవక్రభాషితమును మానకున్నావు. మెలకువతో మెలంగుము.

దశ:—కాకున్న నేమి సేయుదువు?

బాణ:—కార్త వీర్యార్జునుఁ డేమి చేసెనో దానినే చేయుదును.

దశ:—ప్రేలకుము. మత్ప్రతాపానలంబున నీ భుజారణ్యంబు నెల్ల నొక్కపెట్ట మాడ్చివైచెదను.

బాణు:—ఓరీ వీరబ్రువా! పట్టినవి యింద్రధనుస్సులై పొడకట్టు మద్భుజాదండంబు లనెడు మేఘమండలంబుల నుండి శరపరంపరలనెడి ధారాసారమ్ములఁ గుమ్మరించి నీ ప్రతాపానలంబు నట్టె చల్లార్చివైచెదను చూడుము.

దశ:—

చ. పఱపుము రోరి బాణ ! యిఁక బాణము లైదు శతమ్ము లేనియుం
పఱియలు వాఱు నాదుకరవాలున నయ్యవి యెల్ల; నీవునుం
బఱపుము నీదు బాణములఁ బాయక నిట్టెడఁ బంచబాణ ! యా
సరసిజపత్త్రనేత్ర కవచ మ్మయి కాచును రోరి ! న న్నిటన్.

సూత్ర:— బాణ రావణులారా ! మిమ్ము మీరే వర్ణించి కొనుట కించు కైన లజ్జింప కున్నారు గదా !

దశ:— ఛీ మూర్ఖా ! దశకంఠుఁడు తన్నుఁ దాను వర్ణించి కొను నటరా ? ఎఱుంగవు గాఁబోలు.

* మ. అలమండోదరిచారుకేశభర మం దంగ్గైన మందార మా
లల నింపొందు మరందబిందువుల నెల్లం గ్రోలి యేపారు తే
టులు సైతమ్ము విపంచిసంచయము లట్లుల్ పేశలారావముల్
దోలఁకం బాడు మదీయ విక్రమ కథాస్తోమంబు లొక్కుమ్మడిన్.

బాణ:— మందార మాలల ధరియించిన కాంతలతోడి యుపభోగ సౌఖ్యము తనకు మాత్రమే కల దని వీ డెంతయు విఱ్ఱవీఁగు చున్నాఁడు. ఇది నాకు లోపమే కదా. కాని య్మిది యెంత పని ?

శా. కైలాసాగ్రము లెట్టి మామకభుజాకాండంబు లయ్యింద్రు దం
భోళిస్ఫూర్జితుఁ దోలి, లీలమెయి వేల్పుందోఁట సర్వంబు ని
ర్మూలంబుం బొనరించి తెచ్చి నెలకొల్పుం గాత మింపొప్ప మ
ల్లీలోద్యానతలిం దదీయ తరువల్లీ తల్లజ శ్రేణులన్.

[నిష్క్రమించును]

---

* మ. సహసోద్గీతవిపంచి పంచమరవ శ్రావ్యధ్వనుల్ వినిఱు మ
స్మహిషీ కోమలవక్త్రకేశపటలీమందారమాలా మరం
ద హితాస్వాదనకేళి తుండిలమిళిందగ్రామణుల్ సైతమున్
బహిరంగక్రియఁ జాటు మామకకథా ప్రాగ్భ్యగంధావళుల్.

దశ:—వీఁడు చల్లఁగా దప్పుకొని పోయినాఁడు. కాని నామతమట్లు గాదు.

గీ. బలిమి నైనను జానకిం బడయ కుండ
నిచటు వాయుంగ నుంతయు నిచ్చగింప;
ఆ ప్తజనముల క్రూరంపుటార్పు లెలుఁగు
నుడిసి యే దేని నావీను సోఁక దేని.

మంజీ:—(సీతను స్మరించి) వత్సా జానకీ! ఇఁక నిన్ను దైవమే కాపాడవలయు.

[ఆకాశమున]

లంకేశ్వరా! రక్షింపుము రక్షిము.

దశ:—[చెవియొగ్గి] ఆకాశమున నెవరిదో యార్తధ్వని వినవచ్చుచున్నది. [చక్కగా నిరూపించి] నిక్కముగ నిది మారీచుని కంఠస్వరము. ఎవని బాణంపు తాఁకునకో యగ్గమై బిట్టువాపోవుచు నాకసంబునఁ బోవుచున్నాఁడు. కావున సత్వర మేఁగి యాతని నూఱడింతును గాక. [నిష్క్రమించును.]

నూపు:—[సంతసముతో] వయస్యా! పులి వాతనుండి లేడిపిల్లవలె దైవవశమున జానకి వీనిచేతినుండి విడివడియెను.

మంజీ:—సఖా! నిక్కమ్ముగ నట్లే జరిగినది. ఈవృత్తాంతము జనక రాజునకు నివేదింతము రమ్ము. [నిష్క్రమింతురు.]

గద్యము.

ఇది శ్రీమ దత్రికులాత్రేయ కవిరత్నబిరుదధారేయ శ్రీమ
దెరమిల్లివంశ పయఃపారావార సుధాకరాయమాణ
నారాయణప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త
కుశేశయ కొండలరాయనామధేయ
ప్రణీతం బైన ప్రసన్నరాఘవ
నాటకంబునఁ బ్రథమాంకము
సంపూర్ణము.



శ్రీ

# ప్రసన్నరాఘవము.

## ద్వితీయాంకము.

తాపసుఁడు ప్రవేశించుచున్నాఁడు.

తాప:—(చుట్టును జూచి) ఆహా! యీ యారామప్రదేశ మెంతో రమణీయముగా నున్నది! గుంపులు గుంపులుగాఁ జిలుకపిల్లలెల్లెడల వ్రాలి యుండుటచేత నీహరితలతావితానమ్ము లతి మనోహరములై చూపట్టుచున్నవి. (తెరవంకఁ జూచి) ఎవఁడో బిక్షుకుఁ డిటు వచ్చుచున్నాఁడు. భిక్షుకా! యిటు రమ్ము.

[భిక్షుకుఁడు ప్రవేశించును.]

భిక్షు:—తాపసులవారికిఁ గుశలమా?

తాప:—మాకుఁ గుశలమే. మీకును భద్రమే కదా!

భిక్షు:—ఇప్పుడు విశేషించి మీదర్శనము చేత.

తాప:—(ప్రణయముతో) కీటము భంగి మహీంతలంబునం దెల్లఁ గ్రుమ్మరుటం జేసి నీ వలసి యున్నావని తోఁచెడిని. కాన నీమిథిలయం దైదురాత్రులు నివసించి శ్రమఁ బాపుకొని పోవచ్చును. మఱియుఁ బ్రసంగవశమున జనకరాజును గూడఁ జూడవచ్చును.

భిక్షు:—సర్వసంగములను వదలుకొనియున్న మాకు రాజదర్శనము లేలోఁ బని యేమి?

తాప:—నిజమే కాని యీపేరధ్వజుఁ డందఱవంటివాఁడు గాఁడు. బ్రహ్మవిద్యాపరాయణుఁడు. కాన మీయట్టివా రవశ్యము జూడఁ దగినవాఁడు.

భిక్షు:—ఈతఁడు రాజు గదా! బ్రహ్మవిద్యాపరాయణుఁ డెట్లు కాఁగలఁడు?

తాప:—ఈతనివిషయమును మాత్రము నేను నొక్కి చెప్పఁ గలను. నిక్కముగ బ్రహ్మవిద్యాపరాయణుఁడే.

భిక్షు:—అట్లయిన నీ వెవరవు?

తాప:—దేవుఁ డగుదశ (అర్ధోక్తియందే) కాదు సితికంఠుని యాజ్ఞాకరుఁడను.

భిక్షు:—ఇంక దాపకుము. నేను గ్రహించితిని. నీవు రాక్షసుఁడవు గదా!

తాప:—అట్లయిన నీ వెవరవో నిజముగాఁ జెప్పుము.

భిక్షు:—నీవు వలె నేను నొక రాక్షసుఁడనే.

తాప:—ఇఁక భయము లేదు. చెప్పెదను వినుము. ఎవ్వఁడో కౌశికుఁ డనుముని యొకఁ డయోధ్యాపతిచెంత కేఁగి యాతని తనయుని రాముఁ డనువానిని నిజమఖరక్షణార్థమై తన వెంటఁ బంపు మని యాచించె నఁట. అంత నారాజు ముని మాట దాట నేరక తన కన్నుల కన్నఁ బ్రియమైన తనయుల నిద్దఱను నాతనికి సమర్పించె నఁట.

భిక్షు:—తరువాత నేమి జరిగినది?

తాప:—అంత నామని యా రాజునకు బహుమానపురస్సరముగా రెండు కుండలముల నిచ్చి "రాజా! యివి దేవనిర్మితములు.

గీ. వీరమాతలు మాత్రమే వీను లందుఁ
దాల్పఁ దగినట్టి వివ్వి భూతలమహేంద్ర!
తెలిపెదుం జూపె వానియందలి యమూల్య
రత్నములలోని వర్ణచక్రంబె యిట్లు.

కావున కౌసల్య వీని నలంకరించికొనుఁ గాక" అని యాదేశించెను. అందులకు రాజు మహాప్రసాద మని యంగీకరించెను. పిదప నా రాజకుమారుల నిద్దఱను వెంటఁ బెట్టుకొని ముని తన యాశ్రమంబున కేఁగె నఁట.

భిక్షు:—పిదప నేమి జరిగినది?

తాప:—అంత సకల మంత్రికులమకుటాయమానుఁ డగుమాల్యవంతుఁ డీవార్త యాలించి యాకుండలములు లంకేశ్వరుని తల్లి యగు నికషాదేవియే ధరింప నుచితము లని తలఁచి వాని నెట్లయిన హరింపు మని తాటకకుఁ దన యనుచరుని చేత నిదివఱకే వార్త నంపి యున్నాఁడు. ఇప్పటి కాకుండలములఁ దాటక సంపాదించి యుండు నని యూహించి వానిం గొని తెచ్చుటకై యాతఁ డిప్పుడు న న్నిటకుఁ బంపినాఁడు.

భిక్షు:—ఈ వృత్తాంత మంతయు మాల్యవంతుని కెట్లు దెలియ వచ్చినది?

తాప:—

గీ. వింశమాటయుఁ దెలితేట విద్దియయును
నిరుపమం బైన కస్తూరిపరిళమును

నీటఁ దైలబిందువు వోలె నిలుప రాక
ధరణి వ్యాపించు నీమూఁడుఁ దమకుఁ దామె. 2

అదియునుం గాక మాల్యవంతునికడ నిపుణు లగువేఁగు లనేకు లున్నారు.

భిక్షు:—సరియ కాని నీ వీమిధిలోపవనమునకు రాఁ గతం బేమి

తాప:—లంకేశ్వరుఁ డిపుడు మిథిలకు వచ్చి యున్నాఁ డని వింటిని ఆతని దర్శింపఁ గోరి ముందుగా నిటకు వచ్చితిని. ఇఁక నిప్పుడు తాటకావనమునకుఁ బోవు చున్నాను. కాఁబట్టి యిఁక నీకధ సవిస్తరముగా నెఱిగింపుము.

భిక్షు:—మాల్యవంతుఁడు తొలుతఁ దాటకచెంత కెవ్వనిఁ బంపెనో వాఁడనే నేను. ఇటకు వచ్చుటకు మన కిద్దఱకు నొకటే కారణము.

తాప:—(సంతోషముతో) అట్లయిన నిప్పుడు తాటకావనముసఁ దాటంకము లున్నవా?

భిక్షు:— తాటక యున్నదా యనుము.

తాప:—అట్లయినఁ దాటక యిపు డెచ్చట నున్నది?

భిక్షు:—ఇప్పటికి నగరమునఁ బ్రవేశించి యుండును.

తాప:—అయోధ్యానగరముననేనా!

భిక్షు:—కాదు ప్రేతనగరమున.

తాప:—దానినిఁ బ్రేతనగరమునఁ బ్రవేశపెట్టిన దెవరు?

భిక్షు:—రామబాణము.

తాప:—ఎవఁ డా రాముఁడు? (విమర్శించి) ఆదశరథుని పెద్దకొడుకు గాఁబోలు. మఱి యిప్పుడు తాటకాతనయు లెక్కడ నున్నారు?

భిక్షు:—తల్లిని బాయలేక సుబాహుఁడు దాటక వెంటనే పోయెను. ఇఁక మారీచుఁ డన్ననో రాముఁడు ప్రయోగించిన వాయవ్యాస్త్రంపుఁ బ్రభావమున జీవన్మృతుఁడై యెచ్చటనో పడి యున్నవాఁడు.

తాప:—ఈవృత్తాంతము లంకేశ్వరున కెవ రేని తెలుప లేదా ?

భిక్షు:—బిట్టు వాపోవు మారీచుడే తెలుపుకొనియెను.

తాప:—అట్లయిన లంకేశ్వరునకు వేఁడి యెక్క లేదా ?

భిక్షు:—సీతమీఁది వలపు సొలపునఁ జల్లనై యున్న లంకేశ్వరుని హృదయమునఁ గోపంపు వేఁడి చొరనేర దయ్యెను.

తాప:—మఱి యిపుడు రామలక్ష్మణు లెచ్చట నున్నారు ?

భిక్షు:—వా రిపుడు కౌశికుని వెంబడించి తదాశ్రమమునుండి మిథిలకే బయలుదేఱి వచ్చుచున్నా రని విని యుంటిని. (చూచి భయముతో) ఇదిగో ! వా రిటే వచ్చుచున్నారు. కావున నిశాచర కులాంతకుఁడైన యీరాముని యెదుట నిలువ రాదు. పోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

విష్కంభము.

---

రంగము—మిథిలాసమీపమం దొక తోట.

[రామలక్ష్మణులు ప్రవేశింతురు]

రాము:—ఈ యారామము మిక్కిలియు రమణీయమై యున్నది.

లక్ష్మ:—ఇది నిసర్గముగనే రమణీయమైనవనము. దానికిం దో డిప్పుడు వసంతము గూడఁ బ్రాప్తించినది. ఇఁక దీని శోభ చెప్పవలయునా ?

రాము—(హర్షముతో) అవును వసంతలక్ష్మి యవతరించినది. ఇటు జూడుము.

గీ. మల్లెవిరిదేనియలఁ గ్రోలి మధుపసతులు
సెఱవు చున్నవి కాకలీస్వరము లిచట;
అడుగు నడుగున లేగాలి హంగుసేయఁ
బొంగి నర్తించు నిట నిండుఁబాగడకొమ్మ. 3

మఱియు.

చ. తలపులమాలియానఁ గొని తద్దయు నమ్మలయాగ్రమాదిగాఁ
జలిమలదాఁకఁ గల్గుమహిచక్రము గెల్వఁగ నేఁగఁ జొచ్చి తా
నలరజతాద్రి వాసుఁ బవనాశనభూషు ధవుం దలంచి వి
హ్వలుఁ డయినాఁ డనంగ వడి బాసె వసంతసమీరుఁ డియ్యెడన్ 4

లక్ష్మ—నే నిట్లు వితర్కించెదను.

చ. పలుచనితేనె లొల్కు సుమపంక్తుల రాల్చుచు వల్లికామృగా
క్షులు దమయిచ్చ నర్చనలఁ గొమ్మని తెన్నరికట్టఁ దేఁటిగో
న్మల రవణమ్ము వించుఁ దనమావు హరమ్మున నోహటింపఁ గొం
దలపడినాఁ డనంగ వడి దక్షిణ సమీరణుఁ డివ్వనంబునన్. 15

రాము:—వత్సా! ఇఁక నీప్రసంగము వదలుము. భగవానుఁ డగు విశ్వామిత్రుఁడు పూజ్యుఁ డగుయాజ్ఞవల్క్యునితో సమాగమసౌఖ్య మనుభవించు చుండు నంతదాఁక మన మివ్వనంబున దిరుగుచు వారి సాయంతనదేవతార్చనకు వలయు పుష్పంబులఁ గోయు చుందము.

లక్ష్మ:—మంచి దట్లే సేయుదము. (లతావిటపమ్మున దూఱుదురు)

రాము:—(చూచి) ఓహో! ఇచ్చట కాళికాదేవాలయము గూడ నున్నదే! [అంజలి పట్టి]

క. కరుణతరంగ తరంగిణీ!
సురుచిర నయనామృత ప్రచురశీకరిణీ!
తరుణామృతకర శేఖర
తరుణీ! యంజలి ఘటింతుఁ దాత్పర్యమునన్. 6

[వే డ్కఁ జూచి] ఆహా! యేమి యీసౌభాగ్యము! కల కలారావమ్ములు సలుపుచుం జరియించుమదమరాళమ్ములకు శ్రవణ భూషణము లై యొప్పు ననేకపుండరీకమండలంబులకుఁ దావలం బైన యీసరోవరంబు నాయుల్లమున కుల్లాసము గొల్పుచున్నది. (మఱలఁ గౌతకములో) ఔరా! తామరాకులతంపరం జరియించు తనసహచరిం గూడ నెడబాసి యీకలహంసశాబకం బేలకో యాలేమావి మోకల సందున కేఁగుచున్నది. [చెవియొగ్గి] ఏమిది! మనపుటేనుంగు పదం బులం బొదలు బంగారు సంకెల లోని రతనాల మ్రోత ననుక రించుచు నద్దిరయో కలకల మద్దెస నుండి వినవచ్చుచున్నది. (మఱల విని) రాజహంసీశింజితము వలె నున్నదే! (మఱఁ నిపుణముగ నిరూ పించి) కాదు కాదు. అట్టిదే మంజీరశింజాన మిది. ఎవ్వతెయో పురాం గన తనపాదమ్ము లందలి మణినూపురములు సలీలముగ మ్రోగు చుండఁ గాళీదర్శనార్థ మై యిట కేఁగుదెంచు చుండ నోపు. కావున నే నిట నిలువ రాదు. రఘువంశసంభూతులు పరస్త్రీ లుండుప్రాంత మునఁ గూడ నిలువరు గదా!

(తెఱలో)

భర్తృదారికా! యిటు నిటు!

రాము:—ఏమి! నే శంకించిన కాంత యవివాహిత యగు రాజ కుమారికయా! అట్లయినఁ జూడ వచ్చును. (జూచి హర్ష కౌతుకములతో)

చ. అసితశిలా తలోల్లిఖితహాటక రేఖల దాటవేట్టు లై
పసిడియనంటి లోజిగికి బిరుదుగు లై వసుపు స్థలంపు తే
ల్పసల నదల్చు సంగముల భాసిలుచుం బ్రసవాస్త్ర కేలికా
సతి లసించుదీపశిఖ లైఖరిఁ దోఁచెడు నీవె యెవ్వరో ! 7

(అంతట సీతయు సఖియుఁ బ్రవేశింతురు)

సీత:—సఖీ ! చూచితివా ! ఇపు డీ యుద్యానతలము వసంత సఖుఁ డగు మాన్మథుఁడు స్వయముగా వచ్చి యలంకరించెనో యనునంతయు రమణీయమై కనుపట్టుచున్నది.

సఖి:—అనవద్యాంగీ ! నీ వన్నది నిజమే సుమా !

రాము:—(తనలో) సర్వాన వద్యాంగీ యనుము.

సీ. బంధూక కుసుమ ప్రభాపరంపరలతో
నాట లాడఁ గడంగు నధర తలము
లలిత మాధూక కుట్మల కదంబములతోఁ
గలహ మాడఁ దలంచు గండ తలము
కమనీయ కేతకీ సుమ నవరాజములతో
వియ్య మాడఁగఁ జూచు వీక్షణమ్ము
పరిపక్వ దాడిమీ ఫలబీజ రాజితో
వంత మాడఁ దొడంగు దంత పంక్తి

గీ. చారు లావణ్య రససుధాపూరములకు
నాలయం బన నొప్పు నయ్యాప్యరేఖ
యేలుచున్నది దన కెందు నెదురు లేక
రమ్య రాజీవ రాజ్య సామ్రాజ్యపద్మము. 8

(మఱల చక్కఁగాఁ జూచి) ఔరా !

సీ. తళతళల్ గులుకు కెందమ్మి పూ వఱదమ్మి
నళకాల నఘగంట నడఁచి వైచు
నవనవల్ జలుకు లేఁజవురాకులకు నెల్ల
నలచేతఁ గెంజాయ లందియిచ్చు
ధగధగల్ గొలుపు విద్రుమ ప్రవాళచ్ఛాయ
నవలీలఁ గొనమోవి నాని వైచు
వెలవెలల్ దొలఁకు వెన్నెల నిగారపుఁదేటు
నలఁతి నవ్వుల పేర్మి నపహసించు
గీ. బళిరె ! యద్భుత మీకాంత బాల యయ్యుఁ
బ్రకృతి రమ్యమ్ము లగు పదార్థముల నెల్ల
నరయ దొరకొన్న తఱిఁ దత్తదర్హ భంగి
నెఱపు చాతుర్య గరిమ వర్ణింపఁ దరమె? 9

సఖి:—భర్తృదారికా ! ఆ కాళికాలయ మిదిగో !

సీత:—(అంజలి పట్టి) దేవీ చంద్రశేఖర దేహార్ధ ధారిణీ ! త్రిభువన గృహ సువాసినీ ! యిదే నమస్కారము.

సఖి:—ఈ నమస్కార విధానము సముచితముగనే యున్నది.

సీత:—(ప్రణయ కోపముతో) చాలు చాలు కట్టి పెట్టుము.

సఖి:—(చేతులు దోయిలించి)

గీ. చంద్ర మణి దామ కోమలా ! చంద్ర రేఖ
కా కిరీటాంక శాయినీ ! కాళి కాంబ !
చంద్ర సుందర ముఖికి నాసఖికి నింకఁ
జంద్ర సుందరు నొక కాంతు సంఘటింపు. 10

రాము:—(తనలో) ఈ కాంతకు త్వరితముగనే వివాహము జరుగ వలయునని సఖిజనుల కోరిక. (విమర్శించి) అవును యిది యుచితమే. ఈమె వయస్సంధి యందున్నట్లు దోఁచెడిని.

గీ. బాల్య మెడలంగ సీదు పైవాలెఁ గోర
బేలతన మేగఁ జాతురి పెనఁగఁ దలఁప
నేవయు స్వర్శయును లేక యొనఁగు చున్న
దసమశరు మర్మమై యీ మృగాక్షి తనువు. 11

సఖ:—దేవీ ! యీనా సఖ పరితాపమును గూరక మున్నే త్వరిత ముగ నాకోర్కెఁ బండింపుము.

సీత:—(ప్రణయ కోపముతో) నే నెందులకుఁ బరితపింతునే ?

లక్ష్మ:—ఓ రాజహంస కన్యకా ! ఏటి కింత బరితపించు చున్నావు! చూడవో నీ కాంతు నీలేమావిగుబురు మాటున.

సీత:—సఖీ ! నున్నటేనుఁగు కంఠ ఘోషణము వలె మధురమై వినవచ్చు చున్నదే. ఎవరి దీకంఠధ్వని? తెలిసికొందము రమ్ము. (అని పరిక్రమించును.)

రాము:—(విషాదముతో) కట్టా ! లత యీపె నడ్డుకొన్నదే. (లత నుద్దేశించి) ఓసీ లతా !

క. ఆమోవికిఁ బల్లవములు
పూమంజరు లాయురోజముల కోడఁగ నిం
కే మొగము వెట్టుకొని యీ
కోమలి సరికట్టఁ దలఁపుఁ గొంటివి చెపుమా. 12

(మఱల హర్షముతో) ఇవు డీపె యరఁటిచెట్ల సందునకు వచ్చినది

ఉ. కారుమొయిళ్లలో మెలఁగు కైరవిణీ హృదయేశు రేఖ చా
కోరకిశోరకమ్మునకుఁ గూరుచు నంతటి సంతసంబు నా
కీ రమణీ లలామ ఘటియించె మనమ్మున; నీలకాంతి నో
ప్పారుచు నున్న యియ్యరఁటి యాకుల సందున సంచరించుచున్. 13

(కదళి నుద్దేశించి)

మ. ఎనయం గోరుచు నున్న దానవు గదే ! యీనారియూరుద్యుతిన్
విను మల్లని వచింతు నోసి కదలీ ! నీ పీసతిన్ వెంట నే
చననీ లోకుము దాటి, దీర్ఘసహవాసం బున్న నే కాదె యెం
దును సుస్థైర్యము నొందు నారులకళల్ దూరంబు రోయింపఁగన్. 14

సీత:—చెలీ ! చూచితివా ! మేని మెఱుంగులు బంగరు డాలు డీలు పఱుప చెవి నిడ్డ నెమలి పురికాంతులు దిశల వెలిగింప నివు డిపుడే నిగ్గుదేఱు చున్న చూపులతో గనుపట్టు నీ కౌమరుఁ డెవ్వఁడో కదా ! ఈతనిం జూడగనే నాహృదయము కన్న బిడ్డనిఁ జూచి నప్పుడు వలె వాత్సల్య రసంబునఁ దోఁగు చున్నది.

లక్ష్మ:—(సీతం జూచి) ఎవ రీయమ? ఈమెం జూడగనే నాచిత్తవృత్తి మాతల్లి యందుం బోలె గౌరవ ప్రవృత్తి వహించినది

సీత:—సఖీ ! యీతనిం జూడ వత్సయగు నూర్మిళ నాతలంపున కెక్కు చున్నది.

సఖి:—(నవ్వి) వత్సా యని పిలిచి యీతని లాలింప నెవ్వఁ డర్హుఁడై యుండునో యట్టివాఁడు నా కగపడి నపుడు నీవును నాతలంపున కెక్కుదువు. అయినను నీతని నడిగి చూచెదఁ గాక. (సమీపించి) ఓయీ రాకుమారకా! నీ వెవరవు ! పరిచితములు కాని యీవన ప్రదేశములం దొంటి గ్రుమ్మరు చున్నాఁడ వేమి?

లక్ష్మ:—ఛీ తెలివిమాలినదానా! మాయన్న యగు రామచంద్రుఁడు పరిసరంబులనే చరించుచు నాకుఁ దోడై యుండ నే నొంటి నె ట్లగుదును ?

సఖి:—(సంతసముతోఁ దనలో) అమ్మయ్యా ! నామనోరథాంకుర మిప్పుడు మొగ్గ దొడిగినది.

సీత:—సఖీ! యిచ్చట మన కేమి పని? ఇంటికిఁ బోదము రమ్మా.
(కొంచెము నడచి వెనుకకు మరలి) సఖీ! మనమా లేమావి
గున్నను చూడనే లేదు గదా! మా యమ్మమ్మలు దాని నాబండి
గురివెంద తీవతో మేళనము సేయఁ దలచిరే. మఱచితివా?
కావున రమ్మా. ఒక సారి చూచి పోదము. (పరిక్రమింతురు)

రాము:—(హర్షముతో)

సీ. మామక స్వాంత కైరవారామమునకు
నాశ్వయుజ పూర్ణిమా రాత్రి యై దనర్చు
నీ సరోరుహ నేత్ర దా నిపుడు బళిరె!
వచ్చుచున్నది మఱల నివ్వంక కిదిగో. 15

(నిపుణముగఁ బరికించి) ఔరా? యేమి యీ శృంగార విశేషము.

సీ. ఫాలమా యిది! మహేశ్వర శిరస్తటి పైనిఁ
గ్రీడించు రేఱేని రేఖ గాని
చూడ్కులా యివి! నవస్ఫురణ గుంభితము లై
కొమరారు నీలోత్పలములు గాని
కుచములా యివి! కొట్టకొన మూతి కడ విచ్చు
లలిత పంకజ కుట్మలములు గాని
కచభారమా యిది! ఘనత రాద్భుత భంగి
జగతిఁ బర్వెడు తమశ్చయము గాని
గీ. చానయా యీపె! చిర తపశ్చర్యఁ బడసి
నారి కై సేసి పూజించి నాఁటఁ గూర్చి
ప్రాణ మరివోసి త్రిభువనోపరియు నొకట
మరుఁడు గుఱియిడ్డ సమ్మోహ శరము గాని. 16

సఖి:—భర్తృదారికా! యిదిగో మన లేమావిగున్న. అదిగో! చెంతనే
యాబండి గురివెంద తీవ. (సమీపమునకు నడతురు)

రాము:—వీరు నా సమీప దేశమునకే వచ్చు చున్నారు. ఈ కాపున నించుక తొలఁగి యుండెదను.

సీత:—(మావికొమ్మను జేతబట్టుకొని) సఖీ! యిదేమి! ఈ యీ యా కులపైఁ గొనగోటి గీరలు గనఁబట్టు చున్నవి. (యోచించి) ఎవరో యొక చతురుఁడు స్వహస్తములతో నీ మావి కొమ్మ నాదరించి నట్లు దోఁచు చున్నది. ఒకవేళ మన్మథుఁడే యిది తన విల్లని భ్రమించి యిట్లొనర్చి యుండ నోపు.

రాము:—(తనలో) ఇది నీయూహ గాఁ బోలు. నావితర్కము వేఱు. ఏల యన,

మ. తన విల్లంచు భ్రమించి పట్టుకొనె గందర్పుండు నీమేను దీ
వెను మధ్యస్థలి యుండు నందునన సూవే వేళ్ళసంధిస్థలిం
బనువౌ రేఖలు మూఁడు గూడఁ ద్రివళీవ్యాజ్యంబుచే నచ్చటం
దను గొందెం ద్రిజగద్వశీకరణ ముద్రల్ వోలె లోలేక్షణా! 17

సఖి:—భర్తృదారికా! యిదిగో చూడుము వాసంతీలత: మఱియు నొక విశేషము.

గీ. బంధి గురివెంద విరుల నిర్భరతఁ బొలఁకుఁ
రమ్యమకరంద బిందు ధారలకు మురసి
వదలు చున్నవి మెలమెల్ల బంభరములు
తమకుఁ జిరమందిరం బైన తమ్మి నిపుడు. 18

సీత:—(దానినే చదువును)

రాము:—(తనలో) ఇపుడు నే నొక లతను వర్ణించిన లాభ మేమి?

గీ. చిన్నతన మను శిశిరంబు చెల్లి పోవఁ
గొమరుఁ బ్రాయం బనెడు వసంతము ఘటిల్లి

కుచ మనెడు మొగ్గ దొడగు నిక్కువలయూత్తి
గాత్రలత కన్న వర్ణ్యంబు గలదె వేఱు! .19

సఖి:—భర్తృదారికా ! చూచితివా యీ వినోదము. ఈ బండి గురివెంద తీవ తానే లేమావి గున్నను గాఁగలించి కొనఁ దలఁచి ముందునకు సాగు చున్నది.

సీత:—(ప్రణయ కోపముతో) చాలు. నీ మాటలకు నాకుఁ దలనొప్పి వచ్చు చున్నది. నే నిఁక నీ చెంత నిలువను. వేఱొక చోటికిఁ బోయెదను. (వెడలి పోవును.)

రాము:—

వ. లలిత మృణాల కాండ విమల స్ఫుట రోచి కపోల యుగ్మ, సం
చలిత సలీల నీల జలజ ప్రతిమల్ల విశాల నేత్ర, ప్రో
ద్విలసదశోక శోణ రుచి పేశల పాణియు నై యెసంగు నీ
పొలతివిలాస వైభవము మోదము గూర్పదె యేరికేనియున్. 20

సీత:—(రామునిం జూచి కౌతుకముతో)

సీ. కలువ రేకుల సొరుఁ గడకాల నడగించు
మెఱుఁగుఁ జామన చాయ మేనివాఁడు
చిగురు విల్కాని నే చీరికిం గొనఁ బోని
యంద చందముల కి ల్లయిన వాఁడు
శివ మౌళి పూవైన చిన్ని జాబిలి తోడ
సరివచ్చు ముద్దు ముచ్చటల వాఁడు
చేయని సొమ్ములై చెలువు సంఘటియించు
కమనీయ శౌకపతుముల వాఁడు

గీ. కన్ను దోయికిఁ బండు వై గ్రాలు వాఁడు
బళి రె ! యీ భాగ్యరాశి యెవ్వండొ కాని

గాత్ర కాంతులు దెసలందుఁ గ్రమ్ముకొనఁగ
నలరుచున్నాఁడు పొదరింట నబ్బురముగ. 21

సఖి:—భర్తృదారికా! లతాసందర్శనము మానితి వేమి?

సీత:—(వినిపించికొనక దానినే పంచమ స్వరమునఁ బాడును).

సఖి:—(సమీపించి చూచి) ఈపె చిత్త మిచ్చట లేదు. అయిన నెక్కడ నున్నది? [రాముని జూచి సాభిప్రాయముగ] ఓహో! యీపె డెందంపు టునికి తెలిసెఁ జుమీ. ఇట్టి వింత కంబ మైనది! (సీతను చేయిఁబట్టుకొని) భర్తృదారికా! నీ మీఁదనే ప్రాణములు పెట్టుకొని యున్న సఖీ జనము నిట్లు తిరస్కరించుట పాడియా! అవులెమ్ము, నీ హృదయమున నిప్పు డాగ్రహ మావేశించి యున్నది గదా!

సీత:—(తనలో) ఇది నాగుట్టుఁ దెలిసికొనెనా యేమి! (లజ్జిల్లును)

సఖి:—ఈపె సిగ్గువడి యట్లున్నది. కావున వేళగా మాట్లాడను గాక.(ప్రకాశముగా) భర్తృదారికా! ఇంకనుఁ బ్రణయాగ్రహము నీహృదయమును వదల లేదు గదా!

సీత:—(తనలో) ఇది నాకోపమును గూర్చి ముచ్చటించినది. అంతియ కాని యీతనినిఁ గూర్చి కాదు. సఖీ! నీపై నాకుఁ గోప ముండునా? నామానసము వేఱొకచో నుండుటచే నిన్ను గమనింప నైతిని.

సఖి:—అట్లయిన నీమానస మెక్కడ నున్నది?

సీత:—ఆరామ దేశమున.

* సఖి:—ఓహో! ఎంతజాణవు! నిజమును గప్పి పుచ్చుటకు నీవు తెచ్చిపెట్టుకొన్న యాకారమును బట్టియే నేను యథార్థమును గుర్తించితిని.

---

* ఆకారప్రకటనమున నే యాకారగోపనముఁ గావించితిని.

సీత:—(లజ్జతోఁ దలవంచుకొని యుండును.)

రాము:—

శా. కాళిందీ నదిలోనఁ బొంగెడు తరంగ శ్రేణిచేతం బలెన్
నీలం బైన కళా భరంబునఁ జదల్ నిండారఁ బంకేజముల్
వాలాయమ్మును సిగ్గు పెంపునఁ దలల్ వంపంగఁ బైకెత్తు మో
లోలాక్షీ! యొక సారి నీదు నిడు వాలుం గన్ను లిప్పట్టునన్. 22

సఖి:—(ప్రణయ హాసముతో) భర్తృదారికా! సఖీజనము చెంత నా గుట్టు దాచుట? నే నెఱుఁగ ననుకొంటివి కాబోలు.

గీ. పద్మ దళ లోచనుఁడు కాకపక్ష ధరుఁడు
లలిత నీలాబ్జ దామ కోమల తనుండు
రాము పేరింటి రతిరాజు రాజ వదన!
నీ తలంపున కెక్కెఁడే నిజము సెపుమ! 23

సీత:—సఖి! యిటు చూచితివా?

గీ. మావి పూఁదేనియల తీపి మలయు నోట
రతివధూ పాదగత నూపురమ్ము కరణి
కొసరి మేమేమి యో బిట్టు గొణుగు కొంచు
తిరుగు చున్నది చూడు మీ తేఁటి యబల! 24

(మఱలఁదనలో) ఏమి యీ వెఱ్ఱి!

గీ. ప్రియ జనాస్యారవింద మాధ్వీ రసంబు
గ్రోలుదురు గాక పిమ్మటఁ గోర్కె దీఱ
నరయుఁ డొక్కింత మీ రేడ నాతఁ డేడఁ
జంచలము లార లోచనాంచలము లార! 25

(క్రేగంట రాముని సలీలముగాఁ జూచును.)

రాము:—(చక్కఁగా నిరూపించి తనలో)

సీ. గొనబు తేజస్వనంబునకు సర్వధనంబు
మురిపెంపు నిలయంబు భోగమునకు
పొగరుదీటు నొయారమునకు సౌభాగ్యంబు
సారంబసార సంసారమునకు
విరిశరుదుపులఁ దాల్చు దొర కభిప్రాయంబు
పొందరాని ఫలంబు పుట్టునునకు
తను కొందు ననురాగమునకు లోపలి గుండె
గర్భ కోశంబు శృంగారమునకు

గీ. మూఁడు లోకమ్ములను నేడ నీడు లేని
భాగధేయమ్ముఁ లోచన భాగమునకుఁ
దలఁచి చూడంగ రతికిఁ దత్వంబు బళిరె!
యీపె వరపిన యట్టి యీచూపు నలుసు. 26

సీత:—(తనలో మఱల నాగాధనే పఠించును.)

సఖి:—భర్తృదారికా! చూచితివా!

చ. విరియఁగ బాఱె యెంతయును బెంపు నహించిన కాంతి పిండుచేఁ
బరగెడు కల్వలంచుఁ దనభావమునం దలపోసి మాటికిం
బఱువులు వాఱుచున్నయది పాయక యీ యెలదేఁటికూన సీ
తరళ విలోచనాగ్రముల దాపునకున్ మృగశాబకేక్షణా! 27

సీత:—(సంతసముతోఁ దనలో) లోచనమ్ములఁ దుమ్మెద లరికట్టి నను యిది సుఖోపశ్రుతియే గదా! (మఱల రామునిఁ జూచును.)

రాము:—(సప్రత్యాశముగా)

శా. ఈరాజాస్య ననున్ సుధాబ్ధిలహరీబృందంబులం బోలు దృ
గ్ధారాపాతము లందు ముంచిన ముహూర్తంబే సతం బబ్బునే!

యౌరా! యేగతి నబ్బు? చూడఁ గ్రమ బర్యాయంబు లై వచ్చి పైఁ
దారుం గాదె సుఖంబు దుఃఖము జగన్మర్యాద యుల్లే గదా! 28

(చేటి ప్రవేశించును)

చేటి:—భర్తృదారికా ! మీయమ్మలు నిన్నింటికిం గొని తెచ్చి విచిత్రాభరణములచే నలంకరింపు మని నాకాన తిచ్చి యున్నారు. అట్లలంకరించిన పిదప నిన్నుఁ గన్నులారఁ జూచి సంతసింతు రట.

సీత:—ఔరా ! వలపుఁబెల్లున నాతల్లు లెంత బేలలై యున్నవారు !

చేటి:—పిక్కముగ మీతల్లులు బేలలే. పల యందువా నిసర్గ లావణ్య చంద్రరేఖ వగు నిన్నుఁ దొడవు సిరులచే నలంకరింపఁ దలఁచు చున్నారు. మఱియు నాలోచింప,

ఉ. చందురుతోడ డీకొనదె జానగు నీముఖరేఖ చంద్రికా
బృందముతోడ సూడుఁ గొనదే చిఱునవ్వునిగారు కాంతి నెం
దుం దుల లేని కల్వవిరి దొన్నియలోపలఁ బాఱుతీరని
ష్యందముతోడఁ బంగెమునఁ నాఁగదె నీ కగణ్యమౌ సుందరీ. 29

మన మింక బోవుదము రమ్ము.

(స్త్రీలు నిష్క్రమింతురు)

రాము:—(విషాదముతో) ఔరా ! యీ కాంత దృష్టిపథంబును దాటి పోయినది. (మఱల నాసతో)

గీ. పవలు గనరాని పాలేయ భానురేఖ
రాత్రి కాలమ్ములను జకోరముల కట్లు
బ్రహ్మణును జూడ నాకు సంప్రాప్త మగునె ?
ఋ॥ రవితాల్కాలరాకా నిశేంధువదన. 30

లక్ష్మ:—ఆర్యా! యిదిగో సంప్రాప్తమైనదే చూచితివో?

రాము:—(హర్షముతో తనలో) ప్రేయసి మఱల వచ్చినదా యేమి! (చూచి) ఇచట నెవ్వరును గనుపట్టుట లేదు. కావున నీచిఱుత మఱి దేని నుద్దేశించియో యిట్లు పలికి యుండును. (ప్రకాశముగా బిగ్గఱగా) వత్సా! యేమి సంప్రాప్తమైనది?

లక్ష్మ:—

చ. గుఱుతుగఁ బంచబాణు విలు గోలను రూపఱఁ జేయులేఁత చం
దురుడు ప్రమోదవారిధి దోఁగఁగఁ బేర్చి ప్రసన్నమౌ ప్రభా
భరముసఁ దారకల్ మెఱయఁ, బైకొను రాగముతోడ వల్లభుం
దరిసెను పెండ్లికూతుసు విధమ్మునఁ బ్రాప్తిలె సంజ యీయదే!

రాము:—వత్సా! నిక్కమే సుమా!

ఉ. ఆరసి మూఁడు లోకముల యందలి తమ్ముల మేలుకొల్పి నీ
రేరుహబాంధవుం డిపుడు ఱివ్వనఁ జొచ్చుచు నున్నవాఁ డిదే
వారిధికుక్షిలోన, నటఁ బాయక నిద్దుఱఁ గూరుచున్న యా
సారసనేత్రు నాభిజలజమ్మును లేపఁ దలంచె నో యనన్. 32

లక్ష్మ:—ఆర్యా! ఆకాశదేశంబున సాంధ్యరాగ మంతతకుఁ దగ్గిపోవు చున్నది.

రాము:—వత్సా! అవునట్లే పొడకట్టు చున్నది.

ఉ. జార సుహృద్విరోధు లగు సంతమసేందురుచుల్ క్రమంబునం
దూరుపునం బ్రతీచినిని దోఁప నజాండము తుల్యరీతి జం
భారి శశాంక రత్నమయ మైనటు లొప్పుచు నర్కనందినీ
శౌరిపదీ ప్రవాహజలసంగముతోఁ దులకించె సామ్యమున్. 33

(మఱల హర్షముతో వ్రేలితోఁ జూపుచు) వత్సా ! యిటు జూడుము.

సీ. చక్రవాకాంగనా జనహృత్పుటములందుఁ
జక్కఁ దూఱిన వాఁడిశల్య మనఁగ
చాకోరనారుల చంచూకవాటంపుఁ
గోటి నుద్ఘాటించు కుంచి యనఁగ
[illegible]రనివారి దయితల కోపకుం
జరము పాలిఁటి యంకుశం బనఁగ
మాఁడిపోయినను మన్మథ మహీజము నందు
మగుడఁ దోఁచిన క్రొత్తచిగు రనఁగ

గీ. అంత కంతకు మృదుల ముగ్ధాంశు వితతి
ప్రౌఢతను జెంది దెసలందుఁ గ్రమ్ముకొనఁగ
నిఖిల జగమును బ్రమదవార్నిధినిఁ దేల
నలరు చున్నది సుమ్మి శీతాంశు రేఖ.

లక్ష్మః—

సీ. భంగావధూత జంబాలశంకరజటా
నైలింప తటినీ మృణాళ మనఁగఁ
బంచబాణప్రియా పానక్రియాసీత
నవసీధు భృంగార నాళ మనఁగ
సద్యఃపతిత వమచ్ఛవిపూర కర్పూర
శకలావగుంఛిత జాల మనఁగ
జగతీనితంబినీ చారుకుంతలతటీ
ఘటిత నూతనవజ్ర ఖండ మనఁగఁ
గీ. బరగు చున్నది జగ మెల్లఁ బ్రమదవార్ధి
దేల గగనాబ్ధి నీపత్ర దీవ్యమాన

వారి బిందువు, పీయూష వారి రాశి
బంధువును నైన యీసుధా భానురేఖ. 35

రాముః—వత్సా! ఇఁక జాగు చేయవలదు. సాయంతన దేవతార్చనకు వలయు పుష్పమ్ముల నర్పించి భగవంతుఁ డగు గాధినందనుని సేవింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

గద్యము.

ఇది శ్రీమ దత్రికులాత్రేయ కవిరత్న బిరుదధారేయ శ్రీమ
దెరమిల్లి వంశ పయఃపారావార సుధాకరాయమాణ
నారాయణప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త
కుశేశయ కొండల రాయనామధేయ
ప్రణీతం బైన ప్రసన్న రాఘవ
నాటకంబున ద్వితీయాంకము

సంపూర్ణము.





శ్రీ

# ప్రసన్న రాఘవము.

## తృతీయాంకము.

[వామనకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

(తన్నుఁ జూచికొని యాశ్చర్యముతో)

వామ:—అబ్బా నే నెంతఎత్తుగా వున్నాను! నే నిక్కడిలాగే తిరిగిన ట్టైతే ద్వారశిఖరం విరిగి పోతుంది. కాబట్టి వంగి నడుస్తాను.

(అంతఁ గుబ్జకుఁడు ప్రవేశించును.)

కుబ్జ:—ఏమోయి వామనకా! నీ కిప్పు డన్నిగుణాలూ అబ్బినట్టు గన పడుతూ వుందే!

వామ:—అ దేమి!

కుబ్జ:—అసలే పొట్టివాఁడవు. ఇప్పుడు మరగుజ్జవాఁడవు కూడా అయి నావు.

వామ:—(క్రోధముతో) ఏమి నీ తెలివి తక్కువ! నీమరగుజ్జతనము ఇత రులమీాద తోసేస్తున్నా వేమి! మరగుజ్జవాఁడవు నీవు. తల యెత్తుకొని తిరిగితే ద్వార శిఖరము విరిగిపోతుం దేమో నని యీాగుబ్జతనము నేను తెచ్చిపెట్టు కున్నాను

కుబ్జ:—(నవ్వి) జానె డున్నావో లేదో కాని ద్వారశిఖరం విరిగిపడుతుం

దంట ఎంత ప్రగల్భము! (క్రోధముతో) నేను గుజ్జువాండ నని నీతో ఎవ రన్నారు?

వామ:—ఆ భోతుమూపురము లాగు నీవీపుమీాద వుండే పెద్దకణితి రహస్యంగా నాతో చెప్పింది.

కుబ్జ:—(నవ్వి) ఇది కణితి గాదురా తెలివిమాలిన ముండాకొడకా సౌభాగ్యలక్ష్మికి తలద్దిందురా.

వామ:—ఒరేయి! మెల్లగా మాట్లాడు. మనము లోగిటి బంట్రోతులము. మనసౌభాగ్య సంభాషణ దొరగారు విన్నట్టాయనా కొంప మునిగి పోతుంది.

కుబ్జ:—భయపడకు ఏలినవా రిప్పుడు ముక్కుమూతల యింట్లో వున్నారు.

వామ:—కాదు. ఇప్పు డెవరో ఋషీశ్వరుం డొస్తాం డని వెలుపలి మంటపంలో వుండి ఎదురు చూస్తున్నారు.

కుబ్జ:—ఇంక మనం చచ్చాం.

వామ:—అదేం?

కుబ్జ:—ఇదివరకే యాజ్ఞవల్క్య డెదో ఉపదేశించి ఉపదేశించి రాజుగారు రాత్రి ళ్లన్నీ కళ్లమూతలతోనే గడిపే లాగా చేశాండు. ఇప్పు డీయన వుపదేశం చేత అంతఃపుర మస్తలే ఒసులుకుంటాడు. అప్పు డాయనకు మనము దినమైలవానికి నూలుబట్టల లాగు ఎందుకూ బనికిరాము.

వామ:—ఈయన ఉపదేశం కోసం రాలేదు. దివాణాలో వుండే యీాశ్వరుడి విల్లు చూడ డానికి వచ్చాడట.

కుబ్జ:—ఈయనకు యీాశ్వరుడి విల్లుతో పనే ముంది. కళ్ళన్నీ పొగ బాటి పోయేలాగా హోమాలు చేసుకుంటూ ఆశ్రమంలో

గూంచోక. కాబట్టి యీ సెవరో రాచ బావఁడని తోస్తా వుంది.

వామ:—(నవ్వి( నీకు ఒళ్లెంత వంకరో మతిగూడా అంత వంకరే. నీ వన్నది నిజమేరా! ఈయన రాచబావఁడే.

కుబ్జ:—ఆలా గైతే ఏదో అనర్థం దాపరించి నట్టుంది. ఈరాచ బావఁడు చిరకాలం తపస్సులో వున్నప్పటికి మూపుల్లో మాత్రం వాడి తగ్గలేదు. కాబట్టి మనవెఱ్ఱిరాజును మాయచేసి రాజ్యం లఫ్టాయించుకపోదా మని వచ్చినట్టు తోస్తుంది.

వామ:— తప్పు తప్పు ఆలాగనకు. ఈన తపస్సుకు మెచ్చి బ్రహ్మ దేవుఁడు స్వయంగా వచ్చి నీవు క్షత్రియుఁడవు గావు బ్రాహ్మ ణుడ వైనావు అని చెప్పినాఁడు.

కుబ్జ:—నీకు ఒళ్ళులాగా మతిగూడా కుఱచే. లోకం జెప్పే నట్టి మాట లిట్టె నమ్ముతావు. ఎవడి మాటచేత నైనా ప్రతి వాఁడున్ను బ్రాహ్మఁడయ్యే మాట నిజ మైతే నామాటచేత నీవు గూడా బ్రాహ్మడవే అయినావు.

వామ:—ఓరి తెలివిమాలినవాఁడా ! నీవున్ను బ్రహ్మదేవుఁడున్ను సమానమే నట్రా ?

కుబ్జ:—పరిశుద్ధ బ్రాహ్మడే అయినయెడల యీ యసకాఁల్లుతోఁ బని యేమి?

వామ:—దానికి కారణ మున్నది. ఆయన యొద్దనే విలు విద్య నేర్చుకొన్న యిద్దఱు రాకొమాళ్లు గలరు. వారి కీవిల్లు చూపుటకు వచ్చినాఁడు.

కుబ్జ:—అలాగయితే యీయన పరిశుద్ధుఁ డనేనా నీనమ్మకము ?

వామ:—కాకేమి ?

కుబ్జ:—అట్లయిన ఈ యనను నేను వ్యర్థముగా దూషించినందుకు నాకుపాప మబ్బినట్టేనా?

వామ:—పాప మంటే పాపమా! మహాపాపము.

కుబ్జ:—ఓరి వెట్టితొత్తు కొడకా! నీకు ధర్మతత్వమే తెలియదు. బంధువులను వేళాకోళం జేస్తే పాప మొస్తుందటరా.

వామ:—అయితే ఈన నీకు బంధువా? అదేలాగు?

కుబ్జ:—నీకేమీ తెలియదురా! ఈన దగ్గఱ యిద్దఱు కొడుకు ల్లున్నారు. మనదగ్గఱ ఇద్దఱు కూతుళ్లున్నారు. అందుచేత మనకు బంధువులు కాఁగూడదా!

వామ:—(నవ్వి) మన కంత భాగ్య మేలాగు పడుతుంది?

(తెరలో)

మ. చెవి రత్నాంచిత కుండలమ్ములు శిరస్సీమన్ శిఖండంబులున్
హావణిల్లం గనుదామరల్ మఱియు లీలాంచద్గతిం దాటకన్
భువిపై గూల్చిన మేటి రాముఁ డనుజన్ముం గూడి వెన్నాఁడి రా
ఘవదూరుం డిదె సేరవచ్చెఁ జుమి! విశ్వామిత్రుఁ డిచ్చోటికిన్.

వామ:—(హర్షవిస్మయములతో) లోకా లన్నిటినీ గడగడలాడించిన తాటకనే యీకుఱ్ఱడు గొట్టి నప్పుడు ఇఁక నీవిల్లు వంచడ మెంత పని! కాబట్టి రా. ఈసంగతు లన్నీ రాణీగార్లతో చెప్పుకుందాం. (నిష్క్రమింతురు)

(అంతట రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశింతురు.)

విశ్వా:—(వ్రేలితోఁ జూపుచు) రామభద్రా! యిటు జూడుము.

సీ. అంత కంతకు జాతి యపరాబ్ధి దిగఁగూలు
హరిణాంకబింబంబు నపహసింప

భువన ప్రసిద్ధ శ్రోత్రియకదంబము లైన
తొగతంపరల మొదల్ బొగడు వరుస
చక్రవాక కుటుంబ జనపరంపర కెల్ల
నెడఁద నాశ్వాసంబు గడలు కొలుప
హరిదంగనా పయోధరకుంభముల పైని
నవకుంకుమపుఁ బూత నవురు కొలుప

గీ. పంకజములకు మేటి సంపద ఘటింప
మిగిలి తారాగణంబుల ద్రింగి నైవ
దివసలక్ష్మికిఁ బయనంపుఁ దెరువు సూప
వచ్చుచున్నాఁడిదే జగద్బాంధవుండు. 2

రాము:—(చేతులు మోడ్చి)

ఉ. క్షాళిత సర్వలోకచయ సంగత నిష్ఠుర పాపపుంజ జం
బాలికి, నైజచారుకర మండలలాలిత సర్వపంక జా
తాళికి, చక్రవాక విరహాతిశయార్తి నివర్తనక్రియా
కేళికి భక్తిఁ గేలుఁగవ గీలుతు నిష్ప్రద తెంచు హేళికిన్. 3

విశ్వా:—(తనలో) నా గోని తెచ్చు సీరామభద్రుని జనకుఁ డచిర
కాలముననే కన్యాదానవిధిచే గౌరవించుట గలుగునా ?

లక్ష్మ:—ఆర్యా ! యిటు దిలకింపుము.

చ. వననిధినుండి భానుఁ డను భవ్యజగత్త్రయరత్న మొంపు సే
కొని తెలవాఱుజా మనెడు కోమటి మిన్నను సంతనుంపఁ దో
ర్తన నిడె కొమ్ము మూల్య మని తమ్మి కొలం కను బేరగాఁడు ల
క్ష్మిని దెరవాపి చూపె వికసిల్లిన తమ్ములపేరి చేతులన్. 4

విశ్వా:—(తనలో హర్షముతో) జౌరా ! వత్సయగు లక్ష్మణుఁడే
ప్రత్యుత్తర మిచ్చినాఁడు. బాలవాక్యములు దేవతాధిష్ఠితములుగదా!

రాము:—(మునిని జూచి) మునీంద్రా! యీరాజధాని బహునరకరితురంగతరంగితం బయ్యుఁ దపోవనంబు వోలె ప్రశాంతమును బావనమునై చూపట్టుచున్నదే!

విశ్వా:—ఇందు విచిత్ర మేమున్నది? యాజ్ఞవల్క్య శిష్యుఁ డగు జనకరాజు గదా యిందు వసించువాఁడు!

రాము:—యోగీశ్వరుం డని కొనియాడఁబడు యాజ్ఞవల్క్యుఁడా యీయనగురువు?

విశ్వా:—వత్సా! అవు నాతఁడే.

గీ. భానుపాదోపజీవన ప్రాప్తిచేత
దుస్తరంపుఁ దమోవార్ధి నిస్తరించి
యఖిలయోగీంద్రుఁ డనెడువిఖ్యాతి కతఁడు
సద్మముగ నయ్యె లక్ష్మికిఁ బద్మమట్లు. 5

ఇఁక రమ్ము రాజభవనము సేరఁబోవుదము. (పరిక్రమింతురు)

(తెరలో)

చ. చిలుకుఁడు గుంకుమాంబువులఁ, జెచ్చెరఁ దావికిఁ జిక్కితుమ్మెదల్
వలగొను మేలిపువ్వుతతులన్ వెదజల్లుఁడు, ముత్తియంపుమూ
లలఁ బొలుపారుచప్పరముల న్నిలకొల్పుఁడు, రాజవీథులం
గల నిఖిలాంగణస్థలుల నాగరకామినులార! యిత్తఱిన్. 6

విశ్వా:—వత్సా! మన రాకకు మిగుల నానందపరవశుఁడై నిక్కముగ శతానందుఁడు పలుకువాక్య మిది. (చూచి) ఔరా!

యేమి యీతని సంబరము! నగర మంతయు నిదివఱకే యలంకరింపఁ బడియున్నను మఱల నందులకే హెచ్చరిక సేయుచున్నాఁడు.

(ప్రవేశము శతానందుఁడు.)

శతా:—భగవానుఁడా ! నమస్కారము.

విశ్వా:—సౌమ్యుఁడా ! ఆయుష్మంతుఁడవు. గమ్ము.

శతా:—భగవానుఁడా ! తమరాకకై జనకరాజు వేఁచియున్నాఁడు

విశ్వా:—(చూచి) ఇదిగో జనకుఁడు.

ఆ. ఆలు నేడు నెనిమి దంగంబులను గూడి
త్రయియు రాజ్యరమయు బ్రహ్మకళయు
వలచి యెవని యందు వసియించు సతతమ్ము
నట్టి జనకుఁ డితఁ డనుపముండు. 7

(జనకుఁడు ప్రవేశించును.)

జన:—(అంజలివట్టి)

గీ. తపము పేరింటి చిచ్చునఁ దనువు నుంచి
కనక శకలమ్మునుం బోలె కాఁచి కాఁచి
యధికవర్ణంబు గాంచిన యనఘుఁ డితఁడు
కుశిక సూనుండు తాపస కుంజరుండు. 8

(సమీపించి) భగవానుఁడా! యిదియే ప్రణామము. సమీహిత సంపల్లతారామభూమను.

విశ్వా:—భూతలబిడౌజా రాజర్షిధ్వజా సీరధ్వజా! నీమనోరథము లీడేరుఁ గాక.

(అందఱును యథోచితముగాఁ గూర్చుందురు)

జనక:—భగవానుఁడా! నన్నిపుడు బిడౌజునితోఁ బోల్చుట కేవలము తక్కువ సేయుటయే.

విశ్వా:—అ దెట్లు ?

జన:—ఇప్పు డాతనికి మించిన పదవి గుం దున్నాఁడను గాన, ఎట్లన.

గీ. తావకీనపదాబ్జ వందనము కలిమి
నాకుఁ గలిగిన యీమహాస దగరిమ
కలుగ నేరదు నిక్కమ్ము గాధితనయ!
నందనోద్యాన హరిచందనమువ నెపుడు. 9

విశ్వా:—ఆహా! యేమి నీ ప్రేమాతిశయము! సహజానందసుఖాంబు
రాశి నోలలాడువాఁడవయ్యు నిపుడు మానసమాగమమ్మునఁ
గలిగిన యీసుఖబిందువు నింత గొప్పగాఁ దలఁచుచున్నావు.

జన:—మహాత్మా! రాజ్యతృష్ణ యను రాహువు పట్టువిడువక
యుండ మాబోటివారి మనశ్చంద్రమండలములనుండి సహజా
నందచంద్రిక వెలువడు ననుట యెక్కడి మాట?

విశ్వా:— జనకరాజేంద్రా! అట్లు గాదు సుమా!

సీ. కుటిలకోదండపు గుణకిణమ్ముల పరం
పరలచే మెఱయు నెవ్వరికరంబు
పావనంబై యొప్పు ప్రణవారవంబుచేఁ
గ్రాలు నెవ్వరి కంఠగహ్వరంబు
దరిలేని పార్థివోద్దామ సంపత్తిచే
భాసిల్లు నెవరి సింహాసనంబు
సంయమీంద్రులు మెచ్చు శమసమున్నతిచేత
పావణిల్లు నెవరి పద్మాసనంబు

గీ. శౌర్యమయతేజ మఖిలభూచక్రమునను
జిన్మయజ్యోతి తేజంబు చేతమునను
బ్రత్యహమ్మును వెలుఁగు నెవ్వారి కట్టి
పార్థివేంద్రులు నిమికులేశ్వరులు మీరు. 10

శతా:—మహాత్మా! మీ రన్నమాట యథార్థము. ఎట్లన.

ఉ. వారవధూకరమ్ములను వర్తిలు చామరముల్ తరంగముల్
చారుసితాతపత్రములు సారసముల్ గను బొల్చు రాజ్యకా
సారము నందు వీర లనిశమ్మును గ్రీడిలు రాజహంసముల్
ధీరమునీంద్రగమ్యు మగు తెన్నునఁ గ్రుమ్మరు ధన్యులుం జుమీ!

లక్ష్మ:—(అపవారించి) ఆర్యా! ఈరాజులు బ్రహ్మవిద్యయందుఁ గూడఁ జతురు లని వినుట నా కెంతయుఁ జిత్రముగ నున్నది.

రామ:—వత్సా! యిందుఁ జిత్ర మే మున్నది?

శా. ఛత్రచ్ఛాయకుఁ గాని చామరసటాసంపత్తికిం గాని ప్ర
స్ఫీతం బైన గజేంద్రవైభవసమావిఖ్యాతికిం గాని వి
ఖ్యాతశ్రీలకుఁ గాని తాము మన సొగ్గం బోక భక్తిం బరం
జ్యోతిం గొల్తురు సుమ్ము బోధనిధు లీక్షోణీశచూడామణుల్.

విశ్వా:—అంగిరసా శతానందా! నీ వన్నది తగి యున్నది. నిక్కముగ వీరు సకల కువలయోత్తంసు లగు రాజహంసలే.

జన—మహాత్మా! మీ రన్నచొప్పువారు మా పూర్వులు గాని కతిపయగ్రామంబుల కొడయండ నగు నేను మాత్రము గాను.

విశ్వా:—జనక భూమీధవా! నీచొప్పు నీవె యుంగకున్నావు గదా!

చ జనపతు లెందఱే భువిని సాఁకుట గల్గును గాక నందు నొ
క్కనికిని భూధవుం డనెడు ఖ్యాతి ఘటిల్లదు నీకుఁ దక్క నె
ట్లనఁ గనకోపమానలలితాంగికి భూసతి గన్న పట్టికిన్
జనకుఁడ వైతి వీవు భువనమ్ముల నెల్లఁ బ్రసిద్ధి మ్రోయఁగన్. 13.

జన:—మహాత్మా! నూర్లకొలఁది నూతన జగమ్ములు నిర్మింపఁ గల మీకు నీపాటి వాక్చాతుర్య ముండుట యేమి వింత?

చ. అలుకను నెఱ్ఱనై యొసఁగు నక్షిశలాకను నభ్రవీథి వే
ల్పుల ప్రతిమల్ లిఖించుమతి మున్నుగ నయ్యెనచంద్రమండ ల
మ్ముల ఘటియించి వాని నటుముంగలి వ్రాతకు నెఱ్ఱ తెల్ల రం
గుల ద్రవమున్న గిన్నెలుగఁ గూర్చిన మిమ్ము నుతింప శక్యమే? 14

శతా.:—రాజర్షీ ! నిజము పలికితివి. ఈ మహాత్ముని ప్రభావ మెం
తని వర్ణింపఁ గలము ?

* మ. ఘనకోపమ్మున నాఁ త్రిశంకు ధరణీకాంతున్ సురేశుండు మే
దినికిం ద్రోయఁ బదంబు నెత్తఁగనె యాధీరాత్ముఁ డల్కన్ వినూ
తననాకంబు సృజింపఁ బూన సురసంతానంబు భక్తిం దనుం
గొనియాడన్ విరమించి యెంతయుఁ బ్రసన్నుం డయ్యె భూమీశ్వరా.

లక్ష్మ:—(అపవారించి) ఆర్యా ! త్రిభువనమ్ముల నీరీతిఁ దపింపఁ
జేసినట్టిదియా యీమహాత్ముని తపస్తేజము!

రాము:—మ తేమనుకొంటివి? ఈరాజర్షి లీల లెఱుంగవు గాబోలు.

చ. కనలిన వజ్రితాపులకుఁ గాక త్రిశంకువు భూమిఁ ద్రెళ్ళ వే
శను రుష పేర్మి నిప్పు లురలం బొలుపారెడు నిమ్మహాత్ము దృ
ష్టిని నవసంధ్యనుం బలె భజించిరి బిట్టును దత్తరంపుఁ బెం
పునఁ గరపంకజాతములు మోడ్పు వహింపఁగ వేల్పు లెల్లయున్.

విశ్వా:—సీరధ్వజా! భూసతీ గర్భసంభవం బైన కన్యారత్న మొకర్తు
మీయింట నున్నది గదా !

---

* చ. బలరిపుఁ డా త్రిశంకునరపాలునిఁ గ్రిందికి నెట్టనెంచి పే
రలుకఁ బదంబు నెత్త నవనాకపురారచణాభివేగ మి
మ్ములఁ దల యెత్తి, తోన సురపుంజము భక్తిని హస్తపద్మముల్
ముడువఁగఁ దానుగూడ ముడుపుం గనె నిమ్మునినాథు నెమ్మదిన్.

జన:—అవును, ఇప్పుడు విశేషించి మీ యనుగ్రహమున నీక గుణనిధి యైన యల్లుడు సైతము లభింపఁ గలఁడు. (రామునిం జూచి కౌతుకముతో) మహాత్మా!

గీ. ఆకుఁబచ్చని ఛావన్ని యల రహించు
నమర భూజంపు టంకురం బనఁ దనర్చి
యఖిల జనముల కనులు ధన్యములు గాఁగ
నెదుటఁ గనుపట్టు నీబాలుఁ డెవ్వఁ డయ్యా? 17

శతా:—మహాత్మా!

చ. కలువలకాంతిఁ నేలు సతికంటె కురంగటి కర్ణవీధికం
గలిత సువర్ణకాంతులను గ్రాలెడు చంపకగుచ్ఛ మట్టు లీ
విలసితగాత్రు చెంగటను వెల్గు కుమారకుఁ డితఁ డెవ్వరో
తెలుప గదయ్య నా కిపుడు ధీరగుణోత్తర తాపసేశ్వరా!

విశ్వా:—వీరు రామలక్ష్మణు లను పేరివారు.

జన:—ఆహా! కర్ణముల యందు సుధ జిల్కరించి నట్లున్నది!

శతా:—(చక్కఁగాఁ జూచి) మహాత్మా!

గీ. సహజ సౌజన్య సౌందర్య సహితు లైన
వీర లిద్దఱు నొక యింటి బిడ్డ లట్లు
తోఁచు చున్నారు చంద్రకౌస్తుభము లట్లు
కుశికకులచంద్ర! తాపసకుల గజేంద్ర! 10

జన:—గీ. సహజ సౌజన్య సౌందర్య సహితు లైన
వీరి కిద్దఱ కేదొ భావింప రాని
యాంతరంగిక సంబంధ మమరి యుండు
జీవునకు బ్రహ్మకును బోలె సిద్ధచరిత! 20

విశ్వా:—రాజర్షీ! యోగీంద్రశిష్యా! లోఁ దెలియఁగరాని యుట్టి నవీన రహస్యకథాసుధానశేస్సుల యుంతేఁ దెలిసికొనుటకు నీమనస్సే చాలును. అయినను నేను గూడ వీరి బాంధవ్యము నకు సాక్షి నయ్యెదను.

జన:—అట్లయిన వీరిద్దఱన్నదమ్ములా?

విశ్వా:—అవును.

జన:—(హర్షముతోఁ జక్కఁగాఁ జూచి.)

వంశస్థవృత్తము.

శరీరశోభాజిత చంపకోత్పలుల్
హిరణ్య నీలోత్పల హృత్స్ఫుట ద్యుతుల్
ధరా విలోకోత్సవ దాన దక్షిణుల్
వరాంకితుల్ లక్ష్మణ లక్ష్మణాగ్రజుల్.

(మఱల రామునిఁజూచి కౌతుకముతో) మహాత్మా! యిదేమి చిత్రము.

శా. స్ఫారానంద గృహంబు దూరగత సంసారంబు చేతస్సుఖా
ధారం బౌ పరమాత్మ యందుఁ బలె డెందం బెంతయుం జొక్కె నీ
శ్రీరాము న్నవనీలపంకజదళ శ్రీభాసురుం బాలుఁ గ
న్నారం జూచిన దాది మానికులనాథా! యేమి చోద్యంబొకో!

విశ్వా:—(తనలో) ఇది యుచితమే. సకల జననేత్రంబుల నలరించు చంద్రుఁడొక్కఁడును శంకర శిరంబునం బొలుచు చంద్రుండు మఱొక్కఁడును గాడు గదా! (ప్రకాశముగా) రాజర్షీ! యిది సౌందర్యాతిశయంపు మహిమ సుమా!

జన:—మహాత్మా! ఇట్టి పుత్రులం బడసి పుత్రవంతులలో నెల్ల శిరోమాణిక్యపదవి నందిన ధన్యుఁ డెవరు?

విశ్వా:—

సీ. వైకుంఠధామంబు వదలి భూమికి డిగ్గు
గంగా తరంగ సంఘంబు లొక్కొ.
పూర్ణిమానిశలందుఁ బొలుచు శీతమయూఖు
బలితంపుఁ గరకదంబమ్ము లొక్కొ
నిగనిగల్ గులుకు క్రొమ్మొగలిపూవుల నొప్పు
దట్టంపు రేకు మొత్తమ్ము లొక్కొ
నిగ్గుదేఱిన కాంతినికరమ్ములను జిమ్ము
చంద్రకాంతముల సంచయము లొక్కొ

గీ. అనుచుఁ గౌతుకితాత్ములై యమరసతులు
కనులు విరియించి ముద మొప్పఁ గాంచు చుండ
నెవని కీర్తి సమూహమ్ము సెసక మొసఁగ
దిక్కు దిక్కున జృంభించి పిక్కటిలునొ. 23

లక్ష్మ:—ఆర్యా! నాయనగారిని గాఁబోలు ప్రశంసించు చున్నారు.

రాము:—అవును. ఇంకను బ్రశంసింతురు గాక.

విశ్వా:—మఱియు నో రాజేంద్రా!

చ. బలితపుఁ జేతి కార్ముకపుఁ బొండితి నెవ్వఁడు సోఁకుతేండ్ల కాం
తల కనుబొమ్మలం బరగు నవ్యవిలాసములం దొలంపఁ గే
వలము శచీవధూటి నఖపాళుల నొక్కినవేళఁ దక్క న
బ్బలరిపు మేనిఁ గెన్నఁడు లవం బయినం గనుగంద దయ్యెనో. 24

గీ. అట్టి యాదిత్యకుల కిరీటాయమాన
కోసలోర్వీతలాధీశు కూర్మిసుతులు
లలితసౌందర్యరేఖా కళావిలాస
శక్తినిర్జిత రతిసతీశ్వరులు వీరు. 25

జన:—(హర్షముతో)

చ. ఎవఁడు సురారివీరవిజయేందిరతో వెస పూర్వ లాఁగి భూ
భువనము నల్ల చాపముచు మూఁపునఁ దాల్ప శచీకుచస్థలీ
నవనఖరాంకరేఖ శయనస్థలిఁ గన్గొని వింటి నల్ల నా
కవిభుఁడు సంస్మరించెడునె కాని కరంబున ముట్టఁ డయ్యెనో. 26

మఱియు,

* గీ. తనదు శౌర్యంబు గోరిలిన ఘనవిరోధి
నికరములబోంట్ల కంటి కాటుకల నలుపు
పాక్కెనో నాఁగ నెవ్వాని మూఁపు లందు
నారి కాయల నల్పు బొల్పారు చుండు. 27

గీ. అట్టి దశరథభూమీశ లాధిపునకు
ప్రథితరవివంశకోటీర రత్నమునకు
అఖిల రిపువీర విజయకాలాంతకునకు
తనయులా వీరు సత్కళోదారతనులు. 28

విశ్వా:—అవును.

జన:—ఔరా! దశరథుఁ డెంతధన్యుఁడు. ఇట్టి తనయుల ముఖావ
లోకనమున నతని యిరుగన్నులును జల్లవడియెఁ గదా!

శతా:—ఇరుగన్నులే కాదు. ఇరుగడలును

విశ్వా:—నలుగడలు నని చెప్పుము.

శతా:—ఓహో! దశరథుని తోడ నెక్కు కుమారులు మఱియు
నిద్దఱు గలరా?

---

* చ. పటుతర శౌర్యపీత పరిపంథిసతీ నయనాంజనప్రభం
జటుల గుణప్రణాంక పరిషన్మిష యద్భుజముల్ వహించునో
నట దరికామినీక రశనాఝరీ ఝంఝరీ లెల్ల యద్వితం
కట ధనురంచ దుగ్రగుణగర్జల డించె నవంగ ప్రుంచెనో.

విశ్వా:—అవును. కలరు భరత శత్రుఘ్నులు. రామ లక్ష్మణుల ప్రతిబింబము లనఁ దగిన వారు.

శతా:—నిక్కముగ ఋశ్యశృంగుని పాయసాన్నవిభాగంబుల విలాస మిది.

జన:—దశరథుని భాగధేయంబులయు,

విశ్వా:—అగుఁ గాక. పుణ్యవంతులలో నెల్ల దశరథుఁడు శిరో మాణిక్యము గదా !

జన:—మాహాత్మ్యవంతులలోఁ గూడను

విశ్వా:—ఆ విషయమున మే మేమి చెప్పఁ గలము? మీమీ మహి మలకు మీరే సాక్షులు.

జన:—మహిమ యం దాతనితోడి సామ్యమునకు నే నెంత వాఁడను! సాగర మెక్కడ కాసార మెక్కఁడ ?

విశ్వా:—ఆహా ! వినయవంతులు తమ్ముఁ దక్కువ చేసికొని పలుకు సూక్తులు సత్యమునకు దూర మయ్యును మిక్కిలియు శోభిల్లుచునే యుండును. అదియునుం గాక యిట్టి చొప్పు నీ కిప్పుడు తగియే యున్నది. ఏల యందువా ?

గీ. పడసె దశరథమేదినీ పాలకుండు
సోమునిం బోలు సౌందర్యధాము రాము;
పడసితివి నీవు కలువతీవయును బోలె
కనుల పండువు సేయు సీతను నరేంద్ర! 29

లక్ష్మ:—(అపవారించి) ఆర్యా ! సోముని, కలువతీవను దృష్టాంత ముగాఁ గొని తెచ్చి భగవానుఁ డెద్దియో సంవిధానమును సూచించు చున్నాఁడు.

రామ:—(కసరి) చాలు నూరకుండుము.

జన:—(తనలో) ఈ ఋషీంద్రుని వాగ్వైఖరిం జూడ నెద్దియో సూచించి నట్లు దోఁచెడిని. రభసోద్రేకమ్మున నీ తఁడు ధనువు మాటయే మఱచి నట్లున్నది. (ప్రకాశముగా) మహాత్మా ! రెండవ హరకార్ముకంబో యన వక్రమయ్యును మనోజ్ఞమై నూపట్టు మీ వాగ్విలాసము చేత నా కెద్దియో నమ్మకము గలిగించితిరి.

విశ్వా:—(తనలో) ఇతఁడతినిపుణముగా హరచాపారోపణమును గూర్చి హెచ్చరించుచున్నాఁడు. కానిమ్ము. (ప్రకాశముగా) సీరధ్వజా ! మేలు చక్కఁగా గురుతునకుఁ దెచ్చితివి. వృషభ ధ్వజుని కార్ముకమును జూడవలయు నని నాకు కౌతుకము మెండుగా నున్నది. కాన దాని నిటకు గొని తెచ్చుటకు భటుల నియోగింపుము. పోనిమ్ము భటు లేటికి ? మా రామ భద్రునే నియోగింపుము.

జన:—(విస్మయముతో) మహాత్మా ! యిది యేమి వింత ! చెక్కుల బాలు గారుచున్న యీ రాముని చంద్రశేఖర కార్ముకముఁ దెచ్చుటకు నియోగించెద రేల ? ఎఱుఁగరో !

సీ. తుహినప్రవాహముల్ తునిసి వాటుఁగ నొప్పు
ధరణీధరం బెందు దండ మయ్యెఁ
గడలిఁ జిల్కెడు వేళఁ గవ్వంపుఁద్రాడైన
దర్వీకరుం డెందు మౌర్వి యయ్యెఁ
గలశపాథోరాశి గన్నకన్నెకుఁ గూర్చు
ప్రాణనాథుం డెందు బాణ మయ్యెఁ
దరుణేందుధర భుజాదండంబులం దెద్ది
నత మయ్యు విండ్ల సన్నుతమ యయ్యె

గీ. త్రిపురమృగలోచనల బాష్పవృష్టి పొంది
నైశ మయ్యును నెయ్యది యైంద్ర మయ్యె
నట్టి యీవిల్లు గ్రహియింప నలవి యగునె?
గాధివంశపయోధి రాకామృగాంక! 30

విశ్వా:—సీరధ్వజా! యెఱుఁగుదును.

చ. కొలువున కేఁగుదెంచు సురకోటుల కేలఁ జలించు చామర
మ్ములపవనమ్ము గ్రోలి కడుఁ బొంగిన జ్యాభుజగమ్ము లాఁగుచో
గలిగిన గాసి శూలి విడఁగాంచెను దేని ప్రగాఢకుంచనా
గళిత హిమమ్ముచేత నల గ్రావమయం బిది భూతలేశ్వరా! 31

జన:—అట్లయిన దానిఁ గొనితేర రాము నేల నియోగించెదరు?

విశ్వా:—కేవలముఁ గొని తెచ్చుటకే కాదు. వంచుటకుఁ గూడ నియోగించెదను. (రామునిఁ జూచి) వత్సా! నడుము గట్టి నిలువుము. మఱియు నొకమాట.

గీ. నీచు మారీచు నెచటనో వీచి వైచి
యల సుబాహుని ప్రాణమ్ము లపహరించి
తాటకను గూల్చినట్టి నీధనువు నిప్పు
డొక్క త్రుటి లక్ష్మణునిచేత నుంచు మోయి! 32

రాము:—(ధను విచ్చును)

జన:—ఈ మాటలయందు నాకు నమ్మకము సాల కున్నది.

విశ్వా:—అట్లయిన నీ విది వినలేదు గాఁబోలు. చెప్పెదను వినుము.

చ. కఱచి యితండు నాకడనె కార్ముకవేదము సక్రమంబుగా
దొరకొని పిమ్మట న్విపులదోర్బలదుర్జయు లైన దానవో

త్కరముల నెల్ల వీరరణధారుణికిం బలివెట్టి మత్కృతా
ధ్వర పరిరక్షణమ్మొ గురుదక్షిణఁ జేసె విదేహనాయకా! 33

జన:—(విమర్శించి నిట్టూర్పు విడిచి) మహాత్మా! ఇది దంతయు సత్యమే యగుఁ గాక.

శా. మారీచాది నిశాచరోత్కర శిఖా మందప్రభామాలికా
రారాజ న్నిజ పాదపీఠుఁడు జగత్ప్రఖ్యాత శౌర్యోదయ
స్ఫారుం డారజతాద్రి నెత్తిన మహాభాహుండునున్ దీనినిం
గోరం జైనఁ గదల్ప లేక చనియెన్ క్షోణీశ్వరుల్ నవ్వఁగన్. 34

విశ్వా:—అయిన నేమి? అందుచేతనే గదా రాముని నియోగించుచున్నాను. (రామునిం జూచి) వత్సా! లెమ్ము. చంద్రశేఖర కార్ముకమును వంచి మ మ్మెల్లఱను సంప్రీణితులఁ గావింపుము.

జన:— (తనలో)

శా. విశ్వోర్వీతల పూర్ణనిర్మల తపోవిఖ్యాతచారిత్రుఁ డీ
విశ్వామిత్రుఁడు తత్తరిల్లునె వృథా విభ్రాంతి, దుస్సాధ మీ
విశ్వాధీశ్వరు విల్లు, రాముఁ డనఁ నో వేయేల బాలుం డహా!
యాశ్వాసింపఁగ రాకయున్నది మనం బాందోళనం జెందుచున్.

(పృథివిం జూచి) వసుంధరా సతీ!

గీ. రతివిధమ్మున నీపుత్రి రాజితాంగి
సుమశరుని యట్టు లీకుఱ్ఱ సుందరుండు
కాన నన వోలె విలు వీని కరము నందు
నలరు నేనియు సంప్రదాయంబు నలరు. 36

శతా:—జనకరాజేంద్రా! యిది యేమి? జడుని యట్లు మాట

మాటకు సంశయించెదవు! ఇఁక మాఱు పలుకక ఋషీంద్రుని మాట చొప్పున నడువుము.

జన:—సంశయము లేదు. నడిచితి ననుకొమ్ము. (రామునిం జూచి) వత్సా! గురువునాజ్ఞ నెఱవేర్పుము.

(రాముడు లేచి నడుముగట్టి నిలుచును.)

[అంత ప్రతీహారి ప్రవేశించును.]

ప్రతీ:—దేవరా! జయము జయము. ఎవరో యొకపాఱుఁడు ఏలిన వారిని సందర్శింపఁ గోరి ద్వారము కడ వేఁచి యున్నాఁడు. తోడితెచ్చుటకు సెలవా?

జన:—దీనికిని జనకు నడుగ వలయునా?

ప్రతీ:—చిత్తము దేవరా!

[పోయి బ్రాహ్మణుని తోడితెచ్చును.]

జన:—బ్రాహ్మణప్రవరా! నమస్కారము.

బ్రాహ్మ:—రాజేంద్రా! సుమతి వగుదువు గాక.

జన:—(తనలో) ఈ యాశీర్వచన విధాన మేదో వైఖరి నున్నదే! అగుఁ గాక. (ప్రకాశముగా) విప్రపుంగవా! యీసు కూర్చుండుము.

బ్రాహ్మ:—నేను సందేశమును దెచ్చినవాఁడను గావున కూర్చుండ రాదు.

జన:—ఎవరి సందేశమును? ఆసందేశ విధాన మెట్టిది?

బ్రాహ్మ:—

శా. భూపాబ్జాతముల కంటికాటుక మిషం బొల్పొ విషం బాని బి
ట్టే పై నట్టి యశోట్టహాసరుచు లెంతే దిక్కుల న్నిల్పి తా

న్నేప్రొద్దుం జరిగితైక దేశ విధిచే నీశానునిం గొల్చు నా
భూపాలారి కుఠార మోయిజనకా! బోధించు నీ క్రియన్. 37

జన:—(తనలో) ఔరా! యేమి యీ కావరంపు టవక తవక!
కానిమ్ము. (ప్రకాశముగా) ఏ మని బోధింపు?

బ్రాహ్మ:—

ఉ. ఏ యవనీశపుత్రకున కేని భవత్సుత నిచ్చి పొందు దీ
ర్ఘాయువు, శంభువింటఁ జరలాటము లాడక మత్కృపాగ్నికిం
బాయుము; కాకయున్నను భవద్భవపంక నివృత్తి కై మదీ
యాయతధారనుండి పడు నంబుల ద్రుంగక తప్ప దెట్టులున్. 38

అని బోధించుచున్నది.

జన:—అట్లయిన నాప్రతిసందేశమును గూడ నటఁ జేర్పుము.

బ్రాహ్మ:—వాక్రువ్వుము.

జన:—

ఉ. ఓ జమదగ్నిపుత్ర పరశూ! విను మే నని నట్ల పెండ్లి నేఁ
డే జరిగింతుఁ దప్ప దది; యిచ్చటి యీశ్వరువిల్లు వంచి బా
హాజయలక్ష్మి నొప్పెసఁగునల్లుని ప్రేమాల యభీష్ట మీవు ధా
రాజలముం దొఱంగ నగు రమ్మి స్వయ మ్మిట కీవు నెచ్చెలీ! 39

బ్రాహ్మ:—అట్లే యగుఁ గాక. (నిష్క్రమించును.)

జన:—శతానందా! జామదగ్న్యుఁడు మనపైనిఁ గోపాగ్నికణంబును
విసరినాఁడు గదా!

శతా:—అయిన నేమి! కలఁడు గదా చెంతనే యతిగంభీరభుజసార
కాసారకైరవారాముఁడు రాముఁడు.

విశ్వా:—జనకావనీంద్రా! చుట్టును వేలకొలంది గన్పట్టు చున్న యీ కిరీటధార్లు లెవ్వరు?

జన:—ఆ. ఏను వేఁడ నిటకు నేతెంచి హరచాప
మందు దోర్బలంబు డిందు పఱచి
కొనుచు నున్నవారు కొన్నాళ్లు నృపపూజ
వివిధ భూమిభాగ విభులు వీరు. 40

విశ్వా:—వత్సా, రామభద్రా! వీ రందఱు జూచు చుండగనే మాయభీష్టమును నెఱవేర్పుము.

రాము:—మహా ప్రసాదము. (గురునకు నమస్కరించి నిష్క్రమించును.)

జన:—ఆంగిరసా! వత్స యగు రామభద్రుఁ డిచ్చటి సన్నివేశము నెఱుంగఁడు. కావున నీవు చెంత నుంచుకొని నడిపింపుము. మఱియు జానకి కమలమాలం గైకొని స్వయంవరాంగణంబునకు వచ్చునట్టు లేర్పాటు గావింపు మని కంచుకికిఁ జెప్పి పుచ్చుము.

శతా:—అట్లే చేసెదను. (నిష్క్రమించును)

(కంచుకి ప్రవేశించును.)

కంచు:—దేవా! జయము జయము. దేవర యానతి చొప్పున నంతయు నేర్పాటు గావించితిని.

విశ్వా:—(చూచి హర్షముతో) ఔరా! రామభద్రుని యశఃపతాకాకేతుదండ మైన యీహర కోదండము పైకి లేవనే లేచినది. గదా! (మరల విస్మయముతో) ఔరా! మేలు మేలు.

శా. మార్వీజాత మహోగ్రఘోషణము శుంభద్భంగి నుప్పొంగి బల్
దూర్వారంబయి నింగి నంటుచు దిశాస్తోమంబునం దెల్లెడం
బర్వన్ వంచెను గుట్టడయ్యె భుజసత్వం బేర్పడన్ రాముఁడీ
శర్వాణీతరుణీ మనోహరుని చంచచ్చాపముం బాపురే! 41

లక్ష్మ:—మహాత్మా! నిజము.

మ. హరబాణాసన మందు దండ మగు శైలాధీశు గంభీరగ
హ్వరముల్ మార్మ్రలయంగ నల్లెయగు సర్వాధీశుఁ డార్యం బోరిం
బోరి గొండాడు రవంపుఁ బేర్మి దళమై బొల్పారు మౌర్వీమహా
త్తరఘోషమ్ముల చేత నిండెను దిగంతంబుల్ మునీంద్రోత్తమా!

జన:—ఆఁ? యేమంటివి? దిగంతములు నిండె ననియా?

గీ. మహిత చండీశ కోదండ మౌర్వినుండి
బయలు వెడలిన నిర్ఘోష భరము చేత
నిండెఁ జిరకాలమునకుఁ బున్నెంబు వండి
ప్రతినతోఁ గూడ మన్మనోరథము నేఁడు. 43

ప్రతీ:—(కంచుకితో) ఈ వేడుకం జూచితిరా! సీతారాములిరువురుం
గూడి హరచాపారోపణమును బరిపూర్తి గావించుచున్నారు.

కంచు:—(కౌతుకముతో) అటెట్లు? (విమర్శించి నవ్వి) ఓహో!
తెలిసినది.

గీ. హరధనుస్సును రఘురాముఁ డడ్డులేక
పేలఁ గరపల్లవమున నాకృష్టి సలుప
కుతుకమున నందు సీత పుంఖిత మొనర్చెఁ
గలువ మాలను బోలు కేగ్రంటి చూపు. 44

లక్ష్మ:—మహాత్మా! యిదేమి మహాద్భుతము.

సీ. అమృతాబ్ధి వీచిడోలాభిసుప్తుం డైన
మురమర్దనుని నిద్ర ముద్ర వీడ
బహుళ బాహాబల ప్రౌఢి ప్రకర్షల
శౌర్యసారం బెల్లఁ జల్ల వడఁగ
చండదిగ్వాటికా శుండాల మండలీ
శ్రవణాంచలముల చాంచల్య మెడల
సర్వోర్వరాభారధూర్వహుం డగు పూర్వ
కమఠవంశవిభుండు కంపిలంగ

గీ. ప్రళయకాల పయోదగర్జానికార
ధీర మార్యాభివినుతి గంభీర మగుచుఁ
గిక్కిరియుచున్న దల్లెడఁ గృష్యమాణ
రుద్రకార్ముకభంగ నిర్ఘోషణంబు. 45

ప్రతీ:—

ఉ. కొండల లోయలందుఁ గనుగూరికి లేచిన గండుసింగపుం
బిండులు మాఱు బొబ్బలిడ బెట్టిదమై సెలరేఁగి రుద్రకో
దండవిభంగజాత నినదమ్ము జగమ్ముల నెల్ల దాటి బ్ర
హ్మాండము వ్రస్సిపోవ నెసలారుచు నున్నది యెల్లతావులన్. 4;

కంచు:—చూడు మీ వినోదము.

సీ. తరుణేందుధరుని కోదండమ్ము పవలీలఁ
బాలి యొనర్చిన మహా భుజమువాని
సీత వైచిన పయోజాతమాలికతోడ
సిరుల నీను వెడంద యురమువాని
శృంగార వీరలక్ష్మీ కేళిసౌధ మై
దీపించు మేటి మైతీరువాని
స్తుతిశతమ్ముల పేర్మి దొరకొన్న లజ్జమై
నమితమై యున్న యాననమువాని

గీ. రామునిం జూచు చున్నట్టి భూమిపతుల
స్వాంత మద్భుత రోష విషాద మోద
రసమహో త్తుంగరంగ త్త రంగసంఘ
సంగతాలింగనక్రియా రంగ మయ్యె. 47

(శతానందుఁడు ప్రవేశించును.

శతా:—జనక రాజేంద్రా ! విష్ణుడ వయ్యెదవో ప్రసన్నుఁడ
వయ్యెదవో కాని చూచినది చూచి నట్లు వర్ణించెదను.

ఉ. ఆరఘుబాలుఁ డల్లెఁ జెవియుండకు లాగుఁడు భంగ మింతయుం
గూరదు వానిబొమ్మ మఱి నుగ్గయి పోయెఁ బురారివిల్లు, హుం
కారము తద్గళమ్మునను గల్గ దొకింత ధనుర్విభంగటం
కారము మాత్ర మెల్లెడలఁ గ్రమ్మెచు నిండె నజాండపేటికన్. 48

జన:—ఇంత యుద్వేలముగ విజృంభించి నపుడు రామభద్రు నేల
నివారింప నైతివి :

శతా:—ఎట్లని వారింతుము ?

ఉ. క్రందుగ రక్ష కై జనని గట్టిన తోరము సోరుఁ బెంపఁగాఁ
గందుక లాంఛనాఢ్య కరకంజపుఁబొత్తున నెత్తదమ్మి కా
డం దులకించు బాలు ప్రకటంపు భుజమ్ము చలించి నంతనే
దందడి ప్రీలు వింటినినదమ్ము జగమ్ముల గ్రమ్మె నొక్కటన్. 49

జన:—పోని మ్మిఁక నీవృథా కాలక్షేప మేల ? జానకీ రామభద్రుల
పాణిసంఘట్టనమున కై మహాత్ముని యనుమతి వడయుదము.

శతా: —గీ. సంధి బంధంబు లెల్లను సడలి పోవ
విఘటితం బగు నయ్యుమా విభుని ధనువె
సంఘటించెను బాణిసంస్పర్శనంబు
జానకీకాంతకును రామచంద్రునకును. 50

కావున నూర్మిళా లక్ష్మణుల పాణిసంఘట్టనమునకే మహా
త్ముని యాజ్ఞ గావలయు.

విశ్వా:—(నవ్వి) అగుఁ గాక, మఱియు నొక మాట.

గీ. జనకకన్యల పాణులం గొనెడు తనదు
తమ్ము లందఱితోఁ గూడి యిమ్ము మెఱయ
జానకీ పాణిపద్మ సంస్పర్శనంబు
సలుప నున్నాఁడు మా రామచంద్రుఁ డిపుడు. 51

జన:—(హర్షముతో) భగవానుఁడు మాండవీశ్రుతకీర్తులతోడి భరత
శత్రుఘ్నులకు సైతము పరిణయము గోరుచున్నాఁ డని
తోఁచెడిని.

విశ్వా:—అవు నంతియే.

జన:—అట్లయిన భగవానుని యాజ్ఞాకుసుమమును దలఁ దాల్చితిని.
కావున నింక దయసేయుఁడు. పరిణయ కార్యంబుల
నిర్వర్తింతము. (అందఱును నిష్క్రమింతురు.)

గద్యము.

ఇది శ్రీమ దత్రికులాత్రేయ కవిరత్నబిరుదధారేయ శ్రీమ
దెరమిల్లివంశ పయఃపారావార సుధాకరాయమాణ
నారాయణప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త
కుశేశయ కొండలరాయ నామధేయ
ప్రణీతం బైన ప్రసన్నరాఘవ
నాటకంబునఁ దృతీయాంకము
సంపూర్ణము.

—:0:—



శ్రీ

# ప్రసన్న రాఘవము.

## చతుర్థాంకము.

తెరలో ధ్రువగీతి.

క. చండానిలహతి నైనను
గంటుకగని రత్నదీప కంబిదె! కళలన్
నిండై యున్నది మిథిలా
మండలపతి మండపమున మంగళకరమై.

(మఱలఁ దెరలో)

ఓ రోరిక్షత్రియాధములారా! తొలఁగుడు తొలఁగుడు. లోచనపథంబు నుండి తొలఁగుడు.

సీ. ఉదయార్కబింబంబు నదలించు పటుకోప
పాటలేక్షణపరంపరలు నిగుడ
వది కతమ్ముగ నేఁడు నవనీంద్ర గళగళ
ద్రుధిరార్ద్రమై నట్లు స్వధితి మెఱయ

* మ. అలుకన్ నిప్పులఁ గ్రక్కుచూడ్కులఁ గుఠారాగ్రంబు భూపాలీ
గళరక్తంబుల. దోఁగి నట్టులిపుడుం గన్పట్టి మార్వీరవ
మ్ములు జృంభింప వినాశశంక జగమూర్పుంబిండుచే తెండి బె
గ్గిలఁ దోతెంచెను జామదగ్న్యుఁడు త్రిలోకీశౌర్య చంచద్గతిన్,

భువనమ్ములకు నుపద్రవము వెండియుఁ దెల్పు
వేఁడి యూర్పుల గాడ్పు విసరుచుండ
హరిదంతములు ముట్టు జ్యాఘోషణము తోడి
బాణాసనము కేలఁ బదిలపడఁగ

గీ. దరియ వరుదెంచె నిటకు దుర్దమబలుండు
క్షణ వినోద గృహీత లోకత్రయుండు
భృగుకులాంభోధి సంపూర్ణ మృగధరుండు
చిత్రచరితుండు జమదగ్ని పుత్రకుండు.

(అంత జామదగ్న్యుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

జామ:—(సాటోపముగఁ బరిక్రమించి) ఔరా! యేమి యీజనకుని కండకావరము! హరచాపారోపణం బైననే కాని కన్యాదాన మొనర్చినవాఁడు కాఁడు.

(పరశువుం జూచి)

ఉ. కూర్మిగ మహీతలాధిపుల కుత్తుక మొత్తపుఁ బచ్చి నెత్తురిం
పారగ వీరపాణవిధి నాని కడుం గయిపెక్కి యున్న మ
ద్ఘోరకుఠారధార జనకుం డను పేరును గూడ ధాత్రిఁ బో
కాఱిచి వైచు నింకఁ జరితార్థత నేఁటికి సంఘటిల్లఁగన్.

(విమర్శించి)

గీ. పుట్టితివి కార్తవీర్యుని భుజవనమున
బ్రజ్వరిలితివి తుదఁగ రాడ్వంశములను
నట్టి నీ విప్డు పరశురామాగ్రహాగ్ని!
నిమికులంబును పొట్టపై నెగడ వలసె. 4

(మఱల విమర్శించి ఎట్లయిన వీని నుపేక్షింప రాదు. తన కోరినయట్లు బాప్తించిన యల్లునిభుజబలంబు ప్రాపున నితఁడు మిక్కి

లియు గర్వించి యున్నాఁడు. ఇదివఱకు నాపరశువున కితఁడు సందే శము సైత మంపి యున్నాఁడు గదా !

("ఓ జమదగ్ని పుత్ర! పరశూ" అను పద్యము చదివి) ఔరా! ఏమి ? యీతని గర్వాంధకారము ? అగు గాక !

ఉ. దేని మహోగ్రధార భువిఁ ద్రెళ్లు భుజాలతికాళి నుండి జా
తా నవరక్తధార నుదయార్కుని గేరెడు కార్తవీర్య భూ
జాని సురాంగనాతటికి, జానగుపూవుట శోకభూజ మో
నా సలు వయ్యెఁ బౌరవనితాళికి శోకమహీజ మయ్యెనో ?

చ. కలన దశాస్య గర్వమును గాఱిచి రేవకు నానకట్ట నై
పొలిచిన కార్తవీర్య భుజభూజగణమ్ము ను ముంచి రాచబో
టుల కనునీటిపేరనిపుడుం గొమరారు నిజాగ్రధారలం
దలఁగుచు నున్న దిప్పు డలనాదు కుఠారము నిర్విశంకతన్.

(చూచి) ఓహో ! శతానందశిష్యుఁడు తాండ్యాయనుఁ డిటే వచ్చు చున్నాఁడు.

(తాండ్యాయనుఁడు ప్రవేశించును.)

తాం:—భగవానుఁడా ! నమస్కరించు చున్నాను.

జామ:—ఆయుష్మంతుఁడవు గమ్ము. నీగురుని యజమానునికి హర చాపారోపణము నందలిశ్రద్ధ తీరినదా ?

తాం:— —తీరినది.

జామ:—(హర్షముతో) తీరినదా !

తాం:—మహాత్మా చాపముతోనే తీరినది.

జామ:—ఏ మంటివి చాపముతోనే తీరినదా ?

తాం:—మఱిం కేమి ?

జామ:—జరిగిన వృత్తాంత మంతయును స్ఫుటముగా వచింపుము.

తాం:—

గీ. ప్రకట భుజసారుఁడగు నొకానొకబలాఢ్యు
బాహుదండపుఁ బట్టు సైపంగ లేక
కాళికా ప్రాణకాంతుని కార్ముకంబు
భగ్నమైపోయె భార్గవాన్వయ మృగాంక!

జామ:—(క్రోధముతో) ఎవని బాహువుల పట్టున కోర్వ లేక?

తాం:—

శా. మారీచాదుల దుష్టచిత్తుల మహామాంసాశులం గాశిక
ప్రారబ్ధాధ్వర విఘ్నకారుల వశం బం దుంచుకోఁ గల్గె నే
వీరగ్రామణి.

జామ:—(కోపముతో) ఆ తెలిసినది చాలు ఖలాగ్ర గణ్యుండగు
నిశాచరాగ్రణి గదా! ధనుర్భంగ మొనర్చిన వాఁడు.

తాం:—(తనలో) కష్టా! ధనుర్భంగము గావించినది దశకంఠుఁ డని
గ్రహించె గదా యీమహాత్ముఁడు అగుగాక.

జామ:—(క్రోధముతో) ఇదిగో యీనిమిషమ్మునఁ నే

గీ. ఎన్ని వేలొ నృపుల మృదుకంఠ నాళముల్
బలిని గొన్న నాదు పరశు విపుడు
కఠినపంక్తికంఠ కంఠనాళము లెల్లఁ
జీల్చుఁ గాతఁ జేత జేపురింప.

(విమర్శించి) కాని.

చ. అలకృతవీర్య పుత్ర మహీజాద్భుత దోర్లతికాళిఁ గ్రుంచియుం
గులిశమటుల్ నగాగ్రముల గొట్టనుగాయని పొక్కు నాముగా

డ్డలి, జము నింటి ముంగిలి కటా యిఁకనేటి యశస్సు బొందగా
గలుగుఁ దలంపఁ బాత్రిగళ కంఠనళీకదళీ విఖండనన్.

(మఱల విమర్శించి) అయినను మహాపరాధుఁడగు నీరాక్షసు
నుపేక్షింపరాదు. కావున నిప్పుడే.

గీ. అష్టమద్వీపమును గోంకణాభిధమును
యాయ్యవారాశి మధ్యనెయ్యది సృజించె
నట్టి మామక ఘోర బాణాగ్ని కింకఁ
గాపురం బగుఁ గాక లంకాపురంబు.

(సాటోపముగాఁ బరిక్రమించుచు)

తాం:—క్షత్రియకులమ్ముపైఁ బడవలసిన పిడుగు దైవవశమ్మున
లంకపైఁ బడినది.

( తెర లో )

ఓరీ! యెవఁడురా యిక్కడ కృతవివాహమంగళసమేతు లగు
సీతారామ చంద్రులకు స్వస్తి జెప్ప బ్రహ్మబృందమును బిలిపిం
పుడు.

జామ:—(తిరిగి కోపముతో) తాండ్యాయనా! యిది యేమి!
వ్యర్థముగ దశకంఠపరాక్రమము నుగ్గడించి నన్ను వంచించితి
వేమి యీాజనకు నల్లు డెవఁడో మఱియొకఁడుగా దోఁచు
న్నాఁడే.

తాం:—భగవానుఁడా! నాయపరాధ మేమున్నది: అర్థోక్తియందే
మీరు భ్రమించితిరి. నేను సంభ్రమించితిని.

జామ:—అట్లయిన నిశ్శేషముగా వక్కాణింపుము.

తాం:—

శా. మారీచాదుల దుష్ట చిత్తుల మహామాంసాశులం గౌశిక
ప్రారబ్ధాధ్వర విఘ్నకారుల వశం బం దుంచుకోఁ గల్గె నే
వీరగ్రామణి మార్గణాంచల సముద్విఖ్యాత శౌర్యాణు వు
గ్రారంభంబు వహించి వారి భుజవీర్య ప్రౌఢిఁ గ్రక్కించుచున్.

అతనియొక్క (ప్రకట భుజసారుఁడగు అను పద్యమును జదువును)

జామ:—ఎవఁ డా మారీచ వైరి ?

తాం:—గీ. అలవిభాండకపుత్రు పాయసపు బలిమి
దశరథుని కామినులు గన్న తనయులందు
అగ్రజన్ముఁడు శ్రీరాముఁ డనెడువాఁడు
గాధిసుత దత్త శస్త్రవిద్యా ధనుండు.

జామ:—(క్రొంచెము యోజించి) (క్రోధముతో)

చ. నర సుర సిద్ధ సాధ్యులకు నాగులకుం దరియంగ రాని, య
ప్పురములు మూఁడు నెద్ది విధి పోలిక వక్రిలఁగా నశించె న
గ్గిరిశునివిల్లు రాఘవుఁడు గీటిన మాటయె నిక్కమైనచో,

తాం:—కట్టా ! యిఁక నేమనునో గదా ?

జామ:—పరశునకుం దొలంగి, రఘువంశ మికన్ ధర నుంట మాటలే

తాం:—(తనలో) ఈ మహాత్ముఁడు క్రుద్ధుఁ డై యున్నవాఁడు. కావున నీ వృత్తాంత మంతయు మా యుపాధ్యాయునికి నివేదింతును. గాక, (నిష్క్రమించు చున్నాఁడు.)

జామ:—(చూచి) అభినవ వివాహ మంగళ రేఖలు శోభిల్లుటం జట్టి చూడ నీతఁడే రాముఁ డై యుండ నోపు నని తోఁచు

చున్నది. అతఁ డాతని తమ్ముఁడు గానోపు వెంబడించి వచ్చు
చున్నాఁడు. (హర్షముతోఁ జూచి) ఔరా! యీతనిం
గాముఁ డనుటకు మారు రాముఁ డనియెం గావున దాండ్యా
యనుఁ డర్థముగ్ధుఁడు. (మఱలం జూచి.)

ఉ. మారుని కన్న రూపగరిమమ్ము ప్రకర్షము గాంచు మాగ్ధ్యమా
మారవిరోధి మాళిశశమండనునిన్ నిరసించు మూపు లా
మారవిరోధి యైన పురమర్ధనునిం బ్రహరించు నార! శృం
గార విచిత్ర వీరములు గైకొనె నేమొ శరీర మీ క్రియన్

(అంత రామ లక్ష్మణులు ప్రవేశింతురు)

లక్ష్మ:—(కౌతుకముతో)

చ. కదిరెం జాపమునందు మౌర్వి, కుదిరెం గాత్రంబునన్ మాంజియున్
బదిలం బయ్యె నిశాతబాణములు దర్భశ్రేణులుం బాణులం
బదు నై యొప్పెఁ గుఠార కుండికలు దీవ్యద్ధారలం గాన, ని
య్యది భావింపఁగ వీరశాంతముల చిత్రాకారమేమో కదా!

ఆర్యా! యెదుటం గానవచ్చు నియ్యాకార మెద్ది? బ్రహ్మ
క్షత్రాత్మకం బగుచిత్రం బన నొప్పుచున్నదే.

రాము:—వత్సా!

సీ. క్రౌంచగుబ్బలి క్రొమ్మ గుఱి యయ్యె నెవ్వాని
నారాచ కేళికా నాట్యమునకు
నలుసెరంగుల పంటవలతి దక్షిణ యయ్యె
నెవ్వాని దానప్రభావమునకు
అడుగంగ నెడమీఱ యెక్కగ్గ మయ్యె సముద్రుఁ
డెవని దండన విధి ప్రవణతకును

హైహయేశ్వర మహాబాహు కానన దేశ
మెఱయకయ్యె నెవ్వాని పరశువునకు

గీ. నిఖిల గీర్వాణ వైజయంతీగణైక
శాసకుం డైన తారక శాసనుండు
చటుల తరసంగరాంతర స్థలము నందు
బందిగా నయ్యె నెవని దోః పాశములకు

అట్టి భార్గవుఁడవు గదా యీభగవానుఁడు

లక్ష్మ:—అట్లయిన నీమహాత్ముఁడు విస్మయ నీయ శీలుఁడు గదా!

రాము:—విస్మయనీయ శీలురలో శిఖామణి యని చెప్పవలయు ఏల యన

చ. కనకమయైక శైల యగు కాశ్యపినిం గనకైకశృంగగో
పురు బలె గశ్యపర్షి కుల భూషునకు న్వెస దాన మిచ్చియుం
దనియఁడు, స్కంధశక్తి నిహతం బగు క్రౌంచము నస్త్రసంతతిన్
వినిహతిఁ జేసి సిగ్గువడు వీరుఁ డుదారుఁడు భార్గవుండనన్.

(ఇద్దఱుం బరిక్రమింతురు)

రాము:—(అంజలివట్టి భగవానుఁడా! భృగుకులశిరశ్శేఖరశిఖండకా! సానుజుండనై పరమోన్నతి రమణీయ పరిణామ మగు ప్రణామము నాచరించు చున్నాను.

జామ:—సమరవిజయివి గమ్ము.

రాము:—భగవానుఁడా! భృగుకులమౌళిమాణిక్యా! మిక్కిలియు ననుగ్రహింపఁ బడితిని.

జామ:—(తనలోఁ గరుణతో)

మ. చిరుతన్ రాఘవు జంద్రసుందరు నతండు చేటూచుటల్ చూతునే?
(విమర్శించి క్రోధముతో) ఛీ!

విలువంజే యితఁడిట్టు ఖండము నటుల్ విశ్వేశుకోదండముఖ
(మరల సానుక్రోశముగా)
ధరణీపుత్రిక బాల నాకతన వైధవ్యార్తగాఁ జెల్లునే?
(మరల యోజించి క్రోధముతో)
నరవిట్ రేణుక నేను వెవ్వడని మచ్ఛస్త్రంబు సైరించునే!

(ప్రకాశముగా) దాశరథీ! నీయెడల సముదాచారము ననుసరించి నేనాడిన మాటతీరు సుమా యిది!

రాము:—అట్లయిన మనసుతీరెట్టిది

జాము:—

ఉ. శాంభవచాప నిర్మథనశస్త నిరంకుశ సాహసక్రియో
జ్జృంభ బలావలేప సవిశేష వికాస లసద్భవద్భుజా
స్తంభ వినిర్గళ ద్రుధిరధారల పేరి మధుద్రవంబులం
గుంభ మహాభిషేక మొనగూర్తుఁ గఠోర కుఠారధారకున్.

రాము:—మహాత్మా! నిగ్రహానుగ్రహములకు రెంటికిని యీ జనుఁడు సంసిద్ధుఁడై యున్నవాఁడు. కాని మీకోపమునకు హేతువేమియో వినఁగోరుచున్నాను.

జాము:—(తనలో) ఔరా! యేమి వీని గర్వాంధకారము! తానై యొనర్చియు మాచే వినియుఁ దన దుర్వినయము నింకను వెల్లడించుకొనుచున్నాఁడు. కానిమ్ము. (ప్రకాశముగా) ఓరీ! దుర్విదగ్ధా!

గీ. ఎద్ది బోధింప ఘటియిల్లె యిప్పటికిని
త్రిపురకాంతల వైధవ్యదీక్ష పెడదొ,

అట్టి జగదేకగురుప్రాయ శాసనమును
భగ్నమొనరింపవే నీవు? పాపచరిత!

రాము:—మహాత్మా! తాము పట్టి లోకవదంతి విని నిరపరాధుండ నగు నాపైని వ్యర్థముగఁ గోపమూనితిరి.

జాము:—అట్లైన హరకార్ముకము భద్రముగ నున్నదా?

రాము:—లేదు లేదు.

జాము:—మఱి నీవు నిరపరాధుండ వెట్లగుదువు?

రాము:—గీ. దగ్గిరిలి నేను ముట్టి ముట్టకయ మున్నె
తునియ లయ్యెను చాపంబు తనకుఁ దానె
దాన నాచేసినది యేమి తప్పొ చెప్పుమ!
భవ్యగుణసాంద్ర! భార్గవ వంశచంద్ర!

జాము:—ఔరా! యెట్టెటూ? చందనపుఁ బూతగల కఱకుటమ్మునాటి నా హృదయమును జల్లవఱచెదవా? చాలు నూరకుండుము.

(కుఠారము నెత్తి)

ఉ. భూరి కఠోర వృత్తి మెయిఁ బొల్చుకుఠారము నీకు నీమనో
హారిణి విహాది యాస లడియాసలుగా భవదీయ కంఠమున్
జీరును రోరిరామ! శశిశేఖర కార్ముక కర్మఘాతి వి
స్తార తరాఘధామ! గుణ సంగ విరామ! నృపాన్వయాధమా!

కావున దీక్షణ సిద్ధపడుము.

ఉ. హారము కంఠపీఠిఁ గఱకైనకుఠారము చేరుఁ గాక మా
దారలకంటఁ గజ్జలము తాపజలమ్ము దనర్చుఁ గాక యీ
ధారుణిపై సుఖమ్ము లణఁగి దుఃఖముఖమ్ము కొనసాగఁ బోకుఁ జే
కూర్చును గాక యెట్లయిన మాధను దీక్షణఁ బోవఁ బాపలన్.

జామ:—ఔరా ! నన్నుసైత ముక్షత్రబ్రాహ్మణమాత్రుని భంగిఁ గేవలముఁ బ్రణతిపాత్రునిగాఁ దలంచితివి కాఁబోలు.
(క్రోధముతో)

మ. దురమం దెవ్వని బాహుపంజర నిబద్ధుండై గుహుం డోడి యే
పటి నా కేల మ ఖానుసారి భుజదర్పం బీయు నై తంచు శం
కరు హ స్తంబున నొప్పు నల్వతల నల్కం జూచెనో యట్టి దు
ర్ధరుని న్నన్నును నీవెఱుంగ వటరా రాజన్య వ .శాంతకున్.

(మరలఁ గోపముతో)

ఏమంటివి గా ! ఏమంటివి ? "డీక్షాంన బోము బావలన్" అనియా? ఆహా ! క్షత్రియజాతిపై నభిమాన మూని బ్రాహ్మణజాతిని తృణ ప్రాయముగాఁ దలంచితివి కదా ! ఇప్పుడా రెంటియం దేజాతి గరిష్ఠమైనదో సంగ్రామతలమే నిర్ణయింపఁ గలదు.

రాము:—

ఉ. భూమిసురేంద్ర ! మీాసరిని పోరను మాటయు మాకుఁ జెల్లునే ?
మేమన నెంత, మీార లన మేటిమగల్ గద వీరకోటిలో

లక్ష్మ:—జమదగ్ని నందనా ! యిది యెంతయు నిక్కము.
ఏమన మాకు రాజులకు నేకగుణంబగు విల్లు విప్రచం
ద్రా ! మఱి మీాకన న్నవ గుణం బగు జన్నిదము న్బలంబగున్.

రాము:—వత్సా ! మాననీయుఁ డగు నీ తాపసేంద్రునిపై దుర్వినయ వైదగ్ధ్యము కూడదు సుమా !

జామ:—ఇందు వీనినేర మేమున్నది ?

ఉ. ఓడక పైట లూడ్చి నతు లొక్కట మూఁగుట పిరిపూర్వుఁ జ
క్కాడక మత్కుఠార హాతకం బిపు డింతటి చేటుఁ దెచ్చెఁ బూ
బోఁడుల పేరిమైమఱపు ప్రోపున డాఁగెడు తుచ్ఛరాజు లె
గ్గాడ వినంగ నయ్యెఁ దగునా దయఁజూపఁగ క్షత్రజాతిపై.

రాము:—భృగుకుల కంఠీరవా ! యీ క్షీరకంఠునిపై నింతకఠోర ముగఁ గోపింపఁ జనదు. కావున క్షమింప వేడెదను.

జాము:—ఏమేమీ ! క్షీరకంఠుఁడా వీఁడు. విషకంఠుఁడనుము.

లక్ష్మ:—భగవానుఁడా ! అట్లయిన మీరు విషకంఠ శిష్యులు గావున నినుమంతయు నాగ్రహింపఁ దగదు.

జాము:—(క్రోధముతో) ఏమిరా ! విషకంఠ నామ సామ్యమున నీవును నాకు గురుండవా ?

లక్ష్మ:— (నవ్వి) మహాత్మా! నేను వేఱొకయభిప్రాయమున నట్లంటిని. ఏ మన

ఆ. వె. తరుణచంద్రరేఖ తల నెక్కి యున్నను
గరళ గళుని కలుక గలిగె నొక్కొ ?
అతని శిష్యుఁడీవు నట్టి వాఁడవె కావె!
పలుక నేల వేఱ భార్గవేంద్ర !

జాము:—(తనలో) ఆహా! యేమి యీక్షత్రియవటుని వాక్పాండిత్య పాటవము! (ప్రకాశముగా) సరే కానిమ్ము. నేను క్షమించితిని. కాని ప్రకృతికఠోరమైన యీకుఠారము మాత్రము సహింపదు. దీనిశీలము నీ వెఱుంగవు గాబోలు.

శా. కేళిం బైకొని యీ కుఠారము రణ క్రీడార్థియై చండబా
హా లీలాంచ దశేష రాజకుల సంహారంబుఁ గావింపఁ ద
త్కీలాలాస్థికచప్రకీర్ణ మయి ధాత్రీమండలం బెల్ల నా
వాలం బయ్యెను మూఁడు వర్ణముల కెవ్వఁ డం బరీక్షించినన్.
(మఱలఁ గోపముతో)

పురహరుని యనుగ్రహంబుచే నాకుఁ జేకూరిన యీ గొడ్డంటి చరిత్రము నీవెఱుంగవు వినుము.

మ. బలి యై దీనికి నేలఁ గూలిన నృపవ్రాతంపు ర క్తంపు ధా
రల నీరేణుక యై ధరిత్రి తనరన్ రాజిల్లె నెంతే నభ
స్థల మవ్వీరవర స్వయంవరపర స్వస్త్రీకరాంభోజ వ
ర్తి లసత్పంకజదామరేణువులచే రేణూత్కటం బై కడున్.

లక్ష్మ:—మహాత్మా! నీకుఠార ప్రభావమ్మున ధరిత్రి నీరేణుక
యయ్యె నన్న మాట మాత్రము నిజము.

జామ:—(తనలో) ఔరా! రేణుకా వృత్తాంతముచే వీఁడు నామర్మ
ములను నిదళించు చున్నాఁడు. కానిమ్ము (ప్రకాశముగా)
ఓరీ క్షత్రియడింభకా! నిరపరాధుఁడ వగు నీపై నేఁబరశ్వధము
ప్రయోగించినఁ బ్రయోజనము లేదు. కావున బ్రకృతికఠోర
భాషి యగు నీకంఠము నిప్పుడే మత్కుఠార ము త్తరింప
నున్నది.

(తెరలో)

జమదగ్నినందనా! యేమి ప్రగల్భములు కొట్టుచున్నాఁడవు!
నిన్ను శాసించుట కిదిగో శరాసనము వచ్చుచున్నది.

జామ:—(నవ్వి తనలో) ఓహో! యితఁడు జనకుఁడు గాఁబోలు.
ఓయీ! యాజ్ఞవల్క్యశిష్యా! నీకు శరాసన మెందులకు?
పద్మాసన మవలంబింపుము. చాలును.

(మరల సోత్ప్రాసముగ)

శా. పూతం బౌ జలజాక్ష మాల నిరతంబుం గేలఁ గీలించు నో
క్షత్రశ్రోత్రియులార! మీకు రణకాంక్షల్ రిత్తగా దే సుమీ
లాతుల్ వారు, కరాంతరాళ కరవాల స్ఫారధారన్ రిపు
వ్రాత స్ఫీతగజేంద్రకుంభ మదధారల్ ముల్చు వీరాగ్రణుల్.

కావున నీ పూరకుండుము. ఈ రామునింబుగురుల నేనే యార్పివై చెదను.

(మరలం దెఱలో)

జమదగ్ని నందనా! అంత శమధనసమృద్ధుండగు జమదగ్నికి పుత్రుండ నైనను నీకావున నందున కైనను క్షమ గాన్పింపకున్నదే?

జామ:—ఓహో! యితం డాంగిరసుండు గాంబోలు. ఓయీ! శతా నందా! యీపాటి శమధనమును నీవే తండ్రికడ సంపాదించు కొంటివి. గౌతముని వలననా? పురుహూతుని వలననా?

(మరలం దెరలో)

ఛీ పాపాత్మా! క్షత్రియాగర్భసంభవా! నిజ జననీ కంఠ తాండవిత కుఠారకా! తపో విశేషోన్నతం బైన యాంగిరసుని కులంబునం గూడ మచ్చ గల్పించు చున్నాండవా?

జామ:—ఓరీ! కులపాంసనా! పాంసులాపుత్రా! భృగువుల సముత్కంబున సైతము తపస్సని చిందులు ద్రొక్కుచున్నాండ వేమి?

రాము:—మహాత్మా! భృగ్వాంగీరసకులంబులు రెండును జగద్విఖ్యా తములే. అయినను తపఃప్రభావము మాత్రము భార్గవశిష్య లగు మీకే మెండు. కావుననే మనవి సేయు చున్నాను.

చ. అమలతపఃప్రశాంత మగునాత్మయు స్ఫాటికమాలికాజప
క్రమమును గుండి దండకుశకాండములున్ వనవాసనిష్ఠయున్
సముచిత మౌను గాక మునిచంద్రులకుం; బరుషోక్తి భ్రూవిభం
గము ధనువున్ శరంబులును గాని కుఠారము గాని యర్హమే.

(మఱల వినయముతో) మీరే యోచించికొందురు గాక.

ఉ. పాడుకుఠార మేడ ఘనబాడబవంశ మదేడ, మర్మముల్
గాడెడుచాప మేడ విశాలం బగుశీల మదేడ, నెత్తురుల్
దోడుకణాంగణప్రకటదుర్భరశస్త్రవిహార మేడఁ బా
లోడుకుశప్రవాళముల నొప్పుకుటీర మదేడ భార్గవా!

జామ:— ఇతరులం బోలె నన్నును గేవలము ప్రాణిమాత్రుఁ డగు మునిమాత్రునిగా భావించితివి బాలుఁడవు. ఈజామదగ్న్యుని వృత్తాంత మెఱుంగవు వినుము.

ఉ. కూలినక్షత్రియాధముల ఘోరగళంబులనుండి జాఱు కీ
లాలపుటేటఁ గ్రుంకి శిథిలమ్మగు తత్కచరాజి దర్భగా
హాళిని నాయొసంగు రుధిరాంజలులం గొను ప్రేతసంఘముల్
జాలియు నుబ్బు భీతియు ననహ్యతయుం గని చోద్య మందరే!

అది యటుండ నిమ్ము.

మ. మును భంజించితిఁ బోర మత్తనృపులన్ ముయ్యేడుమాఱుల్ మఱే
డునుబర్యాయము లింకఁ దక్కునృపులన్ డొల్లించి, యొక్కొక్కపో
రను జేకూరిన మేటిరాజుల శిరోరాజం గపాలాక్షమా
లను నిర్మించి ఘటింతు భైరవుని కుల్లాసంబు దీపింపఁగన్.

రాము:—

ఉ. కోపము సంహరింపు భృగుకుంజర! శాంతివహింపు మామకా
లాపము లాలకింపు వికలత్వముఁ జెందినజాదరీఁడు పెం
పౌ పణ మెల్లఁ గోలుపడు నట్లు భవచ్చిరయత్నజాలసం
స్థాపిత మైన కీర్తిచరితం బిపు డూరక గోలుపోకుమీ!

జామ:— ఎట్లురా కోలుపోదునా? (విమర్శించి) అగుఁ గాక.

ఉ. ప్రేలుటలోన మీరు కడు పెద్దలు మాటలఁ దీరఁ బోఁ దగం
జాలుదు రేని సక్కనయి నైతురు గొప్పతమీర లెల్ల నా

భీల విరోధివర్గ గళపీఠ విదాహన సాహసక్రియా
లాలన మామకీనబహుళప్రదరాగ్ని శిఖాచయమ్ములన్.

రాము:—నాకావించిన హారచాపారోపణమ్మునకు సంతసిల్లి సీతా వధూటి స్వయముగాఁ దనకేలుఁజివుళ్ళతో నలంకరించిన కమలమాలికయందలి సౌరభమ్ములకుఁ జిక్కి మాటిమాటికిం బఱతెంచి పైమూఁగు తుమ్మెదలబారు తమఝుంకారము పేరఁ బ్రసరింపఁ జేయు యశఃపరిమళమ్ములచే నెంతయు వాసించుచున్న యీ వక్షస్థలములోఁడ నేనే సహింతును గాక. ఒరు లేటికి!

శా. ఉగ్రత్యక్త పురాణచాపదళన ప్రోద్భూతగర్వోద్ధతి
వ్యగ్రస్వాంతుఁడ వెంత నీవు ? మఱి నీయాచార్యుఁడే మామకీ
నోగ్రాస్త్రంబులధాక కుల్కి వరదానోదారుఁ బద్మాసనుం
బ్రాగ్రం బైన తపంబుచేఁ దనిపి విప్రత్వంబు యాచింపఁడే.

(తనలో)

రాము:—ఔరా! యీతఁడు భగవానుఁ డగు విశ్వామిత్రుని సైతమధిక్షేపింపఁ దొడఁగినాఁడు. కాన నిఁక సహింపను. (ప్రకాశముగా) ఎట్టెటూ!

శా. ఉగ్రత్యక్త పురాణచాపదళన ప్రోద్భూత గర్వోద్ధతి
వ్యగ్రస్వాంతుఁడ నొక్కొ నేను ? మఱి నాయాచార్యుఁడే తావకీ
నోగ్రాస్త్రంబులధాక కుల్కి వరదానోదారుఁ బద్మాసనుం
బ్రాగ్రం బైన తపంబుచేఁ దనిపి విప్రత్వంబు యాచించెనా?

(మఱల సాటోపముగా) జమదగ్నినందనా!

చ. పిడుగును బోలు నద్ధనువు ప్రీల్చిన ప్రీల్చితిఁ గాక నీమొదన్
దళముగ దుఃఖశల్యమును నాటిన నాటితిఁ గాక, దానిఁ బో

విడు మిఁక శూలి దేని మఱి వెన్నుని దే నగుఁ గాక యెద్దియున్
గడనకు రాదు నామఘన గర్వకలాపటుశౌర్యలీలకున్.

జామ:—(సంతోషముతో) మేలు మేలు రాచకుఱ్ఱా! మేలు. పరశురాముఁ డనెడు చండధాముని యెదుట మిణుగురుఁబుర్వు చాడ్పున మెఱయఁ జొచ్చితివి. (మఱలఁ గోపముతో) ఏమంటివిరా యేమంటివి?

రాము:—(దానినే చదువును) మఱల నింకొకసారి చదివెదను, వినుము. (అని దానినే మరలఁ జదువును.)

జామ:—మేలు మేలు. చక్కఁగా స్మరణకుఁ దెచ్చితివి.

రాము:—అది యెట్టిది?

జామ:—

మ. హరిహస్తాహతిచేఁ జలించుతులసీహారంపు నేత్రావిక్ష
పఋవుల్ వాఱు మిళిందపంక్తుల రొదం బల్ దట్టమై దేని దు
ర్భరటంకారము సోఁకుఁబోఁట్ల రుదితస్వాధ్యాయ సంపత్తి కొం
కరణంబో యన నొప్పె నద్ధను విదే కన్గొమ్ము ధీరుండవై.

రాము:—గీ. జలజనేత్రుని హస్తాబ్జతలమునందు
లీల మెఱసిన దిదియ కాఁబోలు తొల్లి;

జామ:— కాక మఱియేమి? గ్రహియింపు వీఁక యున్న
లేక నాతోడఁ గలహింపు లీల మెఱయ.

రాము:—చాపమునే గ్రహించెదను.

జామ:—కంటఁ దడివెట్టుకొనుచు నీ బంధుజనంబు లెల్ల మూఁగి యున్న యీ ప్రదేశమును విడిచి పోరాటకుం దగినతావునకుఁ బోదము రమ్ము. (నిష్క్రమింతురు.)

లక్ష్మ:—(చూచి హర్ష కౌతుకములతో)

శా. గౌరీనాయకుచాప మట్టిదియు భగ్నంబాయె నేమో యటం
చారాటమ్మున నెల్ల నెల్లగని బాహాగ్రంబునం దాల్చి లీ
లారమ్యత్వముగు నట్టు లార్యుఁడు మహోల్లాసంబు నై మండలా
కారం బేర్పడ వంచె నౌర! యిపు డీకంజాక్షు కోదండమున్.

(తెరలో)

ఆహా! యేమి యింత!

సీ. ధగధగద్యుతులు బిట్టెగయంగఁ జక్కనఁ
జాపచక్రమునుండి చంక్రమించి
యమరు లుద్భ్రాంతి నై నంతంత నోదుగంగ
నంతరిక్షమున దవ్వరిగి యరిగి
నిజపుణ్యమునఁ దాను నిర్మించికొన్న భా
ర్గవరాము స్వర్గమార్గమ్ము గ్రమించి
విస్మయాంబుధిఁ దోఁగు విబుధసంతానంపు
వెన్నాఁడుచూడ్కితో వెనక మరలి

గీ. అమరకాంతాకరస్రస్త సుమవిలోల
భృంగసంగీతభంగి నెసంగు కీర్తి
చంద్రికల హంస మై సొచ్చె సత్వరమ్ము
రామబాణమ్ము తూణపర్యంకమందు.

(అంతట రామజామదగ్న్యులు ప్రవేశింతురు.)

జామ:—(రాముని దెసఁ బరికించి తనలో)

శా. త్రైలోక్యంబను కోకిలమున్ మునిమనోరాజీవకాంతావహ్ముం
గేళిం దేల్చె నెఘాని సంజనన సంక్రీడాప్తిచే నట్టి యీ

బాలుం డెవ్వఁడో నీలపంకజకళాస్ఫారుం డయారే! జగ
న్మాలం బై తగు నవ్వేలుంగె యిట్టు రూపుం దాల్చె నేత్రాభవిన్.

(మఱల విమర్శించి)

గీ. పురవిరోధి శరాస నాపూరణార్థ
మెవ్వఁ డవలీల బాణ మై యొసఁగెఁ దొల్లి
పరమ పూరుషుఁ డాతఁడే బాలుఁ డగుచు
నవతరిలె నేమొ తద్రోవణార్థ మిపుడు.

(ప్రకాశముగా) వత్సా ! యిటు రమ్ము.

రాము:—(లజ్జతో) దల వంచి నిలుచును.)

జామ:—(సమీపించి రాముని గడ్డము వట్టి యెత్తి, వత్సా ! యిది లజ్జింపఁ దగిన తావు గాదు.

గీ. ఎవని నణగంగఁ ద్రొక్కుట కిప్పు డిట్లు
స్వప్రభావంబు ప్రకటింప వలసె నీకు
నతని కేపాటి యింక దైవత సమూహ
తల్లజులు సైత మబ్జబాంధవవిలోశ !

రాము:—(దోయిలివట్టి) మహాత్మా! అవినయ మింకఁ దడవకుఁడు. దుర్వినయ పంకమ్ముచే మలీమసుఁడ నై యున్న నేను మీజ్ఞానగోటికాంతుల పేరి నదీ తరంగంబులలో మునిఁగి పవిత్రుఁడను గాఁగోరు చున్నాను.

గీ. చండమే యగు సూర్యతేజంబు సతము
సౌమ్యమే యగు చంద్రతేజంబు నట్లు;
చండమును సౌమ్యమును నయి సంతసముసు
గూర్చు మీ తేజమునకు మ్రొక్కులు ఘటింతు.

(అని పాదములపైఁ బడును.)

జామ:—ఓయీ! కల్యాణనికేతనా! ఆశీర్వచనము గూడ నీయందు ఘటనకు_క్తియే. అయిన నిట్లాశాసించుచున్నాను.

చ. పలుపుము కీర్తిపూరములఁ బ్రహ్మభవాండము నిండ, నుండు మి ద్ధరపయిఁ బెద్దకాలమును, తావక సాయక భిన్నదైత్య కం ధరములు క్రీడ రాల సలనాగనరామరు లెల్ల మోదసా గరమునఁ దేలియాడుదురు గాక దివాకరవంశచంద్రమా!

నా కింకననుజ్ఞ నిమ్ము పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

రాము:—(లక్ష్మణునిఁ జూచి) వత్సా! భగవానుఁడు లోచనపథంబు దాటి పోయినాడు గదా! భృగుకుల మార్తాండుని విరోధ గమ్ముచే చిన్నవోయిన మనమానసములను బంధుజనదర్శనం బున వినోదింపఁ జేయుదము రమ్ము. (నిష్క్రమించును)

గద్యము.

ఇది శ్రీమదత్రికులాత్రేయ కవిరత్న బిరుద ధారేయ శ్రీమ దెరమిల్లివంశ పయఃపారావార సుధాకరాయమాణ నారాయణప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త కుశేశయ కొండలరాయనామధేయ ప్రణీతంబైన ప్రసన్న రాఘవ నాటకంబునఁ జతుర్థాంకము సంపూర్ణము.

---



శ్రీ

# ప్రసన్న రాఘవము.

## పంచమాంకము.

(గంగా యమునలు ప్రవేశించుచున్నారు.)

గంగ:—సఖీ యమునా! సంక్షోభించుచున్నట్లు గన్పట్టుచున్నావే హేతు వేమి?

యము:—అమ్మా భాగీరథీ! అందులకుఁ బెద్దకారణ మున్నది. అందొకటి చెప్పెదను వినుము. నాకు సుగ్రీవుఁ డను సహోదరుఁ డొకఁ డున్నాఁడు.

గంగ:—(కౌతుకముతో దనలో) ఏ మిది? కపికులుఁడు గదా సుగ్రీవుఁడు. అతఁడు దీనికి సహోదరుఁ డెట్లయ్యె? (విమర్శించి) అవు నవును మఱచితిని. వీరి కిద్దఱకును సూర్యుఁడే కదా జనకుఁడు. (ప్రకాశముగా) ఆతని కిప్పు డేమి సంభవించినది?

యము:—మహాబలిష్ఠుడును దుష్టుఁడు నగు వాలియనువానరునిచేఁ బరాభూతుఁ డై కతిపయవారముతోడ నొకకొండ నాశ్రయించి యున్నాఁడు.

గంగ:—వా రిద్దఱన్నదమ్ములే గదా? యింత వైర మెట్లు సంభవించినది? (అర్థోక్తియందే) అవును. ఏకామిషాభిలాషయే

వైరమహాతరువునకు బీజము గదా! సరియే యిక రెండవ కారణ మేది?

యము:—ఒకానొకదినమున తాపసవేషంబులు ధరించిన మన్మథ వసంతులో యన జటావల్కలధరు లగుసిద్ధరుయువకులును చక్రవాక స్తని యగు నొకకోమలియు నన్ను త్తరించి దక్షిణ తీరంబునఁ బోవ నుపక్రమించిరి.

గంగ:—పిమ్మట?

యము:—పదంపడి యక్కాంత కరకమలమ్ములు మోడ్చి క్షణ మాత్రము నిల్చి నన్నుఁ గూర్చి యిట్లు విన్నవించెను. "దేవీ భానుతనయా! మరల నిజకుటుంబమునకు దర్శన మొసంగు దువు గాక.

గంగ:—మఱి యీ విషయమున నీ వేమి యూహించితివి?

యము:—(గంగచెవిలో) ఇట్లు.

గంగ:—ఇది నమ్మఁదగినది గాదు. వేనవే లగుసుతులచే హృదయము కలఁగి నీ విట్టిరిత్తయూహాలకుఁ బాలైతి వని తలఁచెదను. ఏమో విధివిలాసంబుల నెవ్వఁ డెఱుఁగును?

యము:—అట్లే జరిగియున్నచో నీ కీవృత్తాంతము దెలియ కుండునా?

గంగ:—నా కేమియుఁ దెలియదు. బ్రహ్మలోకమునుండి యింతకు ముందే సరస్వతి వచ్చినది. దానితో ముచ్చట లాడుచు నేను మఱేదియు నెఱుఁగ నైతిని. కావున పోదము రమ్మ చెంతనే సరయువు గలదు. దాని వలననే సర్వమును దెలిసికొన నను వగును. (పరిక్రమింతురు)

(అంత సరయువు ప్రవేశించును.

సర:—తల్లులారా! నమస్కరించు చున్నాను.

గంగాయమునలు:—అప్రతిహతముగా శోభనవతివి గమ్మ.

గంగ:—(సరయువును జేతం బట్టుకొని) చెలీ! ఇది యేమి? నీశరీర మునిండ సెగలును పొగలును వెలువడు చున్నవి?

స:—అమ్మా! ఇదేమి! ప్రతికూలముగా మాటాడు చున్నావు! లజ్జయను బురదయందు మునింగి యున్న నన్నిపుడు కొంత వఱకీసెగలుపొగలే గదా కాపాడు చున్నవి.

గంగ:—నీసంభాషణము నా కర్థ మగుట లేదు. కావున స్పష్టముగం జెప్పుము.

సర:—

ఉ. ఆపగరాని తాపమున నార్చుచు మత్తటభూమి నయ్యయో
ధ్యాపురకామినుల్ గురియు నశ్రుభరంబున నబ్బి తాపసం
తాపిత మైనయీతనువుం దాల్చుచు లజ్జను మాటిమాటికిం
జొప్పుచు వెండి గ్రక్కొనుచునన్ పగకు న్గతి నైతి నమ్మరో!

గంగ:—వారియశ్రువర్షమునకుం గారణ మెద్ది?

సర:—(గంగచెవిలో) ఇది.

గంగ:—హా! యిందుమతీనందనా! సకలలోక హృదయానందన చందనా! హా ప్రచండకోదండపండితా! ఆఖండలప్రియాసఖా! హా నిజతనయ నిర్విశేషప్రయణ పాలితసర్వలోకా! హా రామ భద్రైకజీవితా!

సర:—(తనలో) దాని ఫలసితమే యిది.

గంగ:—హా మహా రాజా! దశరథా! (అని మూర్ఛిల్లును)

యము:—(చేలమున విసరుచు) దేవీ! యూరడిల్లుము. ఇట్టిగుణవంతుఁడు గావుననే యారాజచంద్రుఁడు ధన్యుఁ డయ్యెను. కాన నాతనికై వగవ రాదు.

గంగ:—(సరయువుతో) సఖీ! యీసంతాపము నీకుమాత్రమే గాదు. సర్వలోక సాధారణ మైనది. కావున రామభద్రుని పేరు నీడ నాశ్రయించి యీతాపము వాపుకొందము.

సర:—అమ్మా! ఎడమీక తెఱపబడు చుండువానికి మెప్పుడును వాడిపోవదు గదా!

గంగ:—నీయభిప్రాయము స్పష్ట మగు నట్లు జెప్పుము.

సర:—(పెదవి విఱుచును)

గంగ:—సరయూ! యిదియేమి? కార్చిచ్చుచేఁ గమరిపోయిన వృక్ష శాఖపై మఱల గొడ్డలి వైవ నుంకించెద వేమి? కాని మ్మదే దియో చెప్పుము.

సర:—(తనలో) కట్టా!

ఆ. వె. ఆ ప్రజనుని కైన యాపదుత్పాతంబు
నెఱిఁగి కొనుట లేని, యెఱుఁగ కుంట
లేని, గనుట లేని, కానకుండుట లేని
కోరఁ డించుకయును గోవిదుండు.

(ప్రకాశముగా) దేవీ! రామభద్రు నభిషేకింపఁ గోరియుండ దశరథుని చెంతకుఁ గైకేయి వచ్చి తొలుదొల్త నిట్లు సంభాషించెను.

క. తనప్రతిన నెఱపుకొలును
దనప్రజనుం గాచికోలు ధరణిపసంక్రం
దనులకు గడియలు దీసిన
యనిమిషనగరంపు గవని యగుఁ గాదె నృపా!

గంగ:—(తనలో) కట్టా! ఈదురాశయే పదియో చెట్ట తలయెత్త నున్న దని సూచించెడిని. (ప్రకాశముగా) అటు పిమ్మట కైక యే మనియెను.

సర:—

చ. పనివడి నాకు నీవు ఋణపడ్డ వరంబుల దీర్పు మీక్రియన్
బనుపుము రాముఁ గాన కటుపై భరతున్ యువరాజుఁ జేయుమీ!

గంగ:—(సోద్వేగముగ) పిదప నేమి జరిగినది?

సర:—

అనుచును గైక వల్క విని వ్యాకులమానసుఁ డైన తండ్రికిన్
వినతి యొనర్చి యేగె రఘువీరుఁడు కానకుఁ బ్రీతచిత్తుఁ డై.

గంగ:—యమునా! నీ వన్న దిది. (విషాదముతో) హా! రఘుకుల కుటుంబమా! వేఁటువడితివి సుమా!

యము:—తల్లీ! కేవలము రఘుకుటుంబమే గాదు. మృగములును మహర్షులును వనములును దేవతలును దక్క యీ జీవలోక మంతయు రామచంద్రు ముఖదర్శనమునకు నెడఁబాటుం జేసి వ్రేటువడియే యున్నది.

సర:—నిజము దేవీ! నిజము.

క. రజనీనాథుఁడు గ్రుంకఁగ
గిజగిజ లోకకైరవములకే గాదుగదా
త్రిజగములు గూడ నొక్కట
గజబిజి యై పోవె యంధకారచ్ఛటలన్.

గంగ:—సఖి సరయూ! సీతాలక్ష్మణు లిప్పుడు రామచంద్రుని యెడల నెట్లు ప్రవర్తించిరో వినఁగోరు చున్నాను.

సర:—చంద్రు నెడల జంద్రికాప్రసాదముల వలెఁ బ్రవర్తించిరి.

గంగ:—(సంతసముతోఁ దనలో) వా రిద్ద ఱాతనితోడ నడవి కేగి రనియే సరయువు చెప్పు చున్నది. (ప్రకాశముగా) చెలీ! యీవచనామృతమున బ్రతికితిని. క్షీణ మైన రామచంద్ర వియోగము ననుభవింపఁజాలదు గదా మనజానకి!

సర:—రామచంద్రుడు తొలుదొల్త జానకిని జూచి యి ట్లనియెను.

గీ. మాతలకు సేవ సల్పుచు మానవతిరొ
గడపు మిచ్చోటఁ గొన్నేండ్లకాల మీవు

ఈమాట విన్నతోడనే జానకి మూర్ఛవోయి బంధుజనమ్ముల శీతోపచారమ్ములచేఁ గూడ నెంతకుఁ దేఱికొన దయ్యెను.

యము:—మఱి యెట్టకేల కెవ్విధిం దేఱికొనియె ?

సర:— అట్లు గాకున్న నంభోరుహాయతాక్షీ !
కదలు మిప్పుడె నాతోడ గహనములకు.

ఇట్టి రామవాక్యామృతమునఁ దేఱికొనియెను.

గంగ:—ఇది జానకీ స్నేహోచిత మైన పలుకు.

యము:—రామలక్ష్మణులకుఁ గూడ నే మైన సంవాదము జరిగెనా ?

సర:—జరిగినది. లక్ష్మణుని జూచి రాము డిట్లు పలికెను.

క. కనుఁదోయి మూసికొని నీ
వనుజా ! నిమిషములఁ బోలె నట్టిటు పిహో
యనముల నిచ్చోఁ గడపుము
ననుఁ బోలెం గనుము భరతు నవనీతాత్మున్.

దానికి లక్ష్మణుఁ డిట్లు మాఱు పలికెను. "రఘుకులోత్తంసా!"

గీ నీపదాంభోజముల చెంత నిలుతు నేని
యుగము లైనను యామమ్ము లగును నాకు ;

అట్లు గాదేని పదునాలు గబ్దములును
గ్రమతఁ బదునాల్గు మన్వంతరములు సూవె!

మఱియు

గీ. నీపదాంభోజముల చెంత నిలుతు నేని
తలపఁ గల్పమ్ము లైన నబ్దములు నాకు;
కాక నీతోడి వియోగమ్ము గలిగె నేని
నిమిషములు గూడ బ్రహ్మకల్పములు సూవె!

గంగ:—సరయూ! కౌసల్య రాముని కేమని బోధింపలేదా!

సర:—బోధింప కేమి? ఆమెయు రామభద్రుం జూచి 'వత్సా! సీతను (అని యర్థోక్తి కుందే) సీతారక్షణము నీ కెందులకులే. నిన్నిట్లు వేడుకొనుచున్నాను.

గీ. అఖిల రాజ్యోపభోగ సౌఖ్యముల కన్న
నిన్ను సహజప్రియుని గాఁగ నెన్ను వాఁడు
లలితగాత్రుండు బుధుతఁ డీలక్ష్మణుండు
ప్రేమతోఁ జూడు మీతని రామచంద్ర!

అంత రామభద్రుఁ డిట్లనియెను. తల్లీ! నాప్రాణమును గాపాడుకొ మ్మని కూడఁ జెప్పవలెనా?'

గంగ:—కట్టా! అదిమొదలు రామచంద్రునికి సహజసౌజన్యమే విభూషణ మయ్యెఁ గాఁబోలు.

సర:—మఱియు నింకొకమాట గలదు. రామచంద్రుఁ డాభరణజాలముల నన్నిఁటిని విసర్జించుచుండఁ గౌసల్య యాతని నిట్లు వేఁడుకొనెను.

“క. నాతండ్రీ! రామచంద్రా!
పూతం బీరత్నముద్రఁ బోనాడకుమీ!

ఊతం బిది సతతంబును
సీతా మాంగల్య రమకుఁ జిన్నికుమారా!"

ఇం శోకవిశేషముం గూడఁ జెప్పుచున్నాను. ధీరురాలవై వినుము.

గంగ:—ఇంతవఱకును విను చున్ననన్ను ధీరురాలు గాదనియే శంకించు చున్నావా?

సర:—

చే. ముదితే ముఖాబ్జుఁడై నరఘుభూషున కెట్టిటో లక్ష్మణుండు తా
సదమల మల్లికాముకుళ సన్నిభ మైన నిజాశ్రుబిందులన్
బద నిడుచున్ జటాలతలఁ పాటిలఁ జేయుచు నున్న యట్టి య
య్యదన జగంబు సర్వము దయామయ మై కనుపట్టె నమ్మరో!

యము:—సీతకుఁ గూడ బంధుజను లేమేని బోధించిరా?

సర:—దేవీ! విపరీతము లాడెద వేమి?

ఉ. ఉదిత మహాటవీ నివస నోత్సుకతం జనుకాంతు వెంట నె
మ్మది నొకకొంకు లేక నృపమండను పుత్రిక యేగు చుండఁ ద
త్పదకమలద్వయీ కలితభాసురనూపుర నిస్వనమ్ములే
విదిత మొనర్చె బంధులకు విస్ఫుటరీతిని సాధువృత్తమున్.

పిమ్మట నిట్లు జరిగెను.

చ. మునుకొని కాన కేగు రఘుపుంగవు వెంట మహీజ యేగుచోఁ
బ్రణిహిత పల్లవంబు లగుభామపదంబులఁ జూచి బంధుగుల్
గనుల సమంబుగా విడిరి గ్రాఁగిన వాక్కుపు డింకొకష్టు చ
ల్లని వయి ముత్తియంపు రచలం బఱమారుచు బాష్పబిందులన్.

గంగ:—ఔరా! హర్షవిషాదముల వైచిత్రిగదా యిది!

సర:—అంత బాంధవజనంబులు రామచంద్రు నీరీతి వేడుకొనిరి.

గీ. గోల జానకి, చపలాత్మకులరు మీరు,
దనుజచక్రనివాసంబు దక్షిణాశ,
చెప్పెదము నీకు మే ల్గోరి శిష్టచరిత!
పోకు మద్దెస మావల్కు బుద్ధి నిలిపి.

గంగ:—పిమ్మట నే మైనది?

సర:—

మ. సురవాదిత్ర గభీర ధీర నినదస్తోమంబు లుప్పొంగఁగా
హరిదంత ప్రుటన క్రియాచణ రణజ్జ్యా నొప్పు కోదండము౦
గరపద్మమ్మునఁ దాల్చి వేంజన దృక్సంపాది నీలోత్పలో
త్కర దామాంచితుఁ డై వడిం జనియె సీతాకాంతుఁ డప్పట్టునన్.

యము:—సురవాదిత్రము లపు డేల మ్రోసినవి?

గంగ:—సఖి! యెఱుంగవా? గంభీరభంగి మొరయు సురవాదిత్రము లెద్దియో గంభీరవిషయమునే ధ్వనింపఁ జేసినవి. (మరల విషాదముతో) హా! దశరథా! సకలసంపదలకు భాజనంబ వయ్యు నొకానొక భాగధేయంబునకు మాత్రము పాత్రంబవు కాఁజాలక పోయితివి గదా!

యము:—అట్టికుమారచంద్రుఁ బరిత్యజించినను మీ రాభూపతి నింత శ్లాఘించెద రేల?

సరయు:—పాపము శాంతించుఁ గాక.

శా. కైకేయీ వచనమ్మునన్ క్షణము భూకాంతుండు మోహాక్రుధా
స్తోకక్రాంత నిజాంతరంగుఁ డగుచున్ జోరుల్ వెస న్మ్రొట్టినన్
జీకాకుం బడు లోభి చేతిమణిని న్వీడంగ లేనట్లు దాఁ
గాకుత్స్థు న్విడ లేక పీడ తనువుం గట్టా! తృణంబుం బలెన్.

యము:—ఇది యెల్ల భరతున కభిమతం బయ్యెనా?

స:—మాతులగృహాగతుం డగుభరతునకును గైకేయికిని ప్రశ్నోత్తరంబు లిట్లు జరిగెను.

సీ. జననిరో! మాతండ్రి గనుపింపఁ డిది యేమి?
చనియె నాతఁడు దివమ్మునకుఁ దనయ?
ఏహేతువున నేగె నెఱిగింపవే తల్లి!
పుత్రశోకంబుచేఁ బోయె నోయి!
ఏపుత్రుఁ డతఁడు? మీ కెల్ల ముందటిబిడ్డఁ;
డే మాతసుకి? గాన కేగె నోయి!
ఏకారణమ్ముచే నేగె నమ్మ! యతండు?
జనకు పంపునఁ జేసి చనియె నోయి!

గీ. జనకుఁ డట్లేటి కనిచె నాతని? మదీయ
వాగ్విబద్ధుం డగుట, నేమి ఫలము నీకు?
నీకు రాజ్యంబు రాదొకో రాకుమార!
చెడితి పాపిని దైవమా! చెడితి నకట!

గంగ:—వత్సా! భరతా! రామచంద్రునికిఁ దమ్ముఁడవే సుమా!

సర:—పదంపడి

సీ. ఇనకులేంద్రుని పోక కెంతయుం దపియించి
యెట్టకేలకు ధైర్య మెనసి తెలిసి
ధర్మకర్మల సంప్రదాయమ్ము లెఱిఁగిన
తాపసేంద్రుల పంపుఁ దలను దాల్చి
యుచితమ్ము లగు సమగ్రోత్తరక్రియంచే
జనకు నింద్రనివాసమునకుఁ జేర్చి
భ్రాతృదుఃఖార్తిచే బంధులం గూడి నం
దిగ్రామమున వాస నియతి నూని

గీ. రఘుకులాధీశ్వరుని పునర్దర్శనంబు
నెమ్మదిని గోరి భరతుండు నిఖిలభోగ
సంచయంబుల వీడి పాలించె నంత
నీతినిపుణులు మెచ్చ సాకేతపురిని.

యము:—తరువాత నేమి జరిగినది.

సర:—నే నింతవఱకే యెఱుఁగుదును. తరువాతి వృత్తాంతమును దెలిసికొని రమ్మని నాజలము నందలి కలువవనము నాశ్రయించి యున్న యొకానొక కలహంసను బంపి యుంటిని.

[అంత కలహంసము ప్రవేశించును.]

హంస:—తల్లులారా! నమస్కరించు చున్నాను.

అంద:—ఓయీ కమలావతంసకా! కలహంసకా! మంగళము లగుఁగాక.

గంగ:—ఓయీ! మాబిడ్డల పయనంపుగాథల నొకటివిడువకుండ వక్కాణింపుము.

హంస:—

చ. వెనుకొని వచ్చు పౌరులను విన్నముగాఁ బలె నాపివైచి తాఁ
జనియె నయంబు నాఁగ రఘుచంద్రుఁడు ముందట, నంత భూమి నా
గ సతని వెంబడించె జనక క్షితినాథుని పట్టి, నాపె వె
న్కను సుఖలాభమో యనఁగఁ గ్రన్నన నేగె సుమిత్రపుత్రుఁడున్.

అవ్వలఁ గొంతదూర మరిగిన పిదప బాటసారులు కొందఱు మీచిన్నిసంతానమ్మునకు కిట్లెఱుంగఁ జెప్పిరి.

గీ. బాట చనరమ్ము పచ్చికబయలు నేల
ప్రబ్బలుల కెక్క వలివాగు పజ్జ నదిగో!
హంస కాదంబ రుతముల కాటపట్టు
కలను ముందట నొక్క చెంగలువకొలను.

మఱియు,

ఉ. అల్లదె ! బక్కజిక్కి బడుగై కనుపట్టెడు తేటవాతేఁగా, బల్
చల్లని నీడ నొప్పి మధుసారము లోడు మహీజ మయ్యదే !
పెల్లుగ సౌరభ మ్మొలయ భృంగనినాదము లుల్లసిల్ల ను
త్ఫుల్ల సరోజషండములఁ బొల్పగు తామరజొంప మియ్యదే !

గంగ:—ఆహా ! మార్గశ్రమాపహారకములు గదా యీ బాటసారుల వాక్యములు.

యము:—పిదప నే మైనది ?

హంస:—అంతఁ బ్రియవల్లభు ననుసరించి పోవుచు మార్గమధ్యమున

చ. హరిణవధూటి యొండు సభయమ్ముగఁ బాఱుట గాంచి సీత దా
గరుణ మెలర్ప మూసెఁ దనకాంతుని విల్లు పయింట గొంగునన్
వరిమడి గట్లఁ బ్రేమపడి పాణి యవాంకుర మొండు దీసి సుం
దరముగఁ గర్ణభాగమునఁ దాల్చె వధూమణి భూషణంబుగన్.

మఱియు నొకమాట,

మ. సరసీ తీరము లందు నిర్మల నదీ సామీప్య భాగంబులన్
వరుపార్శ్వంబు నిమేష మేని విడ నోర్వఁ లేని చక్రాంగనం
గరముఁ లోలములై నచూడ్కి లోలయుంగం జూచుచుఁ హర్ష శో
క రసాంభోనిధి మగ్న యయ్యె నపు డాత్మాపుత్రి మార్గమ్మునన్.

గంగ:—ఆహా! యెంత జాలి గలది మాజానకి! (మరల స్నేహముతో) మాబిడ్డ యెప్పుడును బాటసారుల నియమములఁ బాటించువారే కదా ?

హంస:—బాటసారుల నియమ మెట్టిది ?

చ. కమలకులాధినేత నలికాళల నుండెడు దాక నే ప్రయా
ణము, తపనాంశు లేచి కఠినమ్ముగ వెల్గెడువేళలన్ విరా

మము, జలజాప్తబాంధవవిమానము వ్రాలుడు వెండియుం బ్రయా
ణము, పయి నింక నిల్కడ మృణాళిని గన్నులు మూయుపట్టునన్.

హంస:— దేవీ! నిత్యమ్మును దారినడుచువారి కిట్టివొప్పు దుర్ఘటము.

గంగ:— కట్టా! మా జానకి కలుకుటెండల తాకులం గూడ నెఱిఁగెఁ గాఁబోలు.

హంస:— దేవీ! భీతిల్లకుము.

ఉ. చండకరుండు చిచ్చు వెదజల్లుచు మండెను పట్లఁ గూడ సీ
తాండజయానన తాప మిసు మంతయుఁ జెందక యుండె నమ్మరో!

గంగ:— అదెట్లు?

హంస:—

పండువుగాఁ గనుంగవకు వల్లభు మేను నవోత్పల ప్రభా
కాండము నెల్లదిక్కులను గ్రమ్మఁగఁ జేయుచు మ్రోలఁదోఁచుటన్.

గంగ:— వల్లభ ప్రణయాశీత యగు సీత కేవలముఁ దన్నే గాక మమ్మ దఱను గూడఁ బ్రదికించినది.

సర:— పాలింపను గూడఁ బాలించినది.

హంస:— పదంపడి

ఉ. మోటుజనంబులుం బదము మోపగ నోవని చాటుబాటలన్
గాటపు టెండకాకలకుఁ గంపిలి బీటలువాఱు చోటులన్
బాటిగ భర్త కాలిడినపట్టులు చల్వల పట్టు లట్టులా
బోటి దలంచెఁ బ్రేమరస పోషిత మై ధృతి పెంపు నొందగన్.

యము:— జనకా దినకరా! నీకుటుంబముపైఁ గూడ జాలి విడనాడితివి గదా!

సర:— దేవీ వసుంధరా! నీకుమారికపైఁ గూడ దయమాలితివి గదా!

గంగ:—వారి నేల నిందించెదరు! మహాభూతముల ప్రవృత్తులు స్నేహాదిగుణ సంచారము గలవి కావు గదా!

హంస:—తరువాత

ఆ. వె. అలయ నలయఁ బ్రణయ మొలుకఁ గాంతుఁడు వీచు
వల్కలంపుఁ గొనల వసుధ సుతయు
నాపె చూపుఁగొనల నల్లె యాతండును
నేవ దేఱి రంత సిరి దొలంక.

గంగ:—ఆహా! యెంత మనోజ్ఞ మీమాటప్పు!

యము:—పిదప నేమి జరిగినది.

హంస:—తరువాత,

చ. బడలి సలక్ష్మణుం డగుచు వల్లభుఁ డిల్ దరియంగ నట్టితా
నడుగులు కొన్ని ముందు జని యాతని చేతివిలున్ గ్రహించి యొ
క్కెడ నిడి క్రొంజివుళ్ళగమి నెంతయు వీచుచు నమ్మహీజ బ
ల్లిడనకు నెక్క నర్హవిధికార్య నివర్తన వైజయంతి నై.

ఇంకొక సరస పేశల మగు విషయమును జెప్పుచున్నాను వినుఁడు.

చ. జనకజ పాణులం గొలుచు చారుకిసమ్మల నుండి దోఁచు చ
ల్లనిపవనంపు టంకురములన్ నృపసూనుల లేతపెక్కు లం
దున నెలకొన్న ఖేదభవ తోయ మడంగెను కాని శోకన
ల్లనమున నుర్లి కన్గొనలఁ గ్రమ్మిన తోయ మడంగ దెంతకున్.

ఇంకొక విశేషము.

మ. అనుగుం దమ్ముఁడు తావు తావునను నయ్యైభంగులం జల్వ సే
వనలం దేఱి రఘుప్రభుండు మిగులన్ భాసిల్లు; సౌమిత్రియుం
దనవిశ్లేష మొకింత సైపని రఘూత్తంసుండు నీ ర్నించుచుం
ధను వీక్షించు కటాక్షమాలికలఁ బోనాడున్ నిజక్లేశమున్.

సర:—కలహంసకా ! బిడ్డ లెన్నిదినములకు రఘురాష్ట్రము నతిక్రమించి పోఁ గలిగిరి?

హంస:—దేవీ ! రఘువుల యాధిపత్యమే నీ కోరిక లేనట్లున్నది.

శా. ఆరా స్నగ్రమ సమస్తరాణ్ముకుట దీవ్యత్పద్మరాగప్రభా
భారోన్మాంసల పాదచంచల నఖభ్రాజిష్ణు లారాఘువుల్
దూరోన్ముక్త చతుస్సముద్రలహరీ ధూతాస్త శుక్తిస్థల
ద్రారాజ న్నవమౌక్తికాఢ్యవలయన్ రంజింత్రు భూమండలిన్.

ఉత్తరకోసలల మాత్రము మూఁడు నాలుగు దినములలోనే గడచిపోయిరి. పిమ్మట పురమథన మౌలిమాలతీమాల యగు మందాకిని నుత్తరించి యాపైని కలిందపర్వత కరికపోల మదవారిధార యగు కాళిందిని సైతమతిక్రమించి చనిరి.

సర:—గీ. అలల పేరిఁటి చేతు లంతంత లుంచి
యిన భగీరథ సుతలు చేసినది యేమి ?
అంటినం గందుజానకి యడవి కేగు
నెడను వారించిరే పట్టి యెవరు గాని.

గంగ:—సఖి ! పరోక్షంబునం బోలె సమక్షంబుననే నిందింపఁ జొచ్చితివి. యేమి సేయుదుము !

యము:—కలహంసకా ! తరువాత నేమి జరిగినది.

హంస:—పదంపడి, భిల్లవల్లభుల భల్లపాతమ్ములఁ బ్రేల్లిన వింధ్యపర్వత కుంభి కుంభమ్ముల నుండి వెలికి నిగుడుమౌక్తిక ప్రకరమ్ములచే నొడ్డునందలి లతావితాన పరిచ్ఛందంబులు మొగ్గ దొడిగి నట్లు గనుపట్టు చుండ శర్మద నైౖ రొయుప్పు నర్మదం దాటి, చపల కర్ణాంచలమ్ముల తాకున మదగజేంద్ర

కపోల భాగమ్ముల వీడి పఱతెంచు సహచరులం గాంచి యుఃప్పొంగు భృంగాంగనల కూటమ్ములచే మనోజ్ఞమ్ము లై కనుపట్టు కుసుమ కేసరమ్ముల పొత్తునం గనవండు వొనరించు గోదావరీ పరిసరమ్మున కభిముఖు లై వెడలిపోయిరి.

యము:—ఛీ ఛీ! యేమిపాప మిది! లంకేశ్వరుని చెల్లెలగు శూర్పణఖ సోదరుని పాశ్రిపున నోడ లెఱుంగక యవ్విధి గాఁ గ్రిమ్మరు చుండును.

హంస:—మిక్కిలియు నోడ లెఱుంగికి యమున. లక్ష్మణుం డొక నాఁడు తన కృపాణధారచే దానిముక్కు తరిగి తీవ్ర క్తధారల పేరి సురాసారముచు గ్రోలుకొను చుండు మని యాదేశించి దాని నచ్చట నుండి తఱిమి వైచెను.

గంగ:—(సాతంకముగా) జనస్థానవాసు లగు రాక్షసు లావార్త విన్నచో నూరకుందురా?

హంస:—భయంకరమ్ము లగు వివిధాయుధమ్ములం బూని యారాక్షసవీరు లందఱును రామునిపై దండెత్తివచ్చిరి.

గంగ:—అటుపై నేమి జరిగినది.

హంస:—అంత సౌమిత్రి రామభద్రునిఁ జేరి యిట్లు విన్నవించెను. ఆర్యా!

ఉ. క్రూరపుఁజుప్పనాతి మృదుఘోణను బుట్టిన శోణితంపుధా
రారుచి చేత శాత మయి రాజులు మత్కరవాల మానఁగాఁ
గోరుచు నున్న దిప్పుడుల ఘోరనిశాచర కంఠపీఠికా
స్ఫార వసావసేక పలసంచయ పంకిల రక్తధారలన్.

అది విని రాముఁ డిట్లు త్తర మిచ్చెను. వత్సా! అగుఁ గాక. అబలాజనమ్ములు ప్రకృతిభీరువు లని నీ వెఱుఁగుదువు గదా! కావున

క్షిడ్గహస్తుండ వై జానకి యున్నయీపర్ణశాలను గాపాడు చుండుము. నేను నతిత్వరితకాలమ్మునసే (అని యర్ధోక్తి యందే) వెడలిపోయి రాక్షసులతో సంగరమ్మున కుపక్రమించెను.

గంగ:—(భయముతో) పిమ్మట నేమి జరిగినది ?

హంస:—

మ. ఘనసంగ్రామ జరూభిలాష జనితోగ్రక్రోధ భారోల్లస
ద్ధ్వనిచే దిక్కులు బూటిల్లఁగ సుమిత్రాపుత్రకుం బిల్చె నం
త నిమేషమ్మున

స:—రాముఁడా పిల్చినది?

హంస:—కాదు కాదు.

స:—దేవి భాగీరథీ! యింక నేది దిక్కు? తప్పక నిశాచర సంఘము పిలిచె నని చెప్పను.

హంస:—

రాక్షసాధమ వధార్థం బప్పు డేమాత్రమో
కనలుం గొన్నరఘుప్రకాండుని మహాకాండాసనం బిమ్ములన్.

సర:—అదృష్ట వశమున జీవించితిని. తొలుత నిప్పులు గురిసిన సుధావర్ష మిది.

యము:—పిదప నే మైనది.

హంస:—తపవాత ముదిత మానసు లైన మునిజనమ్ముల సాధు వాదమ్ములు వినుచు మహావినోదమ్ముతోఁ గొన్నిదినము లచ్చోటఁ బుచ్చిరి. అపయిని,

క. కెంపుం గన్గవయును బవ
డంపు న్నిడుగోమ్ములును గడానియొసల్ ము

త్రెంపుం జిటికలలును దీ
పింపగ వని నొక్క లేడి వెలువడె బెడఁగై.

గంగ:—(తనలో) నిక్కముగ నిది యనర్థాంకురము. ఆపయి నేమి జరిగినది ?

హంస:—

చ. కనుబొమ తీరు లీల సుమకాండుని వింటిని గెంటు, నీటు పెం
పున విలుసారు బోంట్ల కనుబొమ్మల దవ్వుల దోలఁ, బ్రసన్నసం
జనియె మృగంబు వెంట నలజానకి మాటకి తోడ రాఘవుం
డును జత యై నవోత్సవ పటుత్వము నొంచు రుమల్ వెలుంగఁగన్.
తరువాత,

చ. భయమున దవ్వు దవ్వులకుఁ బాఱుమృగమ్మును వెంటనంటి వే
పయనము సల్పు భూమిసుతభావ మెఱింగి ధనుశ్శరంబులం
గయికొని లక్ష్మణుం డరిగెఁ బ్రసన్నన నాశ్రమ భూమి నుండి; యా
పయి దరియంగ వచ్చె బ్రమతభంగిని భిక్షుకుఁ డొక్కఁ డెవ్వఁడో!

గంగ:—పిమ్మటి గాథ వివరింపుము.
హంస:—అనంతరము,

చ. కరుణ దొఱంగి రాఘవుఁడు కామ్మక మెత్తి శరంబు లేడిపైఁ
బఱపుటయు న్నిజాగ్రజుని పాలికి లక్ష్మణుఁ డస్త్రపాణి యై
యరుగుటయున్ మహీజ యతిహస్తతలమ్మున భిక్ష సేతయున్
సురపథవర్తి నై యొకటఁ జూచితి నే నివి యెల్ల జాహ్నవీ!
సర:—తరువాత
హంస:—పదంపడి

ఆ. వె. పైడిలేడి పైని బాణమ్ము వడఁ జూచి
కదలఁ గాళ్లు రాక కనులు మోడ్చి

యీచరిత్రి నీకు నెఱింగింప నిపుడు నే
వ్రాలినాఁడ నీదు కూల మందు.

ఇఁక నాకు సెల వొసంగుఁడు. సలిలావగాహనంబునకుఁ ద్వర పడు చున్నాను.

ముగ్గురు:—

మ. పరిశుద్ధం బగు వారి పూరములచే భాసిల్లి పంకేరుహో
త్కర సంపత్తిని గన్నువందు వగు నీ కాసార దేశంబునం
బురనారీ చరణాగ్రనూపుర రవస్ఫూర్తి న్విడంబించు సు
స్వరముల్ మీఱఁజరింపు మియ్యెడను హంసా! పక్షివంశోత్తమా!

(హంస నిష్క్రమించును.)

గంగ:—సఖి సరయూ! ఈ వృత్తాంత శ్రవణమ్మున హృదయము కలఁగి పోయినది సుమా!

సర:—దేవీ! కలంత యేటికి? ఈ నూపుర ప్రస్తావముచే నా కొక విషయము స్మరణకు వచ్చినది. సీమంతినీ రత్నమ్మును సతీతిల కమ్ము నగు నరుంధతీ దేవి హస్తమ్మున రెండు నూపురమ్ములం గొని వనగమన సమయమున జానకిం దరిసి యిట్లు వ్రాకుచ్చెను.

గీ. నునురవము లీను నిమ్మణీ నూపురముల
నడుగుఁ దమ్ములఁ బూన్పు మొయ్యన మృగాక్షి!
కలుగ దేపూట నెడబాటు కాంతుతోడ
వీని మహిమమ్ముచే మృగీవీక్షణలకు.

అంత జానకియు నట్లే చేసెను.

గంగ:—ఇప్పు డొకించుక యూరట గలిగినది. నాసఖి యగు వసిష్ఠ గృహిణి సత్యవాదిని. కావున నీవృత్తాంతము రఘుకుల వత్స ళుండగు సాగరున కెఱింగింతము రమ్ము. (పరిక్రమింతురు)

గంగ:—విస్మయముతోఁ బ్రవాహవేగమున నిమిషమాత్రముననే చాలదూరము వచ్చితిమి. అదిగో! నదీనాథుఁడు చెంతనే గోదావరితో నేమియో మాటలాడుచున్నాఁడు.

(అంతగోదావరియు సముద్రుఁడును ప్రవేశింతురు.)

సాగ:—అనంతర మేమి జరిగినది?

సర:—ఏమిది! ఇక్కడఁ గూడ నేదియో వృత్తాంతశేషము ముచ్చటించుచున్నారు.

యము:—వే జేముండును? హంస మనకుఁ జెప్పినగాథ కవ్వలిదై యుండును.

గోదా:—ఆపిదప.

శా. రామోన్ముక్తశరంబు హృత్స్ఫుటము జీరన్ జాఱువాలేడి దో
డ్తో మారీచనిశాటుఁ డయ్యె రుధిరస్తోమంబు మై నిండఁగన్;
హేమస్ఫూర్జిత రత్నకుండలవిభా దృప్యత్కపోలస్ఫుర
ద్భీమాస్యంబుల తోడ నయ్యతియు దైతేయేంద్రుఁ డయ్యెంద్రుటిన్.

గంగ:—కష్టా! చెడితిని. (విమర్శించి) అయినను కలవు గదా వసిష్ఠగృహిణి యిచ్చిన మణినూపురములు.

సాగ:—మాకోడలిని నిశాచరుఁడు ముట్టుకొనెనా యేమి?

గోదా:—ముట్టుకొన లేదు.

సాగ:—అ దెట్లు?

గోదా:—

చ. ఖలమతులైన దైత్యుల నికాయపు స్పర్శము నడ్డుకొంటకై
సులలిత ధీనిశాల యనసూయ ప్రియంపడి యిచ్చినట్టి మై
కలపము నుండి పచ్చజిగి గ్రమ్మెను చిచ్చుదయించి కల్వరే
కుల గతి చల్లనై యలమె గొబ్బున భూతనయా తనూలతన్.

సాగ:—ఆహా! యేమి యీయత్త్రిపత్నీ ప్రభావము!

గోదా:—పిదప వరుణమంత్ర ధ్యానమ్మునఁ జేకూరిన మేఘశకలమ్ములఁ జేతులకుం దొడిగికొని నిశాచరాధముఁడట్టి కేలకు జానకిని ముట్టి పట్టుకొనియెను. తదనంతరము,

శా. హా రామా! జగదేకవీర! రమణా! హానాథ! లోకేశ్వరా!
హా రాజీవ హితాన్వయాభరణ! దేవా! నన్ను వీక్షించ దే
చేరన్ రావె యటంచు నేడ్చు మహిజం జేకొంచు దుష్టాత్ముకుం
డారాత్రించరవీరుఁ డేగెను నభోయానంబు సంధిల్లఁగన్

సర:—దేవి భాగీరథీ! మనదురదృష్ట వశమున నరుంధతీ వచనములు గూడ నసత్యము లగును గాఁబోలు.

గంగ:—అట్లెప్పుడును గాదు.

సాగ:—పిమ్మటి వృత్తాంతముఁ గూడఁ జెప్పుము?

గోదా:—అంత సమీపశైల శిఖరంబు నధిష్ఠించి యున్న విహంగమేశ్వరుఁడు జటాయువు దారి నరికట్టి రావణునితో నిట్లనియెను.

ఉ. ఓరిదురాత్మ! రాముసతి నుగ్రశిర శ్శశిరేఖకం బలెం
జోరత మై హరించెదవు సూడవె నన్నుఁ, బ్రదీప్తరత్నసం
భారము లైన మస్తములు వాఁడి నఖమ్ములఁ జీల్చి నిన్ని దే!
ధారుణిఁ గూల్తుఁ, దార్క్ష్యుఁడు సుధారతుఁ డై నభుజంగునిం బలెన్.

గంగ:—ఇది యానూపురముల యనుగ్రహము.

సాగ:—(హర్షముతో) పిమ్మట నే మైనది?

ఉ. కొండలఁ బిండిసేయఁ గలఘోరనఖమ్ముల రాక్షసేంద్రు మై
కండలు సించి హేమమయ ఘంటిక లొప్పెడు తంద్రథంబునే

ఖండన సేయ నేరిచెను గాని జటాయువు సీత నేఁచు న
ద్దుండగు దుర్మనోరథము దూలుప జాలక పోయె నెట్టులున్.

సాగ:—తరువాత నేమి జరిగినది.

గోదా:—పిమ్మట వాడి యై యొప్పు జటాయు గోటిపోటుల చేతను రావణుని కటారుపోటుల చేతను భయంకరం బైన సంగ్రామ సంరంభ సమయమున జానకి రావణుని కరస్థలంబుననే యుండ.

చ. పులుకు పులుక్కు మంచుఁ గృప వుట్టెడు నట్టుల నేమొ యేడ్చు న
ట్లులియుచు నాపెపాదమున నుండి తొలంగిన యందె తోడనే
నిలు నిలురా దురాత్మ! యిదె నీల్గితి వంచు దశాస్యఖడ్గ ని
ర్దళితుఁడు తజ్జటాయువును దవ్వుల నుండి బడెన్ ధరిత్రిపై.

సాగ:—కట్టా! జానకీ! యిఁక నిశాచరుని కగ్గ మైతివిగదా! (మూర్ఛిల్లును.)

గంగ:—(సమీపించి చేలాంచలమున వీచుచు) రఘుకుల వత్సలా! యూరడిల్లుము.

సాగ:—(ఊరడిల్లి) ఇక్కడ గంగ గూడ నున్న దే!

గంగ:—యమునా సరయువులు గూడ నిచ్చటనే యున్నారు.

సాగ:—అట్లయిన మీరందఱుఁ గూడి నన్నుఁ బట్టుకొనుఁడు. ఇదిగో! నేను శోకప్రవాహమున నడఁగి పోవు చున్నాను.

గంగ:—భీతిల్ల వలదు.

గీ. ప్రాయికమ్ముగ భువిని సంపదలు గూడ
నాపదలఁ గూర్చుఁ గడకు దురాత్మకులకు;
ఆపదలు గూడ నట్లె మహాత్మకులకు
సంపదలఁ గూర్చుఁ దుదకు నిస్సంశయముగ.

సర:—సఖీ గోదావరీ! జాఱిపోయిన యానూపుర మేమైనదో నీ వెఱుఁగుదువా?

గోదా:—ఎఱుఁగ కేమి? దాని నెవ్వఁడో యొక వానరుఁడు గైకొని ఋష్యమూక శైలాభిముఖుఁడై పోయె నని వనదేవత చెప్పినది.

సాగ:—ఇఁక రామభద్రుని వృత్తాంత మేమి?

గోదా:—రామభద్రుఁడును సీతావియోగంబుచే గాసిల్లుచు సౌమిత్రి నూఁతగాఁ గొని యాదిక్కునకే తరలిపోయెను.

(తెరలో)

సఖీ కాళిందీ! వర్ధిల్లుచున్నావు సుమా!

యము:—రోకటిపోటులం బడి నలిగియున్న నాగోళ్ళకు లత్తుకరసంబుఁ బూయుచున్నదే యీపె యెవరు?

(తుంగభద్ర ప్రవేశించును)

తుంగ:—జయము నదీనాథా! జయము.

సాగ:—తుంగభద్రా! కాళింది వర్ధిల్లుట యెట్లు?

తుంగ:—ఆపెసోదరుఁడు సుగ్రీవుఁడు చక్రవర్తి యయినాఁడు గనుక.

యము.—ఒకప్రక్క యెండకు మాడు చుండ మఱియొకప్రక్క చందనంబున దోఁగు చందమైనది నాబ్రదు కిప్పుడు.

సాగ:—వాలివశ మందున్న రాజ్యలక్ష్మి యిప్పుడు సుగ్రీవుని కెట్లు లభించినది?

తుంగ:—ఇంకను గూడ వాలి యెక్కడ?

సాగ:—అదేమి ?

తుంగ:—హనుమంతుఁడు నూపురముతోఁ గూడఁ దన్నును సుగ్రీవుని రామచంద్రుని కర్పించికొన వారియందు దాతఁడు విశ్వాస ముంచి ప్రవర్తించిన విధ మిట్టిది.

సాగ:—ఎట్టిది ?

తుంగ:—

ఉ. భానుకులుండు లీలమెయి వాలిని హేమమృగంబు నట్లు ని
ర్యాణము నొందఁ జేసి తనప్రాపునఁ జేరిన భానుపుత్రుసిన్
వానర వంశరాజ్య పదభద్రునిఁ జేసి దశాస్య మిత్ర ని
ర్వాణునిగా నొనర్చి యలరించె నిజాన్వయనాథు నర్కునిన్.

సాగ:—తరువాత నేమి జరిగినది?

తుంగ:—అంత సుగ్రీవుఁడు

ఉ. వాడి సువాసనల్ దొఱఁగి వాలినమాలిక లీల నొప్పు పూ
బోఁడిని సూర్యవంశవధువున్ వెదకుం డిఁకఁ దావుతావునం
దోడక మీర లంచుఁ గపియోధుల నక్కముదాంగ దాదులన్
గాడుప్పపట్టి నాయకుఁడు గాఁ జనఁ బంచెను మూల మూలకున్.

సాగ:—ఇపుడు జీవించితిని.

తుంగ:—నీ వొక్కఁడవేనా? ఇపుడు లోక మంతయును జీవించినది.

సాగ:—అవును రామచంద్రుని యందుఁ దీపి లోకమంతకును గలదు. మఱియు దీనిని బట్టి యూహించికొనుము.

చ. సరయువు పజ్జఁ బాయనిది, సారస మిత్రజ యాపె, నేను సా
గరుఁడ, భగీరథప్రభవ గంగ, విచారణ సేయ నిట్టి చు

ట్టరికమె మాదు కూరిమి కిటం దగు కారణమేని మీరలం
దఱు నది యేల ప్రేముడిఁ గొన న్వలెసెన్ రఘురామ చంద్రుపై!

(పైకిఁజూచి విస్మయముతో)

మ. పిడుగుం బోటున కంఠకుండ గరులం బెంపారె మైనాకుఁడో
కృంకఁడె, నాలోనన డాఁగె నాతఁ, డిఁక నీగ్రావం బెదోకాని యి
య్యెడ గవ్యూతికిఁ గూడ నెక్కుడగు మై యేపార న న్నిట్టు లిం
త లఘుప్రక్రియ దాటఁజొచ్చె నిది వింధ్యంబో హిమాహార్యమో!

కానఁ బోదము రండు. ఇ దెద్దియో నిరూపించికొందము.

(అందఱును నిష్క్రమింతురు.)

గద్యము.

ఇది శ్రీమ దత్రికులాత్రేయ కవిరత్న బిరుద ధౌరేయ శ్రీమ
దెరమిల్లివంశ పయఃపారావార సుధాకరాయమాణ
నారాయణ ప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త
కుశేశయ కొండలరాయ నామధేయ
ప్రణీతంబైన ప్రసన్న రాఘవ
నాటకంబునఁ బంచమాంకము
సంపూర్ణము.

వా యిర వేర్పరించి యుబు సాడితివో నిజకాంత తోడ న
న్నా ! యలినాథ ! తెల్పు మలనాదుప్రియామముఖి మీడ నున్నదో.

లక్ష్మ:—(వెఱపుతో) వెవ్వేలు వస్తువులం దిలకించు కొలఁది నార్యుని మానసము దుఃఖమున కగ్గమగు చున్నది. కాన నీ విహంగ మార్యుని కంటఁ బడకుండుఁ గాక.

రాము:—(దానినే చూచి) ఇది యేవిహంగమో !

చ. ప్రలసిత కుంకుమాభ మగురాగము బాహిర మందు, లోన మే
రలు గనరాని మేలియనురాగము నూను నెడంద తోడ నీ
పులుఁ గిపు డేటి కవ్వలను బొల్చెడుగట్టున బిట్టు నార్చు నె
చ్చెలిదెసఁ జూడఁ గాని దరిఁ జేరదు కాలమహాత్వ మెట్టిదో! 6

నిక్కముగ నీవిహంగము ప్రియావియోగమ్మున హృదయమ్ము బ్రద్దలై పోవ బెంగఁగొని యున్న యొకానొక చక్రవాకము గానోపు.

లక్ష్మ:—కట్టా ! యెంత ప్రమాదము !

రాము:—సమదుఃఖముచేత నిక్కముగ నిది యొక్కటియే నా కుద్దియై యున్నది. (విమర్శించి) అట్లును గాదు. దీనికిని నాకును నుద్ది యెక్కడ ?

ఉ. పాటిలు రేల దీని కెడబాటు ప్రియాంగన తోడ, వెండియుం
గూటమి గల్గెడుం బగట, ఘోరము లిట్టినిశల్ పనళ్లు నీ
నాటికి నాఱుదాటె చనినం దెగ డయ్యెను నాకు జానకీ
పాటలగంధి తోడి యెడబాటు కటా ! యిఁక నేమిసేయుదున్.

లక్ష్మ:—ఆర్యా ! కనులు మూసి యున్న తామరతీవె దాపున కేగు చున్న యీకలహంసముపై నొకసారి దృష్టి నురలింపుము.

రాము:—(చూచి)

చ. తన ఘనగోటి నొక్కులకుఁ దామరపూఁ జయదోయి దూల పే
ర్చిన యెలదేఁటి మ్రోఁత మిషచేతను మూల్గుచు బిట్టుఁ దాఁకు సో
ముని పదస ప్రహారముల మూర్ఛ మునింగిన తమ్మిలీవియం
గని దురపిల్లు చున్నది వగం గొని యీకలహంస మక్కటా!

కట్టా! యిట్టిజంతువులకు గూడ సహచరీ జనమ్ములమీఁది
జాలిచే చిత్తము మెత్తపడు ననుట యెంతయు బ్రశంసనీయము.
కాని నిసర్గకఠినుం డగు రాముని చిత్తము మాత్ర మట్టిది గాక
పోయెఁ గదా!

లక్ష్మ:—ఔరా! యే మిది? ఈధీరాగ్రేసరుని మానసమువ నింకను
జానకీ సంబంధ మగు నింద్రజాలము నిగుడుచునే యున్నది.

(తెరలో)

సఖా రత్నశేఖరా! యెంతకాలమున కగుపడితి వోయి!

లక్ష్మ:—(విని) ఏమిది?

(మరలఁ దెరలో)

నెచ్చెలీ చంపకాపీడా! నే నింతకాలమును నఖిలమాయానిధి
యైన మయునిపుత్రికయు తనసహోదరియు నగు మండోదరి
నూ రార్చుచు లంకయందున్న చిత్రరూపుఁ డను దానవుని
యొద్ద నింద్రజాలము నభ్యసించు చుంటిని. అందుచేఁ జిర
కాలము నీకుఁ గానరా నైతిని.

లక్ష్మ:—ఇట నెవ్వరో యిద్దఱు విద్యాధరులు చెవి కింపు గొల్పు
సంభాషణము సల్పు చున్నారు.

(మరలఁ దెరలో)

సఖా ! రత్నశేఖరా ! మఱి నీవిద్దె యేమేని నాకుఁ జూపెట్టెదవా ?

(మరలఁ దెరలో)

వయస్యా ! చంపకాపీడా !

క. సుర గరు డాసుర చారణ
నర కిన్నర సిద్ధ సాధ్య నాగులలో నె
వ్వారిచారిత్రము నిప్పుడు
పరికింపఁగ నీకుఁ గోర్కి బాటిలుఁ జెపుమా! 9

పోని మ్మేదో యెందులకు ? ఈ నడుమనే లంకయందు జరిగిన యొకానొక విచిత్ర చరిత్రమును జూపెట్టెదను చూడుము.

లక్ష్మ:—ఆర్యా ! యిది వినుము. మన కిప్పు డొక చూడఁ దగిన ప్రదర్శనము తనంతఁ దా సిద్ధించినది.

రాము:—(వినిపించికొనకయే)

* శా. తీరైనట్టి మణీపరంపరల నెంతేఁ బొల్పు నీపాద సం
జీరంపు న్నినదమ్ములం బెదరి దేవీ! హంస లిట్టట్టులుం
బాఱన్ లక్ష్మణపాదముద్రితము లై భాసిల్లు గోదావరీ
తీరంపుం బులినమ్ము లీయవి సుగాత్రీ ! వీని వీక్షించితే ! 10

లక్ష్మ:—ఆర్యా ! ఇచ్చట జానకి యెక్కడ ? గోదావరి యెక్కడ ?

---

* ఉ. దేనిరో! తావకీన పదదేశ రణన్మణినూపుర ద్వయీ
రావ పరంపరోత్తరళ రాజమరాళ కులాకులంబు లై
భావుక లక్ష్మణాంఘ్రి నవపంకజ ముద్రల నొప్పు చున్న గో
దావరి సైకతమ్ము లివి తన్వీ ! యిటుల్ మరలింపు చూడ్కులన్.

రాము:—(విమర్శించి తనలో) ఔరా! మతివిభ్రమ మెంత పని జేసినది? పోనిమ్ము ధన్యుఁడ నైతిని. ఏ మన

మ. ఇరుపార్శ్వంబుల యందునుం బలసి న న్నే వేళ సౌమిత్రియున్
ధరణీజాతయుఁ గొల్చి రాఁగ నలగోదాతీర ఋష్యాశ్రమో
ర్వరలం దెయ్యది నాకుఁ బూర్వము క్షణప్రాయంబు లై యేగెనో
మరల న్నే నిపు డాదినంబులె స్మరింపం గంటి నిక్కంబుగన్. 11

(మఱల నాసతో)

ఉ. భావము హర్షపూర్ణ మయి భాసిలఁగాఁ దటవీధి నిల్చి గో
దావరి లోని యూర్ములయుఁ దమ్ములయుం గుతుకంపుఁ జిత్రచే
ష్టావళిఁ జూచితే రఘువరా! యని పల్కిన నాఁటిపక్ష్మలా
క్షీవచనామృతంబుఁ జెవి చేరల నే నిఁక జుట్టి నేర్తునే! 12

(తెరలో.)

గీ. పిచికా చామరమ్ముల విసరి విసరి
పట్టినది నీకుఁ గమలాతపత్రి మిపుడు
చోద్య మగుఁ జూవె! గౌతమి చొప్పు సూడ
రమ్య తనురేఖికా సాంద్ర! రఘుకులేంద్ర! 13

రాము:—(హర్షముతో) అదియే నాప్రేయసీ సమాలాపము. నిక్కముగ నదియే.

సీ. క్రొలది యై మిగులఁ గోమల మై విరాజిల్లి
కడు ముద్దులం జిల్కు నుడిబెడంగు
తీయ నై తిన్న నై తీఁగ దీసిన ఏతి
సరససంచార మై సాగు రేఖ

చంచద్విపంచికా పంచమస్వరముతోఁ
జెలికార మొనరించు గళరవంబు
కలకంఠకామినీ కంఠనాదముతోడ
నద్దిమై యయ్యాల లూఁగు శ్రుతియు

గీ. అన్య దుర్లభ చిహ్నంబు లనువు పడఁగ
నంత కంతకు మిగుల నింపై దనర్చి
విందు గావించెఁ జెవులకు వినుకొలందిఁ
దప్ప దియ్యది ధారుణీతనయ పలుకె.

కాని ప్రేయసి గానరా కున్న దేమి : (చూచి) ఇదేమి చంద్రుఁడు లేని చంద్రాలోకమా !

(క్రిందం జెప్పఁబోవు రీతిని జానకి ప్రవేశించు చున్నది.)

రాముః—(తొందరపాటుతో) ఇది గో ప్రేయసి యెదుట నున్నది. (సమీపింప నుంకించును.)

లక్ష్మః—(రాముని బట్టి నివారించి) ఆర్యా! తొందర పడకుము. విద్యాధరుఁడు సూపు చున్న యింద్రజాలము గదా యిది !

రాముః—(చక్కగాఁ జూచి) ఔరా! యేమి యీకల్పనా విశేషము !

సీ. వలుదమై యొప్పు లేబాహువల్లరి తోడి
కేలొకం డశోకశాఖకను బెనఁగఁ
దక్కొండు పవలింటి జిక్కరాయుని లీలఁ
జాలిపోయిన చెక్కపయి మెలంగ
రతనాల మొలనూలి జతలేని పిఱుఁదుపైఁ
గురుల మొత్తము జాఱి విరియఁ బాఱ

బాష్పగుచ్ఛములచే వాచి తెప్పలచాలు
కన్నుఁదామరలపైఁ గదలియాడఁ

గీ. సేవ లాశోక శాఖ శాఖకయె తనకు
నర్మసఖి యట్టు లవలంబనమ్ము గాగ
నిదురఁ గూఁకిన దక్కటా! నిశ్చయముగ
జనక భూమండలాధీశు ననుఁగుఁ దనయ. 15

నిక్క మట్లే తోఁచు చున్నది.

గీ. మొనసి నలు పైన లేఁగల్వ మొగ్గ పోల్కి
బాదలు మన్నది నయనంబు మూతవడుచు
సడలి యున్నవి గాత్రముల్ సైత మవిగో!
రాలి పోయిన లేజాజి పూల లీల. 16

(మఱల విమర్శించి) నిక్కముగ నిపుడీ చపలాక్షి హృదయమునఁ బ్రమోదముం గొలుపు నట్టి స్వప్న మేదే గాంచు చుండ నోపు.

గీ. కలవరింపుచు మాటాడఁ గడఁగుః కతన
నదరు చున్నది పెదవి లేయాకు కరణి;
తెరలి పడుచున్న వవిగో! ముత్తియము లట్టు
లవిగ శానంద బాష్పబిందువులు జడిగ. 17

సీత:—(కనులు తెఱచి) కట్టా! యీ జీవలోక మంతయు వేఱువిధమై కనుపట్టు చున్న దే! ఛీ! ఛీ!

గీ. తలఁచి చూడంగ గౌతమీ తటిని యేడ
రమ్య నీలోత్పలాంగుఁడా రాముఁ డేడ
లంక యేడను? రామైక లక్ష్య యగుచు
జీవితం బుగ్గబట్టు నీసీత యేడ? 18

(మూర్ఛిల్లును.)

రాము:—(భూమినిఁ గూర్చి) వసుంధరా!

శా. త్రైలోక్య ప్రమదాఘ రత్న మగు నేతన్వంగి నీలో మునుం
బ్రాలం గల్గుట రత్నగర్భ యను సార్థఖ్యాతి నీ కబ్బెనో
యాలోలాలక సీత సోలి యిటు నీయంకస్థలిం బొర్లఁగా
జాలిన్ బ్రీలవు, నీకుఁ జెల్లుఁ జుమి! యాసర్వంసహాభిఖ్యయున్.

కావున సీత నూరార్పు మని యామెను బ్రార్థించి చూచెదను
గాక. ప్రార్థించిన మాత్ర మేమిలాభము?

గీ. తాను గన్నట్టి బిడ్డయే యైనఁ గూడ
సీత నూరార్ప దయ్యె నీ భూతధాత్రి
యెంచి చూడంగఁ గఠినప్రకృతుల కకట!
కన్నకాన్పన నైన నెక్కడిది కరుణ?

కావున నీ యశోకునిం బ్రార్థించెదం గాక.

గీ. క్రొంజిగురు కేలఁ దుంపురుల్ గురిసి కురిసి
శీఘ్రముగఁ దేర్పుమా సీదు చెలి నశోక!
నిబిడ మై కాదు తనకంటి నీటి తోడఁ 21
దేల్చెదే యీపె నీపాదు దినదినంబు.

ఈతఁడు నామాట సరకు సేయుట లేదు. ఔరా! యేమి యీ
పలాశి కృతఘ్నత!

కట్టా! ఇంతటి నోటి మంచితనము గల నాప్రేయసి కిచ్చోట
సఖీజన మొకర్తును లేక పోయెఁ గదా!

(త్రిజట ప్రవేశించును.)

త్రిజ:—సఖి జానకీ! యూరడిల్లుము లెమ్ము.

సీత:—(ఊరడిల్లి) నాప్రియసఖి త్రిజట వచ్చినదే!

త్రిజ:—సఖీ ! నేఁటి నీముఖరేఖను బట్టి నీ కేమేని ప్రియదర్శనము గలిగియుండు నని యూహించు చున్నాను.

సీత:—అవును. గోదావరి తరంగచామరములతో విసరుచు పుండరీ కాతపత్రమును స్వహస్తములతోఁ బట్టి సేవించు చుండ స్వప్నమున నార్యపుత్రుని సందర్శించితిని.

త్రిజ:—అట్లయిన జీవించితిమి. ఇది సుఖస్వప్నము సుమా !

సీత:—నిరంతరము శ్రీరామచంద్రునే ధ్యానించు చుండు నాకు స్వప్నమున నేఁటినమ్మకము.

త్రిజ:—అట్లయిన నిది నిరంతరధ్యానమునఁ గలిగిన స్వప్న మందువా ? కాదు. అదియు నిట్లపూర్వముగా నుండదు.

సీత:—అపూర్వ మన మెట్టిది ?

త్రిజ:—ముందు తలపోయనిది.

సీత:—

గీ. ఎపుడుఁ దలపోయ నట్టివి యెన్ని యేని
జరుగు చుండుట చూడమే జగతి లోన
రామచంద్ర ముఖేందు దర్శనము లేక
బ్రదుకు చుండుట లేదె యీపాడు సీత. 22

కావున నీస్వప్నముతోడ నేమి ? జీవితము తోడ నేమి ? ఆర్య పుత్రుఁడు న న్నుపేక్షించి నాఁడుగదా !

రాము:—ఎంతమాట! ప్రేయసీ ! హృదయముననే నివసించుదాన వయ్యు నాచిత్తవృత్తి నెఱుంగఁ జాల వైతివి.

సీత:—అట్లనుటకును వీలులేదు. హరకిరీటమందలి బాలచంద్రునకుఁ గళంక ముండునా? నిక్కముగ నార్యపుత్త్రుఁ డింతవఱకును నాదురవస్థ నెఱిఁగి యుండఁడు!

రాము:—ప్రేయసీ! యిప్పుడు యథార్థము దెలిసికొంటివి.

సీత:—

గీ. వదరుబోతయ్యె నూపుర ప్రవర మేని
నాథునకుఁ దెల్ప దయ్యెను నాయవస్థ;
ఏల ప్రయివెట్ట నోరులపై నిట్టు లకట!
దాని నోరును బడ నేమొ దైవహతిని. 23.

(తెరలో)

ఓలంకాపుర నివాసులారా! యిటు వినుండు వినుండు.

ఉ. పోటుమగం డెవండొ కపిపుంగవుఁ డొక్కఁడు కోటగోడలం
దాటి పురంబుఁ జొచ్చె మెయిఁ దాల్చిన క్రోధము నాగ నుగ్రుఁడై;

(ఇద్దఱును భయము నటింతురు)

పాటెలు నల్కఁ గన్నుఁగవ బల్మిఁ నిప్పుక లుర్ల నక్కపిన్
గీటడఁగింతు నంచు నరిగెఁ నృపపుత్త్రకుఁ డక్షుఁ డి త్తఱిన్. 24

సీత:—సఖి! నేలతోఁ గూడ నశోకవన మంతయుఁ గంపించుచున్న దేమి?

త్రిజట:—(విమర్శించి)

ఉ. ప్రాణము కంటెఁ గూడ రఘురామునికే కడుఁ గూర్చు సాధ్వివై
భానుకులంపు టున్నతికి వన్నియ వెట్టిన నీమహాత్త్వముం
గానక పండువెన్నెలల కాకకు గాసిలి దానవేంద్రుఁ డె
ట్లో నిను బుజ్జగింప వెడలెన్ వనవీధికి మానినీమణీ?

(సీత భయము నటించును)

(అంత రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

(సీత పరాఙ్ముఖ యై యుండును.)

రావ:—సుందరీ జనకేంద్రనందినీ!

చ. హరికరి దంతరోపణ కిణాంకిత సర్వజగ జ్జయంబు, ని
ర్జరతరుణీ స్తనస్తబక చ్ఛంగన చౌర్య కలంకితంబు నై
పరగెడు నాయురం బిప్డు భావభవ జ్వరతాప వేదనన్
దొరలు మహాశ్రుపూరముల దోఁగుచు నున్నది నీ నిమిత్త మై 26

సీత:—(వినిపించి కొనక యే) మరల నింక నెన్నటి కేని రామచంద్ర
ముఖచంద్ర దర్శనము కలదా నాకు?

త్రిజ:—జానకీ! యీ లంకేశ్వరుని ప్రేలాపనచందమ్ములైన నవధ
రింపుము.

రాము:—మేలు త్రిజటా! మేలు. ప్రేలాపన యని తగినట్లు వచించితివి

రావ:—

మ. ముదు సంప్రీణితుఁడైన శూలికి పునర్మ్యామస్తముల్ మొక్కుచోఁ
దన ఛేదోత్సవ మాపె నీతఁ డను క్రోధస్ఫూర్తి మై నెద్ది వం
దనముం జేయదొ యట్టి నాదశమ మస్తం బియ్యదే నీపద
మ్మునకుం జాగిలి వేఁడు చున్నదిదిగో ముమ్మాటికిన్ మైథిలీ!

సీత:—

చ. ముదుకొని తేఁటిముత్తములు మూఁగెడు లేనకుళంపు మొగ్గఁ జే
కొని మొటనుంచెఁ దొల్లి రఘుకుంజరుఁ డర్మిలి నట్టి యీ చెవుల్
గొనకొని యిట్టిమాట విని కూడను ప్రీతి వి దేమి యింతొ! చె
ల్లును గద యిట్టిచందములు లోఁగుటిలత్వము నూను వారికిన్.

రావ:—జానకీ! నీకడకంటి చూపున నైన నన్నాదరింపవా?

సీత:—ఓరీనిశాచరా! యీప్రార్థనా భంగలాఘవమునకు నీవు జంక కున్నను రాఘవునకు మాత్రము జంకు తప్పదు.

రావ:—ఓసీ! యెవఁ డారాఘవుఁడు. జను లందఱును రాముఁ డందురే వాఁడా? (నవ్వి)

గీ. రాముఁ డననెంత కత్తి చెయిఁ గ్రాలు మాత్రఁ
త్రిభువనమ్ములు గీటు దైతేయపతికి;
రాముఁ డన నింక నీకు నై కోమలాంగి!
శితశరమ్ముల నచిరంబ చీల్చు నన్ను.

సీత:—ఇది నిజము నిశాచరా! నిజము.

రావ:—(తనలో) ఏమి యీ సీత నానోఁడివిన దాని నొప్పు కున్నది? అంతటి భాగ్య మెన్నఁ డేని కలుగనా? లేక నే నేమేని తడ వడితినా?(ఆలోచించి ప్రకాశముగ నాపద్దెమునే చదివి)జానకీ! అట్లయిన నీ కటాక్షామృతమున నన్ను జీవింపఁ జేయవా!

సీత:—

గీ. అపుడ నినుఁగూడఁ జూచు లంకాధినాథ!
రామచంద్రుని కాంత యీభూమిజాత.

రావ:—(ప్రత్యాసతో) ఎపుడో చెప్పుము. అట్లగు నేని

గీ. విడచి పుచ్చును తనదు దేవేరి నైనఁ
గూర్చు రాజ్యంబు నైన నీకోటి గానకు
నదియు నిది యన నేల నీకై మృగాక్షి!
తనదు తల లైన బలివెట్టు దశముఖుండు.

సీత:—

మిణుగురుంబుర్వు వెలుఁగుల మేలుకొనునె?
తామరసబాంధవునిఁ గోరు తమ్మితీవె.

రావ:—(క్రోధముతో) ఛీ! పాపాత్మురాలా! భానునకును మిణు
గురుఁ బుర్వునకును గల తారతమ్యమా రామరావణులకు?
చచ్చితివి చూడుము. (ఖడ్గము నోరనుండి లాగును)

రాము:—(సకరుణముగా)

గీ. కాంత! నీ కెంత దురవస్థ గలిగె నకట!

(సచింత్యముఁగా)

పాడుదైవమ! నీకోర్కి పండె నేఁడు

(సక్రోధముగా)

చచ్చితివి కోరి క్రూర! రాక్షసకులఘ్న!

(ససంభ్రమముగా)

ధనువు ధను వోయి లక్ష్మణా! తరుణ మిదియె.

లక్ష్మ:—ఆర్యా! యిది యింద్రజాలము గదా! ఊరక యిట్లు సంభ్ర
మించెద వేమి?

రావ:—ఓసీ జానకీ! ఇదిగో యిది నాకు పేరిటి త్రాచుఁబాము.
రావణభుజాలింగన మొక్కటియే దీనికిఁ గట్టుమంత్రము. కాన
నే మనియెదవు?

సీత:—

ఉ. చాలును నోరు మూయుము మిఁకఁ జాలును కోరి నిశాచరాధమా!
నీలసరోజకాంతి హావణిల్లు రఘూద్వహు బాహు వేని నీ
కేలఁ గృపావిహీన మయి కేరు కృపాణక మేని దక్క నే
వేళను ముట్టఁ జాల దిఁక వే ఱొక టెద్దియు మద్గళస్థలిన్.

రావ:—ఇఁకఁ గాల క్షేపణ మేల? దీనికంఠరక్తమున నిప్పుడే కాళిక
నారాధించెదం గాక. (ఖడ్గధారను సవరించును)

రాము:—ఔరా!

శా. ఘోరంబై దిశలెల్లఁ గ్రమ్మెఁ దిమిరస్తోమంబు దైవంబునుం
గ్రూరం బయ్యె, యుగంబు మారె, జగమంభోరాశిఁ గ్రుంకెం గటా
తీరా కల్వసరమ్ము లుండదగు ధాత్రీపుత్రి కంఠంబుపై
బారై యున్నది పాదుఖడ్గ మదిగో! పాపాత్ము హస్తంబునన్.

(మరల యోజించి) అవు నిది లోకమున సహజమే కదా!

ఉ. కస్తురిక నొక్కఁడే కలఁకుఁ గోఁటల రాహువు చంద్రరేఖకం
గ్రొత్త పటీర వల్లికను గూలుపఁడే దవపావకుండు, ద
ళోత్కుటమైన కల్వపూ సరము నొక్కట మత్తుఁడు ద్రెంపి వెపఁడే
మత్తగజంబు తుండమున మట్టము సేయదె తమ్మితీవియున్.

సీత:—

మ. చలువల్ గ్రమ్ముచు నాణిముత్తెముల చంచత్కాంతి కంఠెంగదుం
దెలుపై నీదగు ధార నొప్పెడు జలాసీకమ్మునన్ ముంచుచున్
దలఁగం జేయుము రామచంద్ర విరహోద్దామాగ్ని సంభూతమై
నిలువెల్ల న్ననఁ గాల్చు తాపభరమున్ నిస్త్రింశ వంశోత్తమా!

రావ:—ఒరీ! యెవఁడురా యిక్కడ? శీఘ్రముగఁ గపాలపాత్రమొకటి నా కందిమ్ము. దీనికంత రక్తమును దాని యందు నింపెదను గాక. (అశోకవృక్షశాఖల లోనికి హస్తము జొనిపి) మేలు మేలు. ఏవఁడో కపాలము నాచేత నుంచినాఁడు. (చూచిసచమత్కారముగా) ఇది కపాలముగాదే! కైదువు పోటు లేకయే యూడిపడిన తల యిది. ఎవ్వనిదై యుండునో! కట్టా! యిది నిక్కముగ మాయక్షకుమారుని తల. హా! కుమారా! (మూర్ఛిల్లును)

త్రిజ:—లంకేశ్వరా! యూరడిల్లుము.

రావ:—(నిట్టూర్పువిడిచి) ఇది యాదుష్టుడగు వానరుని పని. కావున నీచంద్రహాసమునకు ముందు వానినే యెఱ చేసెదం గాక. (నిష్క్రమించును)

రామలక్ష్మణులు:—(హర్షముతో) ఔరా! యేమి యీ కల్పనా వైదగ్ధ్యము!

త్రిజ:—(సీతను గౌగిలించుకొని) సఖీ! భాగ్యవశమున జీవించితివి.

సీత:—అభాగ్యవశమున నని చెప్పుము.

త్రిజ:—అ దేమి?

సీత:—అది యభాగ్య మేల కాదు. ఆచంద్రహాసమే న న్నుపేక్షింప కున్నచో నా కీ రామచంద్ర వియోగ పరితాపము తుదముట్టి యుండును గదా! కావున నిఁక నీజీవితము నా కెందులకు? చిదుగులు ప్రోవు చేసి నిప్పు నటింపుము. నాయంగము లందుఁ జల్లార్చు కొందును.

త్రిజ:—పాపము నశించుఁ గాక.

చ. చలువలతేని వెన్నియల జాలుల పొత్తునఁ గన్నుపండు వో
బలితపు టాకుపచ్చమణి పట్టముతో నుపమింప నద్దియై
మలయజ సార చర్చలను మానిత మా రఘురాము పేరుర
స్థలమునఁ దీరు వైళ మిఁకఁ దాపము నీకుఁ దపస్విసీమణీ!

సీత:—సఖీ! యీనిరర్థకాలాపము లేటికి? నిక్కముగ నగ్నిఁ జొచ్చుటకు సంకల్పించితిని. కావున నా కగ్నికణం బొకటి తెచ్చియిమ్ము.

రాము:—బెబ్బులి బారికిఁ దప్పి వలఁ జిక్కిన జింకపిల్ల చంద మైనది గదా యిపుడు జానకి.

త్రిజ:— (వెడలిపోయి మఱలఁ బ్రవేశించి) సఖీ! యీప్రదేశమున నంత సులువుగా నిప్పు దొరకదు.

రాము:—(హర్షముతో) త్రిజటా! దైవవశమున రాముని రక్షించితివి సుమా?

సీత:—(అశోకు నుద్దేశించి)

ఉ. అంజలిఁ జేసి వేఁడెద దయామతి మై దయసేయు మొక్క ధా
నంజయఖండ మిత్తటిని నా కయి శ్రీమ దశోక పాదపా!
క్రొంజిగురాకు పేరఁ బరగుం గద! నీకడ నార్ప రాని మం
టం జిలికించు చిచ్చు హృది నాటి వియోగుల నెల్లఁ గాల్పఁగన్.

(చూచి హర్షముతో) చెలీ! చూడు చూడు. నిప్పు తునుక యీచెట్టుపై నుండి పడినది. (జరిగి నిప్పుతునుకను బట్టుకొనఁ బోవును)

రాము:—

గీ. చూడ నియ్యది సాక్షా దశోక మయ్యు
శోకతం దాల్చె నాకు నై చోద్య మకట?

లక్ష్మ:—ఆర్యా! చెట్లపై నుండి గూడ నిప్పు తునుక లుట్టిపడుట గలదా!

రాము:—బామహాతకుని చండ దుర్దైవతంబు
బాలకా! యిప్పు డెంతకుఁ జాల దయ్యె!

సీత:—(నిప్పుతునుకను గ్రహించును)

రాము:—

గీ. జలజ సమ మైన యీపె హస్తమున దహన!
పొలిచితివి చెంగలువ పోల్కి చలువ తెగయ
ముట్టి నంతనె మసిఁ జేయు జెట్టి వకట!
యింత విపరీత చరిత నీ కెట్టు లబ్బె.

సీత:—(చేతి యందలి నిప్పుతునుకను జూచి విషాదముతో) కట్టా! యేమిపాప మిది! నాయభాగ్యమున నగ్నియుఁ జల్లనైనదే. (నిపుణముగా నిరూపించి సచమత్కారముగా) ఔరా! యిది యగ్నిఖండము గాదు. పద్మరాగ రత్నఖండము.

త్రిజ:—సఖీ! పుణ్యవంతుల కగ్నియు రత్న మగు నన్న సామెత సత్యమైనది.

సీత:—(మఱలఁ జూచి) ఇ దేమి వింత. ఆరత్నముద్రికగా నున్న దే యిది! (ముద్రికనుగూర్చి)

గీ. భావుకయు, సాధువృత్తయు, భాల్య మాది
రమ్య రఘునాయ కాంగుళీ రతయు నైన
యిమ్మణీముద్ర యపర మహీజవోలెఁ
జేరినది లంక కిది యేమి చిత్రమొక్కొ!

(మరల నాదరముతో) (వ్రేలుజివుళ్ళతో లాలించుచు) సఖీ! రత్నముద్రికా! సలక్ష్మణుం డగురామచంద్రుని చరణపద్మమ్ములకుఁ గుశలమా!

[పటాక్షేపమున హనుమంతుఁడు ప్రవేశించును.]

హను:—కుశలము దేవీ! కుశలము కుశలము.

సీత:—ఓయీ! యమృతముఖుఁడా! నీ వెవరవు నాయనా?

హను:—

శా. తారానాథు సఖుండ రాఘవుని దూతన్ వాయుపుత్రుండ నా
పే రన్నన్ హనుమంతుఁ డమ్మ నిను నుర్విం గూల్పఁ బైకొన్న ర
క్షోరాజన్యుని పాణి నక్షుశిరమున్ గూఢప్రకారంబుగా
నేఁడుం జూడక యుండ వైచినది నేనే సుమ్ము సాధ్వీమణీ!

రాము:—ఔరా ! హనుమంతుఁ డనుపేరఁ బ్రత్యక్షమైన నాభాగ ధేయంపు విలాసమా యిది !

లక్ష్మ:—ఔరా ! యేమి యీ కల్పనా చాతుర్యము !

సీత:—ఓయీ భద్రముఖుఁడా ! ఆతారానాథుఁ డెవ్వరు ?

హను:—

గీ. శౌర్యనిధి యైన వాలికి శాత్రవుండు
విశ్వబాంధవుఁ డైన సప్తాశ్వ సుతుఁడు
రామ చరణాబ్జ సేవా ధురంధరుండు
నగచ రేంద్రుండు సుగ్రీవ నామకుండు.

సీత:—అట్లయిన నర వానరుల కిట్టి స్నేహానుబంధమును నెలకొల్పిన దెవరు ?

హను:—రామ బాణమే.

సీత:—అది యెట్లు ?

హను:—

గీ. వింటి యంకమ్ము నదిఁ వీడి విడక మున్నె
వాలి కమరావతీ వాస వైభవమును
భాను సుతునకుఁ దారతో వానరేంద్ర
పదవియును నొక్కమాఱె సొప్పడియె దేవి !

సీత:—నాయనా ! మందభాగిని నైన నామీఁది బెంగచే రఘు కులేంద్రుఁ డిప్పుడేమని కృశించి యున్నవాఁడా ?

హను:—దేవీ ! యేమని వాక్రువ్వనేర్తును ?

గీ. రఘువరుం డిప్పు డమవస రాజువోలె
నొంటి ప్రాణంబుతోఁ జిక్కి యున్నవాఁడు

సీత:—కట్టా ! ఎంత ఘోరము !

హను:—

కలువ కెనవచ్చు నతని మైకాంతి మాత్ర
బలియు చున్నది తత్ప్రభావమున దేవి !

సీత:—ఇపుడు కొంచెము ప్రాణము చేరుకున్నది.

హను:—దేవీ ! నీకు రాఘవేంద్రుఁ డంపిన సందేశము కలదు. వినుము.

సీ. పదియాఱు కళలతోఁ భాసిల్లు శశిరేఖ
ప్రళయ మార్తాండ మండలము పగిది
నిలు వెల్ల జలముచే నిండి ఘూర్ణిలు చుండు
జీమూతములు కాఱు చిచ్చు పోల్కి
సెలయేళ్ళ నుండి వీచెడు తెమ్మెరల పిండు
క్రుధఁ గొన్న త్రాచుఁ టూర్పుల కరణి
ప్రవిమల చ్ఛవి నీను కువల యోద్యానంబు
పటు కుంతకాంతార పటలి యటులు

గీ. లలిత మల్లిక లుగ్రభల్లముల మాడ్కి
నేఁచు చున్న విఁ కేమందు ? నిందువదన !
తావకీన వియోగ సంతాప గరిమ
నఖిల జగమును విపరీత మయ్యె నాకు.

మఱియు నో దేవీ !

ఉ. ఎవ్వని కీయవస్థ నెఱిఁగించి దరింతు వియోగ దుఃఖమున్
ఎవ్వఁ డెఱుంగ నేర్చు మనయిర్వురలోఁ గల గుట్టు ప్రేయసీ !

జవ్వగ నామనం బొకటొ సవ్వడి వట్టను గాని యద్దియున్
జివ్వన నాఁడ వెన్కొనియె నిన్నె ప్రియా! యిఁక యేమి సేయుదున్.

సీత:—(సిగ్గుపడి యుండును)

త్రిజ:—సఖి! నీవును రాఘవేంద్రున కే దేని ప్రతిసందేశంబును నానవాలును బంపుము.

సీత:—నా ప్రతిసందేశ మిదియే.

గీ. విడుపు లేనట్టి కన్నీటి వెల్లువలకు
నిలయ మయ్యును నాచూడ్కి నిరుప మాంగ!
త్రావఁ గోరుచు నున్నది తావకీన
వదన పూర్ణేందు బింబ లావణ్య రసము.

(శిరోరత్నమును దీసి హనుమంతుని చేతి కిచ్చుచు) శిరోరత్నమా!

గీ. క్రూరగ దానవు దృష్టి సోఁకుటను జేసి
మైల వడియున్న నీ మేను నైళ మింక
రఘుకు లేశ్వర పాద నిర్మల నఖేందు
కాంతులను ముంచి నిష్కళంకమవు గమ్ము.

హను:—దేవీ! నా కింక సెల విమ్ము. రామచంద్ర చరణ దర్శనోత్కంఠ నన్నుఁ ద్వరపెట్టు చున్నది.

సీత:—(కన్నీరు విడుచుచు సగద్గదముగా) ఓయీ నిర్వ్యాజ ప్రణయ పరాయణా! నీ విచ్చట నుండి యేగిన పిదప మరల నాకు రాఘవేశ్వరుని వృత్తాంతముఁ దెలుపు వా రెవరు?

హను:—దేవీ! దైవవశమున స్మృతికిఁ దెచ్చితివి. రాఘవేంద్రుఁడు నీ కిదియుం జెప్పు మనియెను.

మ. పరితాపంబు వహింపఁ బోకుము శరత్పంకేజ పత్రాక్షి! రౌ
ద్ర రసంబు న్వెలి గ్రక్కు లక్ష్మణుని కోదండోగ్ర ఘోషమ్ములం

బారి దుఃఖించు నిశాచరాంగనల యేడ్పుం బొబ్బలన్వ్విండి నీ
వరయన్నేర్తువు గాక మామక భవిష్యత్కాల వృత్తాంతమున్.

(తెర లో)

శా. పోరన్ రాసుతు నత్తు నెట్టులొ మృతిం బొందించి యెవ్వోటికిం
బాఱం గంటివి రోరి కీశహతకా! ప్రత్యక్షమై రమ్మికం
దీరం బోదిది, మేఘనాదుఁ డిదె వైతేయేంద్రు నాజ్ఞన్నినుం
జీరన్ వచ్చె ధనుర్గుణంబు వెస గర్జిల్లంగ నత్యుగ్రుఁడై.

హను:—దేవీ! వచ్చినకార్యము నెఱవేర్చుకొంటిని. ఇఁక నేను మఱుఁగుపడి యుండ నక్కఱ లేదు. ఇదిగో! నమస్కరించుచున్నాను. సెలవిమ్ము.

సీత:—ఓయీ వాయునందనా! అనాయాసముగ నీదుర్నిశాచర సాగరమును దాటి పొమ్ము.

హను:—ఇదిగో! దేవియనుగ్రహమును శిరమునఁ దాల్చితిని

(నిష్క్రమించును)

సీత:—సఖీ త్రిజటా! నీ వాకసమున నిల్చి యీతని వ్యాపారమును గనిపెట్టుము.

త్రిజ:—అట్లే చేసెదను. (నిష్క్రమించును)

(తెర లో)

సీ. అదలించు చున్నవాఁ డంపవెల్లిని ముంచు
క్రూరారి నసహాయ శూరుఁ డగుచు

(అందఱు హర్షము నటింతురు)

(మరలఁ దెరలో)

మిట్టకోలల ఱువ్వు మేఘనాదుని చేత
నట్టకేలకు నిదే పట్టువడియె

(అందఱు విషాదము నటింతురు)

(మరలఁ దెరలో)

ముక్కిడి రక్కసుల్ మూఁగి చిచ్చుఁటింప
మండుచున్నది తోఁక గండరింగి

(అందఱు భయము నటింతురు.)

(మరలఁ దెరలో)

ఇంటింటి నడిక్రొప్పు కెగసి యత్యుగ్రుఁడై
కాల్చుచున్నాఁడు లంకాపురమును

(అందఱు హర్షవిషాదముల నటింతురు)

(మరలఁ దెరలో)

గీ. మయి యొకింతయుఁ జెక్కుచెమర్పకుండ
ప్రకట జవమున నేఁగి వారాశి నీట
నార్పుకొను చున్నవాఁడు వాలాగ్ని నెల్ల
ప్రథిత బల సంయుతుఁడు మహాబల సుతుండు. 51

(అందఱు హర్షము నటింతురు)

(తెరలో)

ఔరా! యేమి యీయాశ్చర్యము !

మ. వడిచేఁ బుట్టిన గాలి తాఁకున జలప్రాగ్భార మధ్యంబునన్
బెడఁగా తెట్టుల నుండి శేషుని నుతుల్ వెన్నాడ నివ్వానరే
శుఁడు వేలాద్రి శిరమ్ము నుండి తటిసీశుం దాటు చున్నాఁ డిదే!
పొడుపుం గొండ శిరమ్ము నుండి గగనంబున్ దాటు భానుం డటుల్ 52

సీత:—(తెరవంకఁ జూచి జూచి) సఖీ! త్రిజటా క్రిందికి దిగితివా! ప్రియంవద వైన నిన్నిదే కౌఁగిలించి కొనియెదను. (అని లేచి పోవును)

రాము:—ప్రేయసీ! నన్నుఁ గూడఁ గౌఁగిలించుటకు నిరీక్షింపుము.

లక్ష్మ:—ఆర్యా! యిది యేమి! విద్యాధర ప్రణీతం బగు నియ్యింద్ర జాలమును జూచి మాటిమాటికి భ్రమించెదవు!

రాము:—వత్సా! పోనిమ్ము. తానై తనపరాక్రమ గాధను వర్ణించి కొన నొల్లని హనూమంతుని ప్రకృష్ట చారిత్రము నందలి రహస్యమును దెలిసికొనఁ గంటిమి గదా!

(తెరలో)

దేవా రఘుకులాధీశ్వరా!

ఉ. వ్యాల సమాన సత్త్వ దధివక్త్రు మహిం బడఁ దన్ని లీలమై
కేళివనంబుఁ జొచ్చి మధుకేళి చిరం బొనరించి గాడుపుం
జూలి భవత్పదాబ్జములు చూడఁగ వచ్చుచు నున్నవాఁడిదే
నీల నలాంగ దాదు లగు నెయ్యురతో నెకసక్కె మాడుచున్. 53

రాము:—వత్సా! వింటివా? కృతార్థుఁడై చేరవచ్చిన హనుమంతు నెదుర్కొందము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

గద్యము

ఇది శ్రీమ దత్రికులాత్రేయ కవిరత్న బిరుద ధారేయ శ్రీమ
దెరమిల్లి వంశ పయఃపారావార సుధాకరాయమాణ
నారాయణ ప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త
కుశేశయ కొండలరాయ నామధేయ
ప్రణీతం బైన ప్రసన్న రాఘవ
నాటకంబున షష్ఠాంకము
సంపూర్ణము.





శ్రీ

# ప్రసన్న రాఘవము.

## సప్తమాంకము.

(పులస్త్య శిష్యుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

ముని:—(అంతటం జూచి) ఈ ప్రదేశము నాకుఁ గ్రొత్త. కావున నాతని భవనము నా కెట్లు తెలిసికొన నగును? (మఱలఁ జూచి) ఓహో! యితఁడు లంకేశ్వరునికిఁ దాతయు మహామంత్రియు నగు మాల్యవంతుని పరిచారకుఁడు కరాళకుఁడు. (బిగ్గఱఁగా) మిత్రమా! యిటు రమ్ము.

(కరాళకుఁడు ప్రవేశించును.)

కరా:—మునీంద్రా! నమస్కరించు చున్నాను.

ముని:—మనోరథము ఫలించుఁ గాక. విభీషణుని భవన మెక్కడ? యున్నదో నాకుఁ జెప్పెదవా?

కరా:—అక్కడ నీ కేమి పని?

ముని:—కడగొట్టు మనుమనికిఁ బులస్త్యులవా రేదో సందేశము గొంపొమ్మని నా కాన తిచ్చినారు.

కరా:—అట్లయిన విభీషణుఁ డిపు డిక్కడ లేఁడు.

మునిః—అ దేమి ?

కరా:—ఒకానొక నాఁడు విభీషణుఁడు తనకు నమస్కరించు చుండఁ లంకేశ్వరుఁ డతనిచేతి నుండి యక్షరములు లిఖింపఁ బడియున్న పత్రము నొకదానిని గ్రహించి చదివించెను. దానియం దిట్లున్నది.

గీ. చపితి చందురు వంక పజ్జకును బోలెఁ
బరసతీ ఫాలపట్టమ్ము దరికి నెపుడు
పఱుప నొల్లరు దమచూడ్కి నెఱిఁగి యెఱిఁగి
బాగు పడగోరు వార లెవ్వారు గాని.

మునిః—అహా ! విభీషణుని ప్రభువిజ్ఞప్తి చాతుర్యము ! కొనియాడఁ దగి యున్నది గదా ! తరువాతఁ జెప్పుము.

కరా:—అంత లంకేశ్వరుఁడు నవ్వి యిట్లు పలికెను. ఎవ్వఁడో పిఱికివాఁ డిట్లు బలికి యుండును. ఏల యన,

క. పరసతికుచకుంభములను
బరకుంభుల కుంభములను బడ నేర్చునొకో !
తరమిడినను భీరుజనో
త్కరముల కరములును శరనికరములు నెపుడున్.

మునిః—ఔరా ! జనులయొక్క వాక్చిత్రములు తమచిత్తవృత్తి యనెడు భిత్తి ననుసరించియే యుండును గదా!

కరా:—తరువాత విభీషణుఁడు ప్రణయ, కోప, విషాదంబులు తన మనంబున మల్లడిగొన లంకేశ్వరునితో ని ట్లనియెను.

మ. శివమాళిం గల గంగ పేరిమిని వాసిం దాటు నుద్దామకీ
ర్తివితానమ్ముల దిక్కుల న్నిలిపి పరిష్వంగ వా నీవె యి

ట్లవనీ పుత్రికపై మనస్సు నిడి నేఁ డాహా! కలంకంబ వై
తి విఁకేమందుఁ బుల స్త్యవంశ విలసత్కీర్తి క్షపాభర్తకున్.

ముని:—(కౌతుకముతో) తరువాత నేమి జరిగినది?

కరా:—గీ. భూరిరుష పేర్మిఁ గంట నిప్పుకలు రాల
బాఁకు నొర నుండి యొక్కింత పైకి లాఁగి
సద్గుణ విభూషణుని విభీషణునిఁ బట్టి
హృదయమునఁ దన్నె బిట్టు లంకేశ్వరుండు.

ముని:—కట్టా! యింకేమన వలయు,

గీ. కాలవశమునఁ గన్ను లు గాన రాక
గర్వితాత్మకుఁ డైన లంకావిభుండు
సద్గుణ విభూషణుని విభీషణుని గాక
తన సిరిం గూడఁ దనకాలఁ దన్నుకొనియె.

తరువాత నే మైనది?

కరా:—తరువాత విభీషణుఁడు లంకేశ్వరుని వదలి కతిపయపరివార
ముతోఁ గూడ రామునే యాశ్రయించెను.

ముని:—(తనలో) అట్లయినఁ బుల స్త్య సందేశ రహస్యమును విభీష
ణుఁడు ముందే నెరవేర్చి యున్నాఁడు. (ప్రకాశముగా) సరియే
కానిమ్ము. కరాళకా! నీ విప్పుడేమి చేయఁ బోయెదవు?

కరా:—జానకీ విరహ విహ్వల హృదయుఁ డగు లంకేశ్వరుని మనో
వినోదము కొఱకు నెవ్వఁడో చిత్రకారుఁడు వ్రాసిన చిత్రపట
మును నాచేతి కిచ్చి దానిని రావణేంద్రున కందఁజేయు మని
మాల్యవంతుఁడు నా కానతిచ్చి యున్నాఁడు. నే నిప్పు డాపని
నేరవేర్పవలసి యున్నది.

ముని:—పగతుఁడు వచ్చి ఈవిధమున నెత్తిపై నెక్కి యుండగా మాల్య వంతుఁడు రావణుని పట్టున నిట్లు చరించుట యేటి వివేకము! కావున నిక్కముగ ని దేదియో యిప్పటి కుచిత మైనదే కాఁబోలును.

(తెరలో)

ఉ. నూఱుఁడు రోరి! చందన మనూన మృగాంకశిలా తలమ్మునం
గూరుపుఁ డోరి! చామరము కోమల చంద్రకర వ్రజంబునం
జారు మృణాళ తంతు గణ సంగత సూత్రమునన్ ఘటింపుఁ డో
రోరి! సరోజినీదళ పయోమయ బిందులఁ దారహారముల్. 6

ముని:—(పరిహాసముతోఁ దనలో) ఈశీతోపచారము వంటిదే లంకే శ్వరుని కాసీతోపచారము గూడను. (ప్రకాశముగా) ఓహో! విరహతప్తుఁ డగు దశకంధరునికి శీతోపచారార్థమై నిశాచరు లిప్పు డాజ్ఞాపింపఁ బడు చున్నారు!

కరా:—నిశాచరులే గాదు ఖేచరులు గూడను.

సీ. చిలికించుఁ బన్నీరు చలువ లేపారంగ
మృదు కరమ్ముల తోడ హిమకరుండు
విసరు నెంతయుఁ దాళవృంతంబుతోఁ బోలె
మెలమెల్లఁ జైత్ర సమీరణుండు
కల్పించుఁ దల్పం బనల్ప పాథోజినీ
పత్రపంక్తులతోడఁ బాశ ధరుఁడు
అలఁదుఁ జందనసార మఖిలాంగకము లందు
నారిపోవు కొలంది నర్క సుతుఁడు
గీ. మకర కేతన చండ కార్ముక విముక్త
ఘోర బాణాగ్ని తప్త శరీరుఁ డైన

పంక్తికంతున కిట్లు గీర్వాణు లెల్లఁ
జలుపు చున్నారు సేవలు సంయమీంద్ర!

కరా:—(నేపథ్యము వంకఁ జూచి) ఆహా! యిదిగో! ప్రహస్తుఁ డిప్పుడే రాజద్వారమును సమీపించుచున్నాఁడు. కావునఁ జిత్రపట మాతని చేతి కిచ్చెదను. నీవును నీపనిఁ జూచు కొమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

విష్కంభము.

[రావణుఁడును జిత్రపటహస్తుఁడై ప్రహస్తుఁడును బ్రవేశింతురు.]

రావ:—(తనలో)

చ. కలిత లలాటపట్టి ఘనకాంతుల నీన, రవాళి కాంచికా
లలితగుణంపుఁ బొత్తు వదిలంపడఁ, గోమల కేశపఙ్క్తి సం
కలనము సొంపుఁ గూర్చ, సుమకాండు శిలీముఖ యష్టిఁబోలె నీ
సులలితగాత్రి డెందమునఁ జొచ్చెఁ గటా! యిఁక నేమిసేయుదున్.

ఆహా! యే మిది! బలిమిం గొనితెచ్చుటం జేసి ఖిన్నయై పాలిపోయి కృశించియుండియు జనకనందిని తా నిప్పుడును జనస్థాన మందున్నప్పుడుం బోలె శోభ యించుకయుం దగ్గకయే కనుపట్టు చున్నది. అవు నిది యుచితమే గదా!

గీ. ఉజ్జ్వలము లైన సూర్య కరోత్కరములు
గ్రమ్మి తనకాంతి నెల్లను గప్పివైవఁ
బాలిపోయియుఁ గూడఁ జూపఱకు నెల్ల
నింపుగనె గానిపింపదే యిందు రేఖ.

ప్రహ:—దేవా! మనో వినోదకరంబగు నీచిత్ర వీధినిఁ దిలకింతురుగాక.

రావ:—దీని యం దేమి వ్రాయఁబడి యున్నది!

ప్రహ:—దేవా! యిది మహా తిమి తిమింగిల సంఘాత భయంకర కల్లోల కోలాహ లోజ్జాగరంబు సాగరంబు.

రావ:—(చూచి) ఓయీ! సముద్రమున కుత్తరమునఁ దమాల వనముచెంత వేయి యింద్రధనుస్సు లొక్కటఁ గూడి నట్లు గనుపట్టుచు గగనతలంబు నెల్లఁ గపిశంబు గావించు చున్న దే యది యెద్ది?

ప్రహ:—ఇది సుగ్రీవునిచేఁ బరిపాలింబ బడుచున్న కపిసేన.

రావ:—ఓయీ! వాలిచేఁ బరిపాలింపఁ బడు చున్న దని చెప్పుము. పో నిమ్ము దీనితో నేమి? మఱి యీధనుర్ధరు లిద్దఱు నెవ్వరు?

ప్రహ:—దేవా! వా రిద్దఱును రామ లక్ష్మణులు. అం దగ్రజుం డగువాని బాణపాత విలసితంబుననే కపిసేన యిప్పుడు సుగ్రీవుని పరిపాలన లోనికి వచ్చినది.

రావ:—(వినిపించి కొనక యే) మఱి యీతఁ డెవ్వఁడు? మిక్కిలి కృశించియుఁ గమనీయ శరీరుఁ డై, యమంద మందరాఘాత నిర్మంథ నోత్థిత చలాచ లోత్తుంగ తరంగ సంఘంబులు దన్ను దూరముగా నొడ్డునకు నెట్టివైవ శంకరుని శిరఃకిరీటంబు పైకి లంఘింపఁ గోరు సుధాకరుండుం బోలె సముద్రతీరంబున శయనించి యున్న వాఁడు.

ప్రహ:—లంకకు రాఁ గోరి నిజకుల గురుం డగు సముద్రుని సేవించు టకు దర్భశయనంబునఁ బరుండియున్న తొలిదాశరథి యితఁడు.

రావ:—(నవ్వి) ఓహో యిటులనా ? జానకిని గైకొన గోరి యీతఁడు (మనలం గూడ నిట్లే సేవించును గాఁబోలు !

ప్రహ:—దేవా ! రామబాణ పరంపరలచే నుత్పత్తిల్లిన బహుళ భయంకరాగ్నిజ్వాలా పటలంబులచే సంక్షోభించి కలంతపడు చున్న తిమితిమింగిలాది పరివారమ్ములతోఁ గూడ బెండు వడి యున్న యీపారావారముం జూడుము.

రావ:—ఓయీ ! యీపెద్దతాపసుని పార్శ్వతలమునకు వానరవీరు లెవ్వరినో యిద్దఱు మిక్కిలిఁ నాదరముతోఁ గొంపోవు చున్నారే వారెవ్వరు ?

ప్రహ:—వారిద్దఱిలో నొకఁడు సాగరుఁడే. ఇఁక నీతఁడన్ననో దేవర వారి (అర్ధోక్తి యందే) పోనిం డెందుల కీబంధు విరోధి నామము నుచ్చరించుట.

రావ:—ఓహో యీతఁడు విభీషణుఁడా యేమి ? నాతోఁడి విరోధమున రాము నాశ్రయించు చున్నాఁడు గాఁబోలు. కానిమ్ము,

గీ. నిఖిల రాక్షస మౌళి మాణిక్య రుచులు
పాద పంకేరుహములపైఁ బరగు చుండ
నిక్క మీతఁడు దర్శింప నేరఁ డింకఁ
బ్రియజనుం డయ్యు నీదశగ్రీవు ముఖము.

ఇచ్చట రెండక్షరపంక్తులు లిఖింపఁబడి యున్నవే యవి యెట్టివి ?

ప్రహ:—నిక్కముగ నివి సముద్ర విభీషణులను గూర్చి లక్ష్మణుఁడు వలుకు వాక్యము లై యుండనోపు.

రావ:—అట్లయిన నందొకటి చదువుము.

ప్రహ:—(చదువు చున్నాఁడు)

చ. వెఱవకుమీ సముద్ర ! నినుఁ బిల్చదు రాముఁడు మాగ్ని బంది ను
క్కఱెడు సురేంద్ర సుందరుల కంటి యమూద్రజలమ్ము నానెడున్
మఱియుఁ దదీయ బాణములు మాఁపు దశాస్య వధూ కపోల భా
సుర మకరీ కలాపమునె సోఁకవు నీమకరీ కలాపమున్.

రావ:—ఆతరువాతిది గూడఁ జదివింపుము

ప్రహ:—(చదువు చున్నాఁడు)

శా. శరణం బన్న ఋణంబు దీర రఘువంశస్వామి లంకాధి ప
త్య రమం గూర్చె విభీషణాఖ్యునకు సత్యం, బింమఁ దాకట్టు భా
స్కరపుత్రున్ దొరఁ జేసి సర్వ జగతీ సంస్తుత్య సత్యక్రియా
స్ఫురణం బేర్చిన రామబాహువులు, సాక్షుల్ మేము మొత్తంబుగన్.

రావ:—ఔరా ! ఏ మన వచ్చు నీచిన్ని తాపసుని వాగాడంబర
మాఁదలి నేర్పు! కానిమ్ము. సముద్ర మధ్యంబునం గనుపట్టు
నీగోడ యేమి ?

ప్రహ:—కపివీరులు పెకలించి తెచ్చిన శైలశిఖరంబులచే నిర్మింపఁ
బడిన రఘుకుల కీర్తి ప్రశస్తి బంధము సేతుబంధ మది.

రావ:—ఆహా ! యేమి యీచిత్రకారుని చాతుర్యము ! పట్టి యైనను
నిజ మట్టులే కనఁ బఱచినాఁడు.

ప హ:—దేవరవారి కిప్పుడుఁ గూడ నిది పట్టదని యే తలంపా ?

(నేపథ్యమునఁ గలకలము)

రావ:—(విని) యే మిది ?

ప్రహ:—దేవా!

గీ. భాను కులజుని సేనాగ్ర భాగమందు
భూరి గర్వాఢ్యు లగు వలీముఖులు సలుపు
ఘన ఘనాఘన గర్జాను కారి యైన
ఘోర కోలాహలం బిది కోణపేంద్ర! 13

కావున దీని నుపేక్షింపక తగిన ప్రతివిధానము గావింపుఁడు.

రావ:—ఇది యుపేక్షణీయము గాక మరేమి. దీనికి బ్రతివిధాన మేందులకు? వినుము,

మ విరియం బాఱఁగఁ జేసె డెందమున నుద్వేల ప్రమోదమ్ముఁనే
గురుతన్ వానర సంఘముల్ సలుపు నిక్కోలాహల స్ఫూర్తి ము
మ్మర మై మాటికి ఘల్లు ఘల్లు మను నమ్మందోదరీ పాద భా
స్వా మంజీర మహామణి ప్రకర శింజానంబు చందంబునన్. 14

(మండోదరి ప్రవేశించును.)

మండో:—ఆర్యపుత్రా! జయ మగుఁ గాక.

రావ:—దేవీ! యిటు గూర్చుండుము.

మండో:—(యథోచితముగాఁ గూరుచుండి తలవంచు కొనును.)

రావ:—దేవీ!

సీ. అలఁతి నవ్వుల పేర్మి నవలీల మెఱుఁ దుపా
రాంశు లోకము నట్టె నణఁగఁ ద్రొక్కి
కడకంటి చూపుచేఁ గడఁగి కేళికిఁ బోలె
కువలయ శ్రీ నెల్ల నవఘళించి
భ యుడ సింహస్వప్న భంగి యై కన్నెత్తి
సురల కైనను దేఱి చూడ రాక

అరసి యింతన రాని యలకాభిరామ సం
పద సర్వ మటు చెల్ల చెదరు గాఁగ

గీ. దలవ నాతోడ నద్ది యై తనరు నట్టి
తావ కాస్య ప్రఫుల్ల రాజీవ మిట్లు
క్రిందు సేసెద వేల నిర్హేతుకముగ
నీరదాసీక కమనీయ నీలవేణి!

ప్రహ:—దేవా! కపిసేనా కోలాహలముచేత నైన చింత చేతనే దేవీ తలవంచు కొన్న దని తలంచు చున్నాను.

రావ:—ఇది చింతావిషయము గానేర్చునా?

సీ. సావహేల చలాచ లాంగ దాంచిత భుజా
సంరంభ మొక వింత సరణి దెలుప
కడు నపూర్వ విలాస గరిమ సొప్పడఁ జేయు
కుముదాభిరామ హాసము సెలంగ
ముదితాత్మకుం డౌచు ముఖభాగమున యందుఁ
దారావిభుఁడు నిల్చి తనరు చుండ
లలిత సౌభాగ్యమ్ముఁ జిలుకరించెడు తార
కమనీయ మగువికాసము వహింప

గీ. నీల చికురయు గతికళా నిపుణ యగుచు
వన్నె లాడియుఁ బోని యీప్లవగ సేన
నిలిచి నాబోటివాని సన్నిధినిఁ దాను
జూపఁ గల దర్ప మెట్టిదో చూచి కొనుము.

మండో:—దేవా! వే ఱొక కారణము గూడఁ గలదు. ఆర్యపుత్రునికి శకునము నిరూపించుకొని వచ్చుటకై నేఁడు నేనొక పరిచారికను గిరిశిఖరగహన మధ్యంబు సందలి శబరపల్లికిఁ బంపి యుంటిని.

అది యచ్చోటికి బోయి, యొకానొక బోయయిల్లాలు తనయింటి చెంగట మెలంగు నొక సింగంపుఁ గొదమం జూచి యుపాలంభించుచుఁ బలికిన వాక్యమును విని వచ్చి నాకుఁ దెలిపెను.

రావ:—ఆవాక్య మెట్టిది?

మండో:—.

> క. తెలిచి వ్యాలేంద్రునిఁ గీ
> డ్పఱచితి నని యింత మిట్టిపడ నేటి కిదే
> దరియంగ వచ్చె నిను దా
> శరథి గభీరుండు రాజశరభుం డిటకున్.

రావ:—ఇందు విషాదకారణ మే మున్నది? మావిషయమున దీనిని గూర్చి యోచింప నక్కఱయే లేదు.

ప్రహ:—దేవా! యీయనువి చిత్తగింపుఁడు. 'వ్యాలేంద్రుని' యను పదమునకు భయంకరుఁ డగు నింద్రుఁ డని యర్థము సెప్పి 'దాశరథి గభీరుండు రాజశరభుండు' అని పద విభాగము చేసి కొన్నచో దీనికి మఱి యొక విధమునఁ గూడ నన్వయం బేర్పడు చున్నది.

రావ:—ఓయీ! శంక యన నేమియో యెఱుఁగని లంకేశ్వరున కీశకునోప శ్రుతిపరీక్ష యేమి?

(నేపథ్యమున)

> శా. స్ఫారా స్ఫాలిత రామ లక్ష్మణ ధను ర్జ్యావల్లరీ ఝల్లరీ
> భూరి ధ్వాన సముస్న ను త్పులక సంపూర్ణాంగు లై రక్కసుల్
> ఘోరాసి చ్ఛటఁ గీశకంఠ కాళీకోటిం గడుం గిటుచున్
> వీరావేశ నిమగ్ను లైరి పటు దోర్విక్రాంతి దీపింపఁగన్.

రావ:—(హర్షముతో) ఔరా! సంగ్రామరంగం బిప్పుడు నిశాచరవీర విజయయోత్తరం బై విరాజిల్లుచున్నది.

(మరల నేపథ్యమున)

మ. పరిణద్ధం బయి యింపు నింపు ఘన కింపాకంపుఁ బం డట్లు బి
ట్టరుణం బై ముఖదేశ మొప్ప రఘునాథాగ్రస్థలి న్నిల్చి వా
నరవీరావళి సేన గ్రమింగఁ దొడఁగెన్ దైత్యౌఘమున్ సర్వమున్
సరసీ జాప్త ప్రభాత దీధితి తమశ్చక్రంబు న ట్లుద్ధతిన్. 10

రావ:—ఔరా! మర్కటులకు వేఁడి యెక్కి నట్లున్నది. (బిగ్గరగా) ఓరీ! యెవఁడురా యిక్కడ?

మ. నిదురన్ మానిపి కుంభకర్ణుని భుజోన్నిద్రావలేపాఢ్యునిన్
మొదలం బంపుడు ఘోర యుద్ధమున రాముం దాకి గారింపగన్
పిదపన్ మత్సుతు మేఘనాదు రణబందీభూత దేవేంద్రు దు
ర్మద చంచద్భుజ బంపుఁ డిత్తఱిని పోరం దాక సౌమిత్రినిన్. 20

(నేపథ్యమున)

దేవా! దేవరివారి చిత్తముం గనిపట్టి మహామంత్రి యగు మాల్యవంతుఁ డిది వఱకే యిట్టి సంఘటన సేసి యున్నాఁడు. మఱి యిప్పు డన్ననో!

చ. గడుకొని రాముతోడ భుజగర్వ సమగ్రుఁడు కుంభకర్ణుఁడుం
దొడరి సుమిత్రపుత్రకుని తోడ సురారి మయూర మేఘనా
దుఁడయిన మేఘనాదుఁడును దుర్భర వీరవినోద కేళికిం
గడగి పరస్పరంబు జయకాంక్షల నెక్కిరి యుద్ధభూమికిన్ 21

(మఱల నేపథ్యమున)

మ. కలనం గోఱల పేరి వజ్రముల సంఘాతంబులమార్గణన్
స్థిరవర్షంబులఁ గొండ లట్టియును కార్చి చ్చట్టియు న్మర్కటేం

ద్రుల స్రుక్కించిన కుంభకర్ణ ఘననామున్ పోరుచో నైరహా!

రావ:—ఇక నేమి చెప్పనో!

శలభంబుల్ రఘురామ లక్ష్మణ ధను స్సంజాత బాణాగ్నికిన్. 22

(మండోదరీ రావణులు మూర్ఛిల్లుదురు.)

ప్రహ:—దేవా! యూరడిల్లు మూరడిల్లుము.

రావ:—(ఊరడిల్లి) దేవి! యూరడిల్లుము.

మండో:—(ఊరడిల్లి) ఆర్యపుత్రుఁడు నన్ను రక్షింప వలయు. శో కాంధకారమున మునిఁగి పోయితిని.

రావ:—దేవీ! భీతిల్లకుము. ఈ చంద్రహాస చంద్రికయే శోకాంధ కారమునుండి నిన్నుద్ధరించును. (లేచి ఖడ్గము నొరనుండి లాఁగి) దేవీ!

మ. దళి తైరావణకుంభి కుంభతట ము క్త స్ఫార ముక్తాఫల
మ్ములు ధూపమ్ములచే సివ మ్మెనసి యేపుం గన్న యీఖడ్గ మి
మ్ములఁ బోరం బడినట్టి దానవులకున్ మోదంబుఁ జేకూర్చుచున్
విలస ద్భంగుల క్రమించు నిపుడే వీక్షింపు మిబ్జాననా! 23

(ప్రహస్తునితోఁ నిష్క్రమించును.)

మండో:—ఔరా! యాశ్చర్యము. సమర సంరంభముం జూచి వెఱఁగు పడి యున్న యీవిద్యాధర దంపతు లేమో చెప్పు కొను చున్నారు. ఇంక నేనును నార్యపుత్రుని విజయమున కై మాయిలవేల్పు నారాధింపఁ బోయెదను. (నిష్క్రమించును)

(అంత విద్యాధర దంపతులు ప్రవేశింతురు.)

విద్యా:—ప్రేయసీ!

గీ. కలన జీవంబు విడిన రాకాసి బంట్లు
చొచ్చు చున్నా రిదే చూడు సూర్యు నందు;

అస్తమయ వేళఁ గనక సహస్ర పత్ర
గర్భమునఁ జొచ్చు మత్తభృంగమ్ము లట్లు. 24

మఱియు.

గీ. బోటి ! యటు పైని వా రెల్ల బొట్ట వెట్టి
వెడలి పోయిన దిననాథు బింబ మందు
నిండుకొనెఁ జూడు చదలుఁ గ్రోందీవ యింటి
నడిమి భాగం బనెడు మేలి గోడు కు నీడ. 25

విద్యాధరి:—నాథా ! రణరభస భరమ్మున నుప్పతిల్లిన పులక పటల మ్ములు భుజవనమ్మునకు మొగ్గలై తనరారఁ గపిసేనా చక్రం బున కెదురై వచ్చుచున్న యీతఁ డెవ్వఁడు ?

విద్యా:—సంగ్రామ కౌతుకమ్మున బయలు దేఱిన దశకంఠుఁ డతఁడు.

విద్యాధరి:—కాటుకకొండ వంటి శరీరకాంతులతో నాతని కెదురు గాఁ బరువెత్తుచున్న యీకపివీరుఁ డెవ్వరు ?

విద్యా:—ప్రేయసీ ! ఆతఁడు విచిత్ర సమరకలా శీలుఁడు నీలుఁడు సుమా (చూచి (విస్మయముతో)

ఉ. నీలగిరీంద్ర శృంగమును నీలుఁడు బిట్టెద పైని వైవఁగాఁ
దోడన నవ్వి పంక్తిముఖ ధూర్తుఁడు నెమ్మది సంస్మరించెఁ బూ
బోఁడులు మానవారినిధి బొంగిన వేళలఁ గర్ణభూష యౌ
నీలసరోరుహమ్మునను నీటుగ మోదిన యట్టి ప్రేటులన్.

(మఱలఁ గౌతుకముదో) ప్రేయసీ ! చూడు చూడు.

ఉ. బంతిని బోలె నీలు నలపంక్తిముఖుం డవలీలఁ బట్టి య
త్యంతమఁు ద్రిప్పుచు డ షతఁ ఘాతని సర్వకరాబ్జ సంతతిన్

వింత దలిర్పఁ దేఁటి కరణిన్ మఱి వాని కిరీట పీఠికా
ప్రాంతము లందు నింద్రమణి యట్లును గన్పడెఁ గొక్కెఁడయ్యునున్.!

విద్యాధరి:—నాథా ! నిశాచరేంద్రునితో సమముగా సమర సాహసమున గొడంబడి నిలిచి యున్న యీనిశాచరుఁ డెవ్వఁడు :

విద్యా:—అతఁడే స్వామి పక్షపాతి యగు విభీషణుఁడు. (చూచి విషాదముతో) అబ్బా ! యిం కెట్లు ?

గీ. క్రూర దానవ చంద్ర నిర్ముక్త మగుచు
శక్తి యొకటి విభీషణు చక్కి నెగసె

విద్యాధరి:—పిదప నే మైన దాశక్తి ?

విద్యా:—

అడ్డముగ వచ్చి లక్ష్మణుం డక్కునందుఁ
బ్రేయసిం బోలె నద్దాని స్వీకరించె.

విద్యాధరీ:—కష్టా ! మెంత పని జరిగినది ?

విద్యా:—ప్రేయసీ ! యిటు చూడుము. అమ్మహా భయంకర శక్తి ప్రహారంబున సోలిపడిన లక్ష్మణుని కపిసమూహంబులు గొంపోయి రాము నంకభాగమ్మునం జేర్చు చున్నారు.

ఔరా !

చ. ధనువున నుండి మిట్టిపడు దారుణ కాండములన్ దశాస్యునిం
గనువగ నుండి జాఱిపడు కాండములం దొడ మీఁది తమ్మునిన్
మనుచుచు హర్ష శోకములు పొంగి ప్లవంగుల కంట మూఁగ నొం
టన నెలవయ్యె వీర కరుణమ్ముల కీరఘునేత కోమలీ !

(చూచి) ఔరా ! రామ నారాచమ్ముల తాఁకున కోప లేక దశకంఠుఁడు మరలి పోయినాఁడు గదా !

(నేపథ్యమున)

శా. హావత్సా ! రఘువంశపోత ! గుణరత్నాంభోనిధీ లక్ష్మణా !
వేవేగం గను విచ్చి చూడు మదియే నే తైన నర్కాన్వయ
శ్రీవిస్ఫూర్తియు రాము జీవితము నుర్విం బేరు లే కొక్కటం
బోవే ! యూర్మిళకంటికాటుక లయంబుం జెందదే తమ్ముఁడా!

విద్యా:—కట్టా ! అనుజ వత్సలుం డగు రామునివిలాపము గదా యిది !

(నేపథ్యమున)

దేవా ! యూరడిల్లు మూరడిల్లుము.

విద్యాధరి:—నాథా ! సుగ్రీవుఁ డూరడించు చున్నాఁడు గాఁబోలు రామచంద్రుని కావున నిప్పు డేమనునో !

విద్యా:—ఊరడించు చున్న సుగ్రీవునికో రాఘవుఁ డేమనునో యాకర్ణింతము గాక.

(నేపథ్యమున)

సఖా సుగ్రీవా ! యెట్లూరడిల్లఁ గలను !

ఉ. శ్లాఘ దలిర్పఁ బౌరులును సంయములున్ సుధలొల్కు నట్టులో
రాఘవులార యం చు మధురమ్ముగఁ బల్కుట లాలకించి యో
రాఘవుఁ డా యటన్న విషరాశి నిభ మ్మగు పల్కు నిప్పు డీ
రాఘవ వంశ పాంసనుఁడు రాముఁ డెటుల్ విన నేర్చు భానుజా !

మఱియు,

చ. అడుగుల కేను మ్రొక్కఁ జను నప్పుడు నాపినతల్లి యెంత చే
ద్పడునొకొ నాదు పార్శ్వ మిటు పాడగుటం గని హా! యిదేటియా

గడ మిటు లంటి నీచెడుగుఁ గట్టియ నింకను దాల్తు నేనియుం
గడ చనదే ఋణం బిఁకను నాకు నయోధ్యకు నేఁటి తోడనే.

విద్యా:—ఆహా! కరుణైక సముద్ర ... పొంగినది. (విమర్శించి) ఇపుడు దీనికిఁ బ్రతీకార మేమి? (ఆలోచించి) కట్టా! యిఁకఁ బ్రతీకారంపు గాథ యెక్కడ? విధి వక్రించెఁ గదా!

విద్యాధరి:—మిక్కిలియు వక్రించె ననుము. ఇటు చూడుము. ఎవఁడో వానరుఁ డొకఁడు లంకేశ్వరునితో సంధి చేసికొని కరతలంబున నొక శైల శిఖరంబు గ్రహించి రామునకే యెదురై పరువెత్తు చున్నాడు.

విద్యా:—(చెవులు మూసికొని) పాపము శమించుఁ గాక. పాపము శమించుఁ గాక. ఓసీ ముద్దరాలా! అట్లనకుము.

గీ. నిఖిల సంజీవనౌషధులకును నిలయ మైన
గంధమాదన గిరిని వీఁకను గ్రహించి
లక్ష్మణ ప్రాణ రక్షణోల్లాసి యగుచు
వచ్చు చున్నాఁ డిదే జగత్ప్రాణ సుతుఁడు.

(మరలఁ జూచి హర్షముతో)

గీ. కలిత ఘనమూలికా సమాఘ్రాణమునను
గన్నుఁ దమ్ములు విచ్చి లక్ష్మణుఁడు లేచి
క్రమ్మఱను విల్లు వలయమ్ముగా నొనర్చి
రాముఁ గావించెఁ బరిపూర్ణ కాము సబల!

విద్యాధరి:—నాథా! రామరణ కుతూహలమ్మున వికసిల్లు చున్న భుజమండలమ్ముల తోడ నిశాచరాఖండలుండు మఱల వచ్చు చున్నాఁ డేమి?

విద్యా:—ప్రియా ! ఇప్పుడు సావధానముగాఁ దిలకింపుము. రామ రావణ యుద్ధ మన నే మనుకొంటివో ! వీరలక్ష్మినిఁ బ్రాసునం దూఁచుట యని తలంపుము.

విద్యాధరి:—నాథా ! సకల లోకైక వీరుం డగు రామచంద్రునకును ననేక వీరులచే భరిభవింపఁ బడిన రావణునకును వీరలక్ష్మి తులాధిరోహ మెట్లు ఘటిల్లును ?

విద్యా:—ప్రియా ! యెఱుంగవు సుమా ! రావణుం డన్న సామాన్యుఁ డని తలంచితివి గాఁబోలు.

మ. దళితైరావణ కుంభ ముక్త బహు ముక్తా వ్యక్త హాసౌఘు పై
బలభి త్కీర్తి శశిఘ్ను మైన యసి యత్యాశ్చర్యలిం బొల్చు న
ప్పుల భుజాంధుఁడు దక్క ఖడ్గకలహ వ్యాఘ్రుం డిఁ కేపోఁడ తా
దులుపున్ ముట్టకె వేల్పుబోంట్ల కుచకస్తూరీ పరాగచ్ఛటన్. 35

మఱియు నోసుందరీ ! పూర్వ మాతఁడు మహేంద్రునిపై దాడి వెడలి నపుడు.

గీ. బలములకు నెల్ల రక్షాకవాట మగుచు
నమరు నిజవక్షమునఁ గఠోముగఁ బడెడు
పిడుగు దెబ్బల జడికి నవ్విన భటుండు
పంక్తిగళుఁ డన సామాన్య బలుఁడె చేల ! 36

మఱియు నొక మాట.

గీ. కప్పురం బను కొలఁకునం దొప్పు మీఁఱు
నిజకరాంబుజ వనిలోన రజత గిరిని
దానిపై నున్న నవచంద్ర ధరునితోడ
నంచ గావించె నితఁ డే మనందు మబల! 37

(నేపథ్యమున)

సీ. బాలేందు ఖండంబు మౌళిఁ దాల్చిన వాని
పృథివీధ్రమును లీల నెత్తె నెవ్వ
లేలిహాన మనుష్య లేఖోత్కరము నెల్ల
భయపయోధిని ముంచి వైచె నెవ్వ
దైవనాథుని రాజధానికిం దొడవైన
యుత్పలాక్షుల బంది నునిచె నెవ్వ
జానకీ స్తనకుంభ చందనంబునఁ దోఁగు
నుత్కంఠ నువ్విళ్ళు లూరు నెవ్వ
గీ. చెలఁగి లంకాపురమును రక్షించు నెవ్వ!
అట్టి లోకైక వీరుఁ డై యలరు నట్టి
శ్రీదశాస్యుని చండ దోర్విభ్రమములు
సలుపు చున్నవి వీరసంచార మిపుడు. 38

(మఱల నేపథ్యమున)

సీ. బాలేందు ఖండంబు మౌళిఁ దాల్చిన వాని
కోదండమును లీలఁ గూల్చె నెవ్వ
లేలిహాన మనుష్య లేఖోత్కరము నెల్ల
ప్రమదాంబునిధిఁ దేల్చి వైచె నెవ్వ
దైవనాథుని రాజధానికిం దొడవైన
యుత్పలాక్షుల బంది నుడుపు నెవ్వ
జానకీ స్తనకుంభ చందనంబున దోఁగి
యానంద కందంబు లయ్యె నెవ్వ
గీ. చెలఁగి లంకాపురమును భంజించు నెవ్వ
అట్టి లోకైక వీరుఁ డై యలరు నట్టి

శ్రీరఘుప్రభు చండ దోర్విభ్రమములు
సలుపు చున్నవి వీరసంచార మిపుడు. 39

విద్యా:—ప్రేయసీ! నిక్కముగ నిది నిశాచర శాఖాచర సమూహమ్ములు తమ తమ యేలికలం గూర్చి పొగడుకొను చొప్పు సుమా!

విద్యాధరి:—నాథా! రథముపై నున్న రావణుని తోఁ బోరుటకు ధరపై నున్న రామునకు వీ లగునా?

విద్యా:—ప్రియా! చూడుము. మాతలి యింద్రరథంబుఁ గొని తెచ్చినాఁడు. వినయాభిరాముఁ డగు రాముడు దాని నెక్కను గూడ నెక్కినాఁడు.

(నేపథ్యమున)

ఓరీ నిశాచరా!

గీ. ఖరుఁడు మారీచుఁడును ప్లవంగ ప్రభుండు
నెంత కాలమ్మునకు మున్నె యేగి నట్టి
దారినే త్రొక్క వేఁడుక గూరినావు
వారి నేస్తంపు టప్పు దీర్పంగఁ గోరి. 40

విద్యా:—ఈరామ వచనమ్మునఁ బీడితుం డగు రావణుం డిప్పు డేమనునో విందము గాక.

మ. ఖరసత్వం బది యెంత, వాలియుఁ బ్లవంగం, బల్ల మారీచుఁడున్
హరిణం, బిట్టి మృగార్దనంబు నొక శౌర్యక్రీడయే! చూడు మి
త్తఱి నేతెంచె దశాస్య నామక లస త్పంచాస్య ముద్యద్వియ
చ్చర నాగేంద్ర నిమిత్త దత్త రణలాస్యం బోరి వీరబ్రువా!

అయినను,

చ. గిరితనయా మృగేంద్ర ఘన కేసర నిర్మిత చామరానిలాం
కురములు స్వేదవారి కణకోటుల దూల్ప మహావిభూతి బం
ధురుఁ డయి యొప్పు పంక్తివదనుం డిఁక నెట్టి మహా యశోధురం
ధరత వహించుఁ బంచవదన ప్రతిపాదన చేత నేనియున్.

విద్యా:—ప్రేయసీ! దశకంఠుని గర్వాలాపములకుం గినిసి లక్ష్మణుం డేమో చెప్పఁ దలఁచి నట్లున్నాఁడు.

(తెరలో)

నీవు పంచాననుఁడ వైన నేమి? దశాననుఁడవైన నేమి కావున నిఁక వెంటనే

ఉ. దూరము గాఁగ గర్వమును ద్రోలి విభీషణు రీతి నీశిరో
హారము వంచి రామచరణాబ్జములం దళి గమ్ము, కానిచో
క్రూరుఁడ! కుంభకర్ణు గతి శ్రోత్రతటీ వలయాయమాన దు
ర్వార ధను ర్విముక్త శరవహ్నిఁ బతంగము వైనఁ గమ్మిఁకన్.

విద్యాధరి:—నాథా! యిటు చూడుము. శరాంధకారమ్మును విస్తరింపఁ జేయుచు దశముఖుం డిపుడు నిశాముఖుం బై యున్నవాఁడు.

విద్యా:—ప్రేయసీ! నిజవిశిఖ మయూఖధారా పరంపరలచేఁ దదంధకారం బెల్లఁ బటాపంచలు గావించుచు రామచంద్రుఁ డిప్పుడు చంద్రుఁ డై యున్నాఁడు. (కౌతుకముతో) కాంతా! లంకేశ్వరుండు విడిచిన దివ్యాస్త్రంబునే కాక యాతని శరాసనంబుం గూడఁ దనదివ్యాస్త్రంబుచే ప్రతిహతంబు గావించి రామచంద్రుఁ డిప్పు డాతనితో నేమియో పలుకఁ దలఁచి నట్లున్నాఁడు.

(తెరలో)

గీ. ధనువు మునిగె నటన్న సంతాప కలన
వంత వహియింపఁ బోకు రవ్వంత యేని
అన్య సాధన మేదేని యవధరించి
సిద్ధపడు మోరి సాహసా! యుద్ధమునకు. 44

విద్యాధరి:—ఇప్పుడు రావణుఁ డేమనునో విందము.

(తెరలో)

మ. కనలెం బో నిజనామ తుల్యతకు నాగా నెద్దియద్దేవతా
వనజాక్షీ ముఖచంద్ర హాసమును బైఁబై నానెనో పేర్చి య
ట్టి నితాంతోద్ధత పంక్తికంఠ భుజ పాటీరాటవీ వాటికా
ఘనసర్పం బగు చంద్రహాస మిదిగో! కన్గొమ్మురా దుర్మతీ! 45

విద్యా:—ఔరా! రామచంద్రుఁ డిప్పు డాచంద్రహాసమును గూడఁ దునియలు గావించి నాఁడు. ఇఁక రావణునితో నే మనునో.

(తెరలో)

కట్టా! రావణుఁ డిప్పు డెంత పొగులునో గదా!

విద్యాధరి:—రావణుఁ డేమి ప్రత్యుత్తర మిచ్చునో!

(తెరలో)

ఓరీ! రావణుఁ డిప్పుడు మాత్రమే పొగులు టేమి! మొఱుం గవు గాఁబోలు వినుము.

సీ. పదియు దిక్కుల గెల్చెఁ బ్రత్యేకముగఁ బేర్చి
బాహువుల్ పది శౌర్యపటిమ దోఁప
అద్రిసారాధ్యమ్ము లగు బాహు లిఁకఁ బది
శిక్షించినవి ఘాతచేటు గాగ

తాడింతునా పట్టి దనుజ మర్దను నన్న
కనుపించఁ డాతండు కడలి డాఁగి
దండింతునా ముట్టి తరుణేందుధరు నన్న
నర్చనీయుం డయ్యె నతఁడు నాకు

గీ. కాన నీకఁ జేయఁ దగినట్టి గార్య మొద్ది
యనుచుఁ జింతించికొనుచు లంకాధిపుండు
పొగులు చుండును రోరి యేప్రొద్దుఁ గూడ
రేయిఁ బవ ను గనుఱెప్ప మూయ కుండ

విద్యాధరి:—ఇపు డట్టి మాట మాత్రమే శేషించి యున్నది.

విద్యా:—ప్రేయసీ! అట్లు గాదు సుమా! చూడు మిప్పుడు

మ. ధనువున్ వాలును దొట్టి సాధనము లస్త్రం బంద నల్కన్ దశా
ననుఁ డారాముఁడు ద్రుంచి నట్టి తలలం దానొక్క చేపంక్తినిం
గొని వేఱొక్కట నొక్కపెట్ట రఘుచంద్రుం డాకఁగా ఱువ్వుచుం
దన దోర్దండము లిర్వదింటి నొకటం గావించె ధన్యంబులన్. 47

(మరలఁ గౌతుకముతో)

మ. నఱుకం బడ్డ దశాస్య శీర్షములు విన్నం బోవు బృందారకే
శ్వరు రోమాంచ మటుల్ వయిం బయిని దోఁపం దోఁప నవ్వాని ను
క్కఱగా నేతమె క్రీడఁగా గొనిన సీతాధీశు నాత్మన్ మఱి
న్మఱి నుప్పొంగ దొడంగె విస్తరిలి యానందోర్ము లంతంతకున్ 48

విద్యాధరి:—ఔరా! యే మిది! నిశాచరేంద్రుఁడు చెఱఁ బెట్టిన దేవతా సుందరుల దర్శన మింక నైన మనకు గలుగు నను నమ్మకము లేదు. ఏల యన మాటి మాటికి రాఘువేంద్రుఁడు దునుమాడు చున్నను నీరక్కసుని తలలు మఱల మఱల మొలచుచునే యున్నవి.

విద్యా:—సుందరీ! పరితపింపకుము. రావణునితో రాముఁడింకను క్రీడించు చున్నాఁడు గాని వానిపైఁ గోపించుట లేదు. (మఱల) జూచి కౌతుకముతో) ప్రియా! యిటు చూడుము.

మ. కలుకుం గోలల రాఘవేంద్రుఁ డొకటన్ ఖండించినన్ లోన నా
హాగ జూటుండు సుధారసంబు నిబిడం బై యుంటచే నో యనన్
మఱలన్ మొల్చు నిశాచరాధిప మహామ స్తంబు లందుండి దు
ర్భర మూ శాంతివిశేష మీదా పొడతేరం జొచ్చె శాతోదరీ! 49

(మరలఁ గౌతుకముతో నవ్వి) ఔరా! యేమి యీతని చిత్తవృత్తి!

మ. శిరముల్ ద్రుంచుట యందె సక్తుఁ డగు నాశీ్రరాముఁడల్కంబ్రుధూ
దర మెందాకను జీల్పఁ డందనుక నీదై త్యేంద్రు డుత్సాహమీ
కరముం జెందఁగఁ జొచ్చెఁ జూడ నిది యుక్తంబె కదా! యేలనా
నిరవుం గల్పన సేసెఁ గాదె యతఁడా పృధ్వీజ కచ్చోటనే.

(తెరలో)

లోకప్రియా! రామచంద్రా!

గీ. ఆఁకుకొనె దేల యింకను నంపగముల
ప్రీతి మెఱయంగ నిపుడ పూరింపు మయ్య!
ప్రదర మొక్కంట మామనోరథము నట్లె
కీర్తి పూరమ్ముచేఁ ద్రిలోకీ తలమ్ము.

ఇదిగో! దేవతలు రామచంద్రునిఁ ద్వరపెట్టు చున్నారు. ఇది యంతయు రావణుఁడు విన్నాఁడు. ఇఁకనేమనునో విందము.

(తెరలో)

ఓదశకంఠ భుజములారా !

మ. హర జూటా శశిరేఖ దక్క సకలాశాధీశ చూడామణుల్
వరుసం దెండవి యెల్లఁ గూర్చి రచియింపం బడ్డ నోడాఁ ముం
జిరముం దాలుచుఁ గాత సీత తనశ్రోణీ వీథిపై శింజితో
త్కర దంభంబున మత్పరాక్రమ కథా గానంబు గావించుచున్.

విద్యా:—(నవ్వి) లంకేశ్వరా ! నీవు కాలజ్ఞుడవు. సుమా ! ఏల యన నీభుజబలము కే పని చెప్పుకొంటివి. నీ కిప్పు డవియే కదా పరివారవర్గము. (చూచి సాభిప్రాయముగా) ఔరా ! యీరావణుని మాటకు సీతాకాంతుఁ డించుక కినిసిన ట్లున్నది. (మరల హర్ష విషాదములతో) అయ్యో ! పాపము !

చ. ప్రవిమల పుష్పసంతతుల భాసిలు నైందవ రత్న తల్ప మం
దెవఁడు పరాగ భూషుఁడయి హేల మెయిం బవళించు, నట్టి దా
నవకుల నాయకుండు రఘునందనుఁ డించుక యల్గి నంతనే
భువిఁ బడి యున్నవాఁ డిపుడు బ్రుంగి పరాగము లోన సుందరీ !

విద్యాధరి:—ఔరా ! దైవవిలాసము ! (హర్షముతో) అగుఁ గాక. జానకీదేవి యిప్పుడే శ్రీరామచంద్రునితోఁ గలియునుగాఁబోలు.

విద్యా:—కాదా మఱి.

శా. జ్వాలా మాలిక భీకర మ్మయి దిశాచక్రంబు వెల్గింపఁగా
లీలం బేర్చిన వహ్నిలోనఁ గడుఁ దాల్మిం జొచ్చి దుర్గాంత శో
భా లాలిత్య సమేత యాచు వెడలెన్ వైదేహి తా నియ్యదే !
బాలాదిత్య వినూత నాంశు కలికా భంగిం గురంగేక్షణా !

విద్యాధరి:—నాథా ! యిటు చూడుము. అసమ సమర కదర్థితంబైన యీసంగ్రామ రంగంబు దాటంగి రామచంద్రుఁ డిదిగో యీవల వచ్చు చున్నాఁడు.

విద్యా:—అవును. మన మింకఁ బోవుదము రమ్ము. ఈ కర్ణామృతము శచీదేవికి నివేదింతము.

(నిష్క్రమింతురు)

[అంత రాముఁడును సీతయు లక్ష్మణుఁడును సుగ్రీవవిభీషణులును] ప్రవేశించు చున్నారు.

రాము:—భగవానుఁ డగు జగద్బాంధవుఁడు పశ్చిమాచల శిఖరంబుఁ జేరఁ బోవు చున్నాఁడు.

లక్ష్మ:—అంతియే గాదు. పశ్చిమ సముద్ర తీరంబును గూడ జేరఁ బోవు చున్నాఁడు.

మ. హరిదంత ద్విరదేంద్రముల్ సెవుల నిట్టట్టూఁచి కొట్టంగఁ ద
త్కరి గండంబుల వీడి పాఱు భసల గ్రామంబులో నాఁగ బం
ధుర మై యాకస మెల్ల గ్రమ్ముకొని కస్తూరీ సమాన ద్యుతిన్
విరియం బాఱఁగఁ జొచ్చె నెల్లెడఁ దమో బృందంబు లంతంతకున్.

రాము:—అవును రాకాసి గుంపులం బోలు తిమిరంపు రాసు లెల్లెడల నల్లుకొను చున్నవి.

విభీ:—అయిన నేమి ? శ్రీరామచంద్రుని ప్రచండ శరకాండంబులం బోలు రేయెండ తండంబులు పొడ తేరనే తేరినవి.

సుగ్రీ:—అవు నట్లే !

సీ. క్షీరాంబురాశి వీచీకాండముల యందు
ఫేన పుంజములతో వియ్యమాడి
విమ లేందుకాంత రత్నము లందు జాల్గొన్న
జల శీకరములతోఁ జెలిమి సేసి
ప్రవిమలోత్ఫుల్ల కైరవ గర్భముల యందు
ధూళి పుంజములతోఁ గేళి సలిపి

స్ఫురిత చాకోర చంచూ కాననము లందు
ఖండంబు లై వెండి గండరించి

గీ. ప్రియుల యెడబాటుచేఁ బొక్కు భీరువుల శ
రీరవల్లుఁ గడు జమత్కృతుల నెఱపి
సిగ్గు లాలికించు తేట వెన్నెలల గుంపు
ఒల్లుకొను చున్నయవి చూడు మెల్ల యెడల. 56

విభీ:—అవు నట్లే !

ఉ. శంకర వామగాత్ర తల సంగత శైలకులేంద్ర కన్యకా
కుంకుమ పంక లిప్త కుచకోరకముం బలె నొప్పుచున్న యే
ణాంకునిఁ జూపుకోఁ దొడఁగె నంబుజినీ జన మెల్ల నున్నమ
త్పంకజ కోరక చ్ఛలనఁ బాటిలు వ్రేళుల చేతఁ, జూచితే. 57

రాము:—

ఉ. వారిజ వైరి పేరి పరిపాండుర గండము మీఱగా నభో
నారి తమో వియోగమునఁ దద్దయుఁ దాపము జెందు చుండఁగా
దారక శీకరమ్ములను దట్టముగా మొయిఁ జల్లి చంద్రికా
పూర పటీర సారమును బూసె నిశాసఖి తాప శాంతికై. 58

(మఱల నపహరించి సీతను గూర్చి)

మ. అమృతాంభోధి తరంగబిందు వగు నియ్యబ్జుం డెటుల్ గాంచు నో
రమణీ! కాంతి పయోధి యైయెసఁగు నీరమ్యాస్యపుం దేటు లే
శమునం, గానఁ గటాక్షు నుద్దెస నిమేషం బెత్తు మాపైని నీ
హిమధాముం డగపట్టుఁ గల్వవని యుం దింపొందు హంసంబుగన్

సీత:—(లజ్జ నటించి చూచి హర్షముతో) ఆహా! చంద్రుఁ డుదయించి
మింట వెలుగొందు చున్నాఁడు.

గీ. తామరసముల ముఖసంపదలు దొలంగ
మానవతులకు మానంబు మడిసి పోవ
జగములకు నెల్లఁ బందువు సంధిలంగ
రజని ముఖచందనం బైన రాజు దోఁచె.

రాము:—నెచ్చెలీ సుగ్రీవా! చూచితివా!

సీ. క్షణదా వధూమణీ స్తనకుంభ వీధికా
స్థగిత చందనసార చర్చ యనఁగ
కాళీ మనోనాథ ఘనజటా వల్లరీ
కలిత నూతన కోరకం బనంగ
కుసుమసాయక మహాక్షోణిపాల నిమిత్త
నిర్మిత స్ఫటిక మందిర మనంగ
దివిజ వల్లభ దిశాయువతి నాసా తలా
గ్రస్థిత నవమౌక్తికం బనంగ

గీ. ప్రథిత గగనేందిరా చామరం బనంగ
రాజిలుచు నున్న యట్టియీరాత్రి కరుని
విమల రోచిర్మరీచికా విభ్రమంబు
గరలి లోకము నెల్ల వెల్గింపఁ జొచ్చె.

సుగ్రీ:—దేవా రఘుకులేశ్వరా! యీచంద్ర వికాస మంతయు సముద్రముపైఁ గురిసిన వాన.

రాము:—అ దెట్లు?

సుగ్రీ:—ఎట్లని వేఱ యడుగ వలెనా?

సీ. హరు జటాతటి యందు నమలినం బై యొప్పు
కుముదినీ ధవుని ఖండమున కంటె

ఆకాశ కూపాంక పాంతరంబున యందుఁ
దనరారు తోరంపుఁ దరగ కంటె
చంచలాక్షుల చలాచల మైన కడకంట
సొంపు లీనెడు సోగ చూడ్కి కంటె
దెసల నన్నిట నిండు తేట కాంతుల పిండు
రాజిల్లు కపురంపు రాశి కంటె

గీ: కుముద కైతక కంద పుష్పముల కంటె
తెల్ల నై యొప్పు తావకోద్దీప్త కీర్తి
పుంజముల చేతఁ దెల్ల నై పోయెఁ గాద
స ప్త వారాశి వేష్టిత క్ష్మాతలంబు. 62

రాము:—చాలు నీతుచ్ఛప్రాయ సంభాషణము.

విభీ:—దేవా! సుగ్రీవుఁడు వల్కినది తుచ్ఛప్రాయమే. ఏల యన త్రిలోకీతల మంతియుఁ దెల్లపడి పోయె ననుటకు మాఱు క్ష్మాతలము మాత్రమే తెల్లపడి పోయె నని చెప్పినాఁడు. మఱియు,

ఉ. తుంబిఫలంబు చన్న పయిఁ దుందుడు కొందఁగ వీణ లూని వే ల్పుంబడతుల్ సెవుల్ దనియ పోల్కిని బాడుచు నున్నవారు ఫా లాంబకు మౌళి నొప్పు నమృతాంశుని ఖండము నడ్డగించు కాం తిం బొలుపారు నట్టి భవదీయ యశమ్మును రాఘవేశ్వరా!

రాము:—ఓయీ లంకేశ్వరా విభీషణా! నీవును కిష్కింధా పతినే యనుసరించితివి.

లక్ష్మ:—ఆర్యా! జానకీ! చూచితివా!

గీ. పొదలి కుముదాదులానందమునఁ జెలంగ
హేల మై నంబరాభోగ మెల్ల నొకట

దాటుచున్నాఁడు యామినీ ధవుఁడు దేవి !
కడలిఁ దరియించు హనుమంతు కరణి నిపుడు. 63

జాన:—ఓయీ సులక్షణా లక్ష్మణా ! రఘుకుల కుటుంబ సంతాప శమన చందనం బగు హనుమంతుఁ డిపు డెచట నున్నాఁడు ?

లక్ష్మ:—దేవీ ! బాంధవ జనంబు నెల్ల సంతోష పఱచుటకై రాఘువేశ్వరుఁ డాతని నిప్పు డయోధ్యకుఁ బంపి యున్నాఁడు.

సీత:—అట్లయిన మన మిఁక నాలసించు టెందులకు ?

రాము:—విభీషణునిఁ జూచును)

విభీ:—(నిర్గమించి మఱలఁ బ్రవేశించి) ఇది పుష్పకం బను విమాన రత్నము. ఎక్కుదురు గాక.

(అందఱును నెక్కుదురు)

రాము:—(కౌతుకముతో) ఔరా ! త్రిభువనైక వీరుఁ డగు కుబేరానుజుఁడు రావణుఁడు కుబేరుని చెంతనుండి హరించిన విమాన రత్న మిది.

లక్ష్మ:—(కోపముతో) ఆర్యా ! ఇతనిని మించిన వారు వాలి కార్తవీర్యు లుండ నితఁడు త్రిభువనైక వీరుఁ డెట్లగును ?

రాము:—(నవ్వి) వత్సా ! అగుఁ గాక.

ఉ. ఆవిధి గాటమైన భుజయంత్రపు టొత్తిడి పెల్లునన్ దశ
గ్రీవు గళప్రదేశములు గిక్కురు మొక్కురు లేక యుండియు
న్నావిరిఁ జాటె నేఘనుని భవ్యయశస్సుఁ జతుస్సముద్ర తీ
రాఘనులందు నట్టి ప్లవగాధిపు వర్ణన సేయ శక్యమే. 64

మఱియు,

శా. ఘోరామర్షను నిప్పుఁ గ్రక్కు నిజదృక్కోణంబులే దీపికా
వారం బై తిమిరమ్ము నెల్లఁ దొలఁగింపం దొల్లి మండోదరీ
నారీ నాథుఁడు గూడ నెవ్వని చెఱన్ వర్తించుటల్ గల్గె నా
శూరున్ హైహయనాథు నేని దరమే స్తోత్రంబు గావింపఁగన్. 65

మఱియు నాలోచించి చూడ,

చ. తనుముకొనంగఁ బద్ధ తల దొంతి కుదుళ్ళ జటించుఁ బిండి త
జ్జనిత సుధామహత్వమున శంకరుఁ డెవ్వనిఁ గాచి చంద్రమం
డనుఁ డను విశ్రుతంపు నిజనామము సార్థక మయ్యె నంచుఁ దా
ననుకొనె నట్టి ధీరుని దశాస్యుని సన్నుతి సేయ శక్యమే. 66

(నిర్వర్ణించి) ఔరా! త్రికూటగిరి శిఖర కంఠీరవం బగు దశ
కంఠుని లోకోత్తరంబు లగు చరిత్రంబుల నెంతని కొనియాడఁ గలము?

మ. హరశైలం బెతఁ డెత్తిపట్ట గతభారాహీంద్ర చంచత్ఫణా
భర మాణిక్య గణద్యుతుల్ పయిఁ బయిం బర్వన్ దిశల్ నాలుగుం
స్ఫురిత క్రోధము చే నెసంగు హరు కన్నుల్ మూఁడు నొక్కుమ్మడిం
బరగెం దొల్లి నకాల బాల రవిబింబ స్ఫార తామ్రంబు లై. 67

లక్ష్మ:—ఆర్యా!

గీ. దీనిపై నెక్కి మన మెంత యేని దవ్వు
వచ్చినను గూడ శ్రమము గన్పడ దొకింత
కానఁ గ్రీశార్థ మై రూపుఁ గైకొనిన మ
నోరథం బేమొ! తలపోయ నీరథంబు. 68

రాము:—వత్సా! అట్లే తోఁచు చున్నది.

గీ. వసధిఁ దరియించి దండకా వనులఁ గడచి
నర్మదా భానుతన యాది నదుల దాటి

సేర వచ్చితి మిపుడు మాయూర కుల వి
హారముల నొప్పు చిత్రకూ టాగ్రమునకు. 6౨

సీతా:—(వెను దిరిగి చూచి) ఆహా! తల్లీ కాళిందీ! నీయనుగ్రహ మమోఘ మైనది. ఏల యన నీ కుటుంబమునకు మఱల దర్శన మిచ్చితివి.

రాము:—ప్రేయసీ! యిది భగవానుఁ డగు భరద్వాజుని యాశ్రమ ప్రదేశము. సత్వంబు లిచట పరస్పర విరోధము లేక చరించు చుండును.

లక్ష్మ:—అవును.

మ. కలిత ప్రక్రియ నోరు విచ్చుకొను సింగంబున్ సమీపించుచుం
గలభంబుల్ వెస జూలు కుచ్చులను లాగం జొచ్చె నిచ్చోటఁ, గూ
నలు నిండారఁగఁ ద్రావి వీడిన మృగేంద్రస్త్రీకుచం బంది పా
ల్గుడువం జొచ్చె మఱొక్క కొన్ని యిట సంకోచంబు లేకుండగన్.

మఱియు,

ఉ. ఆటల నాడు కూనల పదాహతి మేల్కని నట్టి వేపిపె
న్గోటను దీటవోవ మృగి గోకికొనంగను జొచ్చె, ముక్కుచేఁ
బాటిగ నెమ్మి గీఱుటను బై కుబుసమ్ము దొలంగ పాము బల్
సీటుగఁ గ్రోలఁ జొచ్చె నిట నిద్రిలు ముఁగిసయూర్పుగాడుపున్.

రాము:—ఔరా! చక్రవాక రమణీ సంరంభ సమయ మగు ప్రభాత సమయము సంప్రాప్త మైనదే!

లక్ష్మ:—అవు నట్లే తోఁచెడిని.

శా. సద్య స్సంఘటమాన కోకమిథున చ్ఛద్మ స్తనద్వంద్వనా
వద్య వ్యంజిత యౌవనద్యుతుల దిగ్బాలామణుల్ మీఱఁగన్

మాద్య ద్బంభర దంభ దుష్టవిధి వర్ణశ్రేణులం ద్రుల్చి సం
పదోద్యోగంబు ఘటించెఁ బద్మినుల కీ భానుండు చంచద్గతిన్. 71

రాము:—జానకీ!

గీ. హేలఁ జలియించు తరగల డోల లందు
నల్ల మివురొత్త నుయ్యాల లూఁగి యూఁగి
హంసకులములు క్రీడింప నలరు నిదిగో!
దేవి త్రైలోక్య పావని దివిజ గంగ.

(సీత హర్షముతో దాసినే పఠించును)

రాము:—(హర్షముతో) వత్సా లక్ష్మణా! ఇదిగో సమీపముననే రఘుకుల మంగళాంకుర ప్రరోహ కేదారధరణీ తరంగిణి యగు సరయూనది గన్పట్టు చున్నది. సరయూనదీ తరంగశీకరమ్ములచే పరిసరప్రదేశములు చల్లనై యుండఁ గనుపండు వై యొప్పు నగరీ సీమంతినీమణి సాకేత మిదిగో చూడుము.

లక్ష్మ:—(హర్షముతో) ఆర్యా! భరతుండు దన్ను వెనుకొని యుండ నీకు రాజ్యాభిషేకంబు సేయఁగోరి భగవానుఁ డగు నరుంధతీ వల్లభుండు

గీ. రఘుమహీనాయ కాన్వయ రత్న మగుచు
దెసల నన్నిఁటి వెలిగించు తేజ మెనసి
వచ్చు భాస్వంతు నిన్ను సత్వరతఁ జూడ
వేఁచి యున్నాఁడు గురుఁడు సంప్రీతి మెఱయ.

కావునఁ బుష్పకము నుండి దిగుదము.

రాము:—వత్సా! కొంచె మాగుము. సంపూర్ణ బింబావలోకనమ్మున కను వైన యీపుష్పకమున నుండియే యాఖండలాశామం

డనం బగు భగవానుని చండమరీచి నారాధించి పోదము.
(అంజలి వట్టి)

ఉ. తూరుపుబోటి దాలిచిన తోరపుఁ గుంకుమ బొట్టనంగ జం
భారి హరి ద్గిరీంద్రశిర మందు లసించెడు కెంపనంగ వి
స్తార జగత్త్రయైక గృహసంస్థిత మై తగు దివ్వె నాఁగ నొ
ప్పారెడు లోకలోచనుని కంజలిఁ గూరుతు భక్తి నియ్యెడ !

(తెరలో)

వత్సా ! రామభద్రా !

రాము:—ఔరా ! యేమి యీచిత్రము.

గీ. సకల పంకేజ వనసమాజముల లీల
మన మనస్సులు సమ్మోదవనధిఁ దేల
భానుబింబంబు నందుండి బయలు వెడలెఁ
బ్రభయునుం బోలె నెయ్యదో వాణి యొకటి.

(మరలఁ దెరలో)

చ. పటుపుమ కీర్తిపూరములఁ బద్మభవాండము నిండ, నుండు మి
ద్ధరవయిఁ బెద్దగాలమును, దావక సద్గుణ వర్ణనామృతం
బటిముటిఁ బాఱ, నాగ మను జామరు లెల్లయుఁ దేటి మోదసా
గరమునఁ దేలియాడుదురు గాక దిలీప కులైక భూషణా !

ఇంకను నీకేమి యాశాసింతును ?

సుగ్రీ:—జనకా దినకరా ! రామభద్రున కెల్లకోర్కులును బండియే
యున్నవి. ఎట్లన,

ఉ. కాంచె నఖండకీర్తి నిజకక్రమగుణమ్ములఁ, దండ్రియాజ్ఞఁ బా
లించె, విభీషణార్కజుల కిచ్చె మహోఘన రాజ్యలక్ష్మి, భం

## సప్తమాంకము.

జించె మురారి యైన దశశీర్షు మహాహవభూమి
గాంచెఁ బ్రమోదబాష్పములఁ గారుచు బంధుల నెల్లవారలన్.

అయిన నిట్లగుఁ గాక.

చ. జనముల కెల్ల విద్దియలు సంధిలుఁ గావుత బాల్యమాది, శం
భుని యము శౌరి పైని సమబుద్ధి ఘటిల్లుత, వాణి తోడి స్నా
ధును విడనాడి లక్ష్మి యెపుడున్ సుజనమ్ముల గేము లందు శే
షునిఫణ వీథు లందుఁ బలె సుస్థిర భంగి జెలంగుఁ గావుతన్.

రాము:—ఇఁక జాగు వలదు. పుష్పకము నుండి దిగి పోయి గురునకు నమస్కరించి బంధువులకును బౌరులకును సంతోషమును ఘటింతము.

(అందఱును బుష్పకము నుండి దిగుదురు)

చ. సరవి నెడంద్రఁ జేర్పగనె సంధిలు గగ్గురుపాటు పెంపునం
దరుణుల కౌఁగిలింపును దృణంబు నటుల్ రసికుల్ దలంపఁగా
విరిసిన జాజిపూ సరము వీఁకను నింపగు పల్కులం గవీ
శ్వరు లభిరామ రామగుణ వర్ణన కై వెలయింత్రు గావుతన్.

(అందఱు నిష్క్రమింతురు)

గద్యము.

ఇది శ్రీమ దత్రికులాత్రేయ కవిరత్న బిరుద ధౌరేయ శ్రీమ
దెరమిల్లివంశ పయఃపారావార సుధాకరాయమాణ
నారాయణ ప్రదత్త కనకకంకణ విరాజమాన హస్త
కుశేశయ కొండలరాయ నామధేయ
ప్రణీతం బైన ప్రసన్న రాఘవ
నాటకంబున సప్తమాంకము
సంపూర్ణము.

